# తూర్పు గోదావరి యాత్ర



వేసే ప్రతీ అడుగు...
ఒక అద్భుతం వైపు...









సంపాదకులు

సబ్బెళ్ళ శివన్నారాయణరెడ్డి

M.A., M.P.Ed., N.I.S(Yoga), P.G.D.J.,

**GODAVARI**

by Sabbella Sivannarayana Reddy



August 2013

Photos : *Srinivas Koyyana,* IIPC, FIP Mem., Kakinada. 9848095060

Layout & Design : *Badde Raja Srinivasu,* Samalkot. 9391947579, 9393 533440

Typeset at : *RM Graphics,* #18-13-2/5, Pleadergari Thota, Ganapathi Nagar, Samalkot - 533440.

For Copies : *Sudhita Book Centre,* Opp. Super Bazar, Main Road, Kakinada. (0884) 2358677, 2368678
*Sri Vinayaka Publications,* Kakinada. Cell: 9849611888, 87123 11000

Price : ₹ 1199/-

Printed at : *Pragati Offset Pvt. Ltd.,* Hyderabad

Website : www.godavariyatra.in



# నా మాట



సబ్బెళ్ళ శివన్నారాయణరెడ్డి
సంపాదకులు



బద్దే రాజా శ్రీనివాసు
డిజైన్



శ్రీనివాస్ కొయ్యాన
ఫొటోస్

ఇది ఒక మధురక్షణం. ఒక అనిర్వచనీయమైన అనుభూతి.. అవ్యక్తమైన ఆనందం... అవధులు లేని సంతృప్తి. అన్నింటికీ మించి అనంతమైన కృతజ్ఞతాభావం. తూర్పుగోదావరి... ఆంధ్రప్రదేశ్ ధాన్యాగారం. పర్యాటకులను తన సాంస్కృతిక వైభవంతో ఎంతో ఆకట్టుకుంటుంది. ఈ జిల్లా వేదనాదాలు... పక్షి గీతాలు... గుడి గంటలు... నినదించిన ప్రాంతం. ఒకవైపు సముద్రం మరోవైపు గోదావరి, పచ్చని పొలాలు, ప్రకృతి అందాలు, సప్తస్వరాలై శోభిల్లిన స్వర్గధామం. ప్రకృతి సోయగాలు... పంటపొలాలు ఈ జిల్లాకు పెట్టని ఆభరణాలు. ఒంపులు తిరిగే వాగులు... వయ్యారాలు ఒలికే కాలువలు... ఉరకలు వేసే జలపాతాలు... ఒకటేమిటి... ఎక్కడ చూసినా ప్రకృతి అందాలే దర్శనమిస్తాయి. అందుకే ప్రకృతి అందాలకు తలమానికంలా ఉండే ఈ జిల్లా అంటే నాకు ఎంతో ఇష్టం.

ఇన్ని ప్రత్యేక అందాలను సంతరించుకున్న ఈ జిల్లా గురించి ఇంతవరకూ పర్యాటకపరంగా ఒక పుస్తకం కూడా ముద్రణకు నోచుకోకపోవడం నన్ను ఎంతో కలవరపరిచింది. దేశంలోని ఎన్నో పర్యాటక ప్రాంతాలను, పుణ్యక్షేత్రాలను సందర్శించి ఆయా ప్రాంతాల్లో ఎన్నో రచులను ఆస్వాదించిన నాకు ఎప్పుడూ అనిపించేది... "వీటన్నింటికంటే నా జిల్లా ఎందులో తక్కువ అని..." అందుకే అందాల ప్రకృతి సోయగాలకు నిలయమైన నా జిల్లాను ఓ అందమైన పుస్తక రూపంలో తీసుకురావాలని తలచి "యాత్ర"కు శ్రీకారం చుట్టాను. 'సంకల్ప బలం ఉంటే ఆశయం అదే నెరవేరుతుందని' నమ్మిన వ్యక్తిని నేను. నా ఆశయ సాధనకు అప్పటి తూర్పుగోదావరి జిల్లా కలెక్టర్ శ్రీ ముద్దాడ రవిచంద్ర గారు అందించిన సహాయసహకారాలు నా జీవితంలో మరచిపోలేనివి. ఆయన అందించిన ప్రోత్సాహంతో పాటుగా పలువురు శ్రేయోభిలాషులు, స్నేహితులు, కుటుంబ సభ్యులు... ప్రత్యక్షంగాను, పరోక్షంగాను అందించిన సహకారం కారణంగానే నా "యాత్ర" ఎటువంటి అడ్డంకులు లేకుండా మీ అందరి ఆదరాభిమానాలు పొందగల్గింది. ముఖ్యంగా నా జీవితభాగస్వామి శ్రీమతి సబ్బెళ్ళ విజయలక్ష్మి, నా ఏకైక కుమారుడు చి॥ సబ్బెళ్ళ రవికిరణ్ రెడ్డిలు ఈ యాత్ర రూపకల్పనలో అందించిన సహకారం ఎంత చెప్పినా తక్కువే అవుతుంది.

యాత్రను మీరు ఆదరించిన తీరు అద్భుతం. ఈ పుస్తకాన్ని ఇంగ్లీషులో కూడా ముద్రించడంతో జిల్లా ఖ్యాతిని రాష్ట్రంలోనే కాక జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో కూడా చాటి చెప్పే అవకాశం కలిగింది. నేను ఊహించిన దానికంటే 'యాత్ర'కు ఎక్కువ ఆదరణ లభించిందని చెప్పడానికి నేను ఎంతో ఆనందపడుతున్నాను. యాత్ర ప్రచురించిన నాటి నుండి ఎవరో ఒకరు మన రాష్ట్రం నుండే కాక ఇతర రాష్ట్రాలలోని పలు ప్రాంతాల నుండి కూడా ఫోన్ ద్వారా తమ అభిప్రాయాలు, అభినందనలు తెలియజేస్తూనే ఉన్నారు.

ఈ యాత్రలో ఒక్కొక్కరికీ ఒక్కొక్క అంశం నచ్చింది. కానీ ప్రతీ ఒక్కరూ ఒక విషయాన్ని మాత్రం ఏకాభిప్రాయంగా వెలిబుచ్చారు. "ఈ జిల్లాలో ఇన్ని అందమైన ప్రదేశాలు, పుణ్యక్షేత్రాలు, నోరూరించే రుచులు ఉన్నాయా?" అని. ఇక్కడ పుట్టి పెరిగిన మాకే తెలియని ఇన్ని అందమైన ప్రదేశాలు, ఆధ్యాత్మిక ప్రాంతాలు, రుచికరమైన వంటలు గురించి ఎంతో విపులంగా పేర్కొన్న తీరు అద్భుతమని వారు పేర్కొనడం జరిగింది. ఈ పుస్తకం తమ వెంట ఉంటే 'వెంట ఉండి చేయిపుచ్చుకుని నడిపించి తీసుకువెళ్ళినట్టే ఉందని' పలువులు అభిప్రాయపడ్డారు. నా జన్మకు ఇంతకంటే అదృష్టం ఏం కావాలి. ఈ స్ఫూర్తితోనే కొంతమంది శ్రేయోభిలాషులు, స్నేహితులు ఇచ్చిన సూచనలు, సలహాలు పరిగణనలోకి తీసుకొని యాత్ర ద్వితీయ భాగాన్ని మరింత అందంగా తీర్చిదిద్దడంతో పాటు అదనపు సమాచారాన్ని కూడా క్రోడీకరించి మీ ముందుకు తీసుకువచ్చే సాహసం చేస్తున్నాను. నా ఈ ప్రయత్నాన్ని కూడా మీరు అన్ని విధాలా ఆదరించి ఆశీర్వదించాలని కోరుతూ...

"ప్రతి పేజీ ఒక జ్ఞాపకంలా... వేసే ప్రతీ అడుగు ఒక అద్భుతం వైపు... కొన్ని అనుభూతులు శాశ్వతం... ఈ యాత్రలో..."

సబ్బెళ్ళ శివన్నారాయణరెడ్డి,
బోడావారి వీధి, హైస్కూలు దగ్గర, గొల్లలమామిడాడ-533344. తూ॥గో॥జిల్లా. సెల్: 9849611888,
e-mail: snreddyzee@gmail.com, snreddy@godavariyatra.in, info@godavariyatra.in

# కృతజ్ఞతలు





**శ్రీ నల్లారి కిరణ్ కుమార్ రెడ్డి**
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు, ఆంధ్రప్రదేశ్

**శ్రీ నాదెండ్ల మనోహర్**
శాసనసభాధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్

**శ్రీ మల్లిపూడి మంగపతి పళ్ళంరాజు**
కేంద్ర మానవవనరుల అభివృద్ధి శాఖామాత్యులు

**శ్రీ కొణిదల చిరంజీవి**
కేంద్ర పర్యాటక శాఖామాత్యులు

**శ్రీ వట్టి వసంతకుమార్**
రాష్ట్ర పర్యాటక శాఖామాత్యులు

**శ్రీమతి చందనాఖాన్,** I.A.S.,
రాష్ట్ర పర్యాటక శాఖ ప్రత్యేక కార్యదర్శి

**శ్రీ ముద్దాడ రవిచంద్ర,** I.A.S.,
MD, APMSIDC, Hyderabad

**శ్రీమతి నీతూ ప్రసాద్,** I.A.S.,
కలెక్టర్, తూర్పుగోదావరి జిల్లా

**శ్రీ ఆర్. శైలేష్ రెడ్డి,**
సీనియర్ జర్నలిస్ట్

**శ్రీ తోట భావన్నారాయణ,**
సీనియర్ జర్నలిస్ట్

**శ్రీ కె. కృష్ణారెడ్డి,**
డైరెక్టర్, క్రిఫీ ఇన్నోవేషన్స్ (యూ.కె.) లిమిటెడ్.



# అభినందనలు



సర్వతోముఖంగా విస్తరించిన తూర్పుగోదావరి జిల్లా అందచందాలను 'యాత్ర' గ్రంథం ద్వారా అందించి శివన్నారాయణ రెడ్డి గారు ఈ జిల్లా ప్రజలకు మహోపకారం చేశారు. దిండి రిసార్ట్స్ నుండి పాపికొండల వరకూ, అన్నవరం నుండి అయినవిల్లి వరకూ, పులసల నుండి పొట్టిక్కల వరకూ - ఏ అంశాన్నీ విడిచిపెట్టకుండా కళ్ళకు కట్టినట్టు చూపించారు. ఈ పుస్తకం చదవని వారికి జీవితంలో ముఖ్యమైనదేదో కోల్పోయామనిపించేంత అందంగా రూపకల్పన చేశారు. అసంఖ్యాకమైన సంస్కృతీ ప్రియుల దాహార్తిని తీర్చడానికి 'యాత్ర' పునర్ముద్రణ పనులు చేపట్టిన మిత్రులకు నా అభినందనలు తెలియ జేస్తున్నాను. శుభకామనలతో...

**ముద్దాడ రవిచంద్ర,** I.A.S.
MD, APMSIDC, Hyderabad



# అభినందనలు

ఆధ్యాత్మిక, పర్యాటక, ఆహార రంగాలలో ప్రత్యేకతను సంతరించుకున్న తూర్పుగోదావరి జిల్లా ఆత్మను 'యాత్ర' పేరుతో మిత్రుడు శివన్నారాయణరెడ్డి పంచరంగుల దృశ్యకావ్యంగా మనముందు ఆవిష్కరించాడు. నిరంతర అన్వేషణలో జిల్లాకు సంబంధించిన మరిన్ని విశేషాలను సేకరించి 'యాత్ర'ను కొత్త అందాలతో అలంకరిస్తున్నాడు. సమగ్రమైన 'యాత్ర' పునర్ముద్రణతో ఈ జిల్లా విశ్వరూప సందర్శనం చేయించబోతున్న మిత్రుడిని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. శుభాకాంక్షలతో...

**అదృష్టదీపక్**
సినీగేయ రచయిత

# విషయసూచిక




8 తూర్పుగోదావరి జిల్లా

12 గోదావరి

14 గోదావరి పరివాహక ప్రాంతం











**16 తూర్పు వైభవం**

18 సంక్రాంతి
24 వెండితెర గుండెల్లో... గోదారి.
28 జానపద కళారూపాలు
30 తూర్పు రుచులు
36 బౌద్ధారామాలు
40 డా॥ మంగళంపల్లి
42 పరిశ్రమలు
44 చింతలూరు ఆయుర్వేదం
46 రామదుర్గం
48 విప్లవజ్యోతి అల్లూరి
50 సంప్రదాయ విందు
51 గ్రామదేవతలు
52 తూర్పు వేదం
54 అర్తమూరు
56 ఉప్పాడ
58 తూర్పు శివకాశీలు
59 పాతకొట్టాం

**60 అమలాపురం డివిజన్**

62 కోనసీమ
64 అయినవిల్లి
66 ముక్తేశ్వరం
67 మురమళ్ళ
68 ముమ్మిడివరం
70 కొత్తలంక
72 ఓడలరేవు
74 అంతర్వేది
76 దిండి
78 సోంపల్లి
80 అప్పనపల్లి
82 పలివెల
84 వానపల్లి
86 ధనమ్మమర్రి
88 మందపల్లి
90 ర్యాలి
92 వాడపల్లి

**94 కాకినాడ డివిజన్**

96 కాకినాడ
100 రేపూరు
102 హోప్ఐలాండ్
104 పిఠాపురం
106 సామర్లకోట
108 సర్పవరం
110 గొల్లలమామిడాడ
112 కోరంగి
114 యానాం

**116 పెద్దాపురం డివిజన్**

118 పెద్దాపురం
120 తొలితిరుపతి
122 అన్నవరం
124 శాంతిఆశ్రమం
126 ఆంధ్రాశబరిమలై
128 లోవ

**130 రామచంద్రపురం డివిజన్**

132 ద్వారపూడి
134 బలభద్రపురం
136 బిక్కవోలు
138 రామచంద్రపురం
140 ఆదివారపుపేట
142 ద్రాక్షారామం
144 కోటిపల్లి

**146 రాజమండ్రి డివిజన్**

148 పాపికొండలు
150 రాజమండ్రి
154 కోరుకొండ
156 తంటికొండ
158 ధవళేశ్వరం
160 కడియం
164 గుమ్మిలేరు
165 చింతలూరు

**166 రంపచోడవరం డివిజన్**

168 రంప
170 మారేడుమిల్లి
176 పింజరకొండ

178 జిల్లాలోని కొన్ని రిసార్ట్‌లు

# తూర్పుగోదావరి జిల్లా

'ప్రకృతి అందాల సమాహారం-ఆంధ్రాకు పర్యాటక మణిహారం' తూర్పుగోదావరి జిల్లా. ఓ పక్క పెట్టని కోటలా నిలబడిన తూర్పుకనుమలు... మరోపక్క దట్టమైన అడవులతో నిండిన అరణ్యప్రాంతం... ఆ పక్కనే గోదావరి డెల్టా... ఒక్కమాటలో చెప్పాలంటే విభిన్న భౌగోళిక స్వరూపాల సమాహారం తూర్పుగోదావరి జిల్లా. పర్వతాలు, మెట్టప్రాంతం, అడవులు, నదులు, డెల్టాలతో కూడిన విశాలమైన సముద్రతీరంతో... విభిన్న జీవన సంస్కృతీ సౌరభాలతో విరాజిల్లుతోంది. ఈ ప్రాంతాన్ని మౌర్యులు, శాతవాహనులు, విష్ణుకుండినులు, తూర్పుచాళుక్యులు, చోళులు, వెలనాటి చోళులు, కాకతీయులు, ముసునూరి సేనాధిపతులు, కొండవీటి రెడ్డిరాజులు, గజపతులు, కుతుబ్‌షాహీలు మొఘలాయిలు... ఇలా ఎందరో రాజవంశీయులు పాలించారు.

ఆంగ్లేయుల పాలన వచ్చిన తరువాత మొదటిగా జిల్లాకు ఒక రూపం వచ్చింది. 1766 నుంచి ఆంగ్లేయులు మొదట సలహాదారులుగా ఉంటూ జమీందారుల ద్వారా పరోక్షపాలన సాగించారు. 1794 నుండి జిల్లాలో మూడు కలక్టరేట్‌లను ఏర్పాటు చేశారు. 1802లో కాకినాడ, రాజమండ్రి కలక్టరేట్లు విలీనమై రాజమండ్రి కేంద్రంగా జిల్లా ఏర్పడింది. 1859లో జిల్లా కేంద్రం కాకినాడకు మారింది. సర్కారు వారి ఉత్తర్వులు 502 ప్రకారం 1925 ఏప్రిల్, 15న తూర్పుగోదావరి జిల్లా ఏర్పడింది. అప్పటి నుండి రెవెన్యూ పాలనలో చాలా మార్పులొచ్చాయి. 1969 నవంబరు 17న ప్రభుత్వ ఉత్తర్వులు 2384 ప్రకారం కొత్తగా ఖమ్మం జిల్లా ఏర్పడగా, అప్పటి వరకూ తూర్పుగోదావరి జిల్లాలో ఉన్న భద్రాచలం, మణుగూరు తాలూకాలు ఖమ్మం జిల్లా పరిధిలోకి వెళ్ళాయి. మొదట తూర్పుగోదావరి జిల్లాలో కాకినాడ, రాజమండ్రి, పెద్దాపురం, అమలాపురం కలిపి 4 రెవెన్యూ డివిజన్లు ఉండేవి. ఖమ్మం జిల్లా ఏర్పడిన తరువాత రంపచోడవరం కేంద్రంగా మరో డివిజన్ ఏర్పాటు చేయగా, 21 జూన్, 2013న ప్రభుత్వ ఉత్తర్వులు 345 ప్రకారం కొత్తగా రామంచంద్రపురం డివిజన్ ఏర్పాటు చేశారు. దీంతో జిల్లాలో 6 రెవెన్యూ డివిజన్లు ఏర్పడ్డాయి. 1985 మే, 24 వరకు 17 తాలూకాలుగా ఉన్న జిల్లాను ప్రభుత్వం మే 25న 57 రెవెన్యూ మండలాలుగాను, కాకినాడ, రాజమండ్రిలను అర్బన్ మండలాలుగాను విభజించింది. దీంతో జిల్లా మొత్తం 59 మండలాలుగా రూపుదిద్దుకుంది. 1852లో ధవళేశ్వరం వద్ద కాటన్ బ్యారేజీ నిర్మించిన తరువాత జిల్లా స్వరూపమే మారిపోయింది. వ్యవసాయవృద్ధితో పాటు జిల్లా ఆర్థికాభివృద్ధి కూడా వేగవంతమైంది. జిల్లా మొత్తం విస్తీర్ణం 10,808 చ॥కి॥. ఇందులో కోనసీమ 1503 చ॥కి॥, ఏజన్సీ 4629.31 చ॥కి॥ విస్తీర్ణం కలిగి ఉన్నాయి. జిల్లాలో సముద్రతీరం పొడవు 150 కి॥మీ॥.

ప్రపంచంలోని అత్యంత ప్రాచీనమైన నదులలో ఒకటైన గోదావరి నదితో ఈ జిల్లాకు పేగు బంధం ఉంది. నాసిక్‌లో జన్మించిన గోదావరి నది రాజమండ్రి తరువాత పాయలుగా చీలి సాగరంలో కలిసే ప్రాంతం ఇది. ఈ జిల్లా రాష్ట్రంలోని సంపన్నమైన ప్రాంతాల్లో ఒకటి. వ్యవసాయ రీత్యా సారవంతమైన నేలలు గల జిల్లా ఇది. నిర్దిష్టంగా కొన్ని భేదాలు పరిగణనలోకి తీసుకుంటే జిల్లాని కోనసీమ, డెల్టా, చాగల్నాడు, తీరప్రాంతం, అడవి... ఇలా విభజించవచ్చు. ఈ ప్రాంతీయ వైవిధ్యం ఈ జిల్లాలోనే ఉంది.

కోనసీమ - అత్యంత సారవంతమైన ప్రాంతం కోనసీమ. గోదావరి పాయల మధ్య ఏర్పడిన ఒండ్రునేల గల డెల్టా ప్రాంతం ఇది. అడుగడుగునా గోదావరి పాయలు... ఆకాశాన్ని తాకేటట్టు అగుపించే కొబ్బరిచెట్లు నల్లటి నేలమీద కళకళలాడుతూ పచ్చని పొలాలు... చల్లని వాతావరణంతో పర్యాటకులను ఇట్టే ఆకట్టుకునే సుందరమైన ప్రాంతం కోనసీమ.



డెల్టా - నది సముద్రంలో కలిసే ప్రాంతాన్ని డెల్టా అంటారు. గోదావరి మీద ధవళేశ్వరం దగ్గర ఆనకట్ట కట్టడంతో గోదావరి జలాలతో సాగయ్యే ప్రాంతాలు అనేకం ఏర్పడ్డాయి. జనవానుడిలో ఈ ప్రాంతాల్ని కూడా డెల్టాగా పిలుస్తారు. గోదావరి జలాలతో వ్యవసాయం జరిగే ఈ ప్రాంతం జిల్లాలో అత్యంత సంపన్నమైనది.

మెట్ట - తూర్పు కనుమల క్రింది భాగంలో ఈ మెట్ట ప్రాంతం ఉంది. ఈ ప్రాంతం దాదాపు ఎర్రనేల. అడవి నుండి ప్రవహించే ఏలేరు నది మెట్టలో కొంత ప్రాంతాన్ని వ్యవసాయ యోగ్యం చేసింది. చిన్న చిన్న గుట్టలు, పొదలు, తాడిచెట్లతో ఈ ప్రాంతం మనోహరంగా ఉంటుంది.



చాగల్నాడు - ఇది పూర్తిగా ఏర్రనేల గల ప్రాంతం. చిన్న, పెద్ద చెరువులు ఈ ప్రాంతంలో చాలా కనిపిస్తాయి. చిన్న చిన్న కొండలు గుట్టలతో ఉన్న ఈ ప్రాంతం వర్షాకాలంలో పచ్చదనంతో కన్నుల పండువగా ఉంటుంది.

తీరప్రాంతం - అంతర్వేది నుండి తొండంగి వరకూ ఉన్న 144 కి.మీ. సముద్రతీర ప్రాంతం జిల్లాలో ప్రముఖమైనది. తీరం పొడవునా మత్స్యకారగ్రామాలున్నాయి. అంతర్వేది నుండి యానాం వరకూ కొబ్బరితోటలతో, సర్వే తోటలతో, దట్టమైన చెట్లు పొదలతో ఉంటుంది. కాకినాడ నుండి తొండంగి వరకూ మైదానంలా కన్పిస్తుంది. కాకినాడ-చొల్లంగి ప్రాంతంలో మడఅడవులు వ్యాపించి ఉన్నాయి. సముద్రంపై చేపలవేట ఇక్కడి ప్రధాన ఆర్థిక కార్యకలాపం.

అడవి - జిల్లాలో ఎక్కువ వైశాల్యం అటవీ ప్రాంతం ఉంది. తూర్పు కనుమలు వ్యాపించి ఉన్న ప్రాంతం అంతా దట్టమైన అరణ్య ప్రాంతం. ఎత్తైన పర్వతాలు, లోయలతో ప్రకృతి సౌందర్యంతో అలరారే ప్రాంతం ఇది. అడుగడుగునా కనిపించే సెలయేర్లు, హోరున పారే జలపాతాలు, ధీమాగా నిలిచే టేకుచెట్లు, ఠీవిగా కన్పించే మద్దిచెట్లు, విరివిగా కనిపించే వెదురు పొదలు ఉన్న ఈ ప్రాంతం సుమారు 8 లక్షల ఎకరాలలో (ఇది జిల్లా వైశాల్యంలో 30.70 శాతం) విస్తరించి ఉంది.

ఏ రాష్ట్రానికి లేనంతగా ఈ జిల్లాకు సముద్రతీరం, పకృతి వైవిధ్యం ఉంది. కానీ టూరిస్టులను ఆకర్షించే పర్యాటక కేంద్రాలు మాత్రం చాలా తక్కువ. మిలమిల మెరిసే సువిశాల సముద్రతీరం ఒకవైపు... గోదావరి సముద్రంలో కలిసే సంగమదృశ్యం మరోవైపు... సముద్ర తీర ప్రాంతంలో ఏపుగా పెరిగి పచ్చదనంతో కళకళలాడుతున్న మడ అడవులు... సముద్రతీర ప్రాంతంలో రంగురంగుల వలస పక్షులు చేసే కిలకిలరావాలతోపాటు రెక్కలు టపటపలాడిస్తూ కలిసికట్టుగా ఎగిరే సుందర దృశ్యాలతో తీరప్రాంతం, వేగంగా... వడిగా... ఉగ్రంగా... శాంతంగా... ఇలా తన గమనాన్ని మార్చుకుంటూ సాగే గోదావరి అందాలు... దాని తీరాన సుందరక్షేత్రాలు, ఎత్తైన కొండలు... పచ్చని తివాచీలు, సెలయేటి జాలులు... హృదయంలో ఎప్పటికీ నిలిచిపోయే గిరిసీమ అందాలు, ధ్యానంతో సర్వం మరిచిపోయినట్టు కనిపించే సమున్నత గిరి శిఖరాలు... మనోహరమైన లోయలు... గిరుల పాదాలకు మువ్వల పట్టీలు చుట్టినట్టు గలగల పారే సెలయేళ్ళు... వనకన్యల సిగల్లో గుత్తులుగా అమరినట్టుండే అడవి పూల మాలికలు... వీటన్నింటితో అలరారే అందమైన శీతల ప్రదేశం తూర్పు ఏజన్సీ, అంతఃనిక్షేపాలు, అద్భుత జంతుజాలాలు ఇంకా ఎన్నో విశేషాలను తన గర్భంలో నింపుకొని పైకి గంభీరంగా కనిపించే సముద్రుడి సౌందర్యం, దారివెంట వెళుతుంటే మనల్ని ఆశీర్వదిస్తున్నట్లుండే కొబ్బరి చెట్లు, గోదావరి మధ్యలో లంకలు... మన మదిలో నిలిచిపోయే కోనసీమ సోయగాలు, ఇలా ఎన్నో సుందర ప్రాంతాలకు... మరెన్నో పుణ్యక్షేత్రాలకు నిలయం ఈ జిల్లా.

ఈ జిల్లాకు విస్తీర్ణంలో పెద్దదన్న ప్రత్యేకతే కాక విలక్షణ ప్రకృతిని సొంతం చేసుకున్న జిల్లాగానూ ఓ ప్రత్యేకత ఉంది. ఆధ్యాత్మిక చింతనతో పాటు వినోద విహారాలకు కూడా అనువైన ప్రాంతాలు జిల్లాలో ఎక్కువగానే ఉన్నాయి. ఎన్నెన్నో పుణ్యక్షేత్రాలకు, ప్రకృతి అందాలకు నెలవు ఈ గడ్డ. కోనసీమ అందాలు, గోదావరి ఒంపుసొంపులు, పాపికొండలు, సముద్రతీరం, అడవులు జలపాతాలు... జిల్లా వైవిధ్యానికి గుర్తులు. గోదావరి సముద్రుడిలో విలీనమయ్యే కోనసీమలోని అంతర్వేది ప్రాంతం అటు ఆధ్యాత్మికంగానే కాకుండా విహారస్థలంగా కూడా పేరొందింది. మలికిపురం మండలం దిండి వద్ద గోదావరి తీరంలో పర్యాటక శాఖ నిర్మించిన రిసార్ట్స్ రోజంతా గడపదగిన విహారస్థలం. కాకినాడ నుండి 5 కిలోమీటర్ల దూరంలో సముద్రం మధ్యలో ఉన్న 200 ఏళ్ళ చరిత్ర కలిగిన హోప్ ఐలాండ్ పిక్నిక్ స్పాట్‌గా పెట్టింది పేరు. నేలతల్లి నవ్వులాంటి ఎన్నో పువ్వులకూ, ఫలాలలకూ నెలవులు కడియం











నర్సరీలు. జాతీయ రహదారిని ఆనుకొని వేమగిరి నుండి పొట్టిలంక వరకూ 400 నర్సరీలు ఉన్నాయి. జిల్లా కీర్తి ప్రతిష్టలను జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో ఇనుమడింప జేయండంలో కడియం నర్సరీలు కీలకపాత్ర పోషిస్తున్నాయి. ప్రకృతి రమణీయకతకు, పాడిపంటలకు, అతిథి మర్యాదలకు పెట్టింది పేరైన ఈ జిల్లా చవులూరించే వంటకాలకు కూడా చక్కని చిరునామా. అటు కోనసీమ వెళ్ళినా, ఇటు కాకినాడ వెళ్ళినా, గోదావరి తీరాన చూసినా, మన్యసీమలోనైనా ఈ జిల్లా వంటకాలు నోరూరిస్తాయి.

ఎన్నో మతాలు... కులాల వారు ఐక్యంగా కలిసిమెలిసి జీవించే గోదారి తీరం చరిత్రలోనూ పలు ప్రసిద్ధ మతాల విస్తరణలోనూ పాలు పంచుకుందంటే ఆశ్చర్యం కలగక మానదు. భౌద్ధ మతం, జైన మతం చాలా కాలం క్రితమే ఈ జిల్లాలో విరాజిల్లిందనడానికి ఇప్పటికీ పలుచోట్ల బయటపడే ఆనవాళ్ళే నిదర్శనం. పాపికొండల వద్ద వంపులు తిరిగే గోదావరి అందాలు... ఏజన్సీలో దట్టమైన అడవులు, లోయలు, జాలువారే జలపాతాలు... డెల్టాలో పచ్చని తివాచీ పరిచినట్టు ఉండే వరిచేలు, కేరళను తలపించే కొబ్బరి తోటలు... సప్తవర్ణాల కడియం పూలతోటలు... ఆధ్యాత్మిక పరవళ్ళు తొక్కించే పురాణ ప్రసిద్ధి చెందిన ఆలయాలు... ఇలా తూర్పు నేలనలుచెదురులా సినీలోకాన్ని అబ్బురపరిచే విధంగా సెల్యూలాయిడ్ పై ఎక్కేందుకు తనవి తీరనన్ని అందాలు ఈ జిల్లాలో ఉన్నాయి. ఫిల్మ్ సిటీలు, స్టూడియోలు దాటి తెలుగు సినిమా బయటి ప్రపంచం చూడాలంటే... అయితే విదేశాలకైనా వెళ్ళాలి... లేదా తూర్పు వాకిటైనా వాలాలి. జిల్లా అంతర్భాగంగా ఉన్న యానాం పర్యాటకాభివృద్ధికి పెట్టింది పేరు. ఫ్రెంచ్ కాలం నాటి కట్టడాలు, రాజీవ్‌గాంధీ బీచ్‌లో ఏర్పాటు చేసిన భారీ కట్టడాలు పర్యాటకులను ఎంతగానో ఆకట్టుకుంటాయి.

ఈ నేల నలుచెరగులా వేదఘోష నిరంతరం మార్మోగుతుంది. పాయలుగా, పిల్లకాలువలుగా చీలిన పవిత్ర గోదావరి జిల్లాను ఈ చివరినుండి ఆ చివరి వరకూ పావనం చేస్తుంది. ఏ ఊరికి వెళ్ళినా... గుడిగంటల సవ్వడి గాలి తరగలపై తేలి పలుకరిస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ గోదావరి మండలమంతా ఆథ్యాత్మిక భావనలు అడుగడుగునా వెల్లివిరుస్తాయి.

జిల్లాలోని ఇలాంటి ఎన్నో అందాలను మీకు పరిచయం చేయడానికే మా ఈ ప్రయత్నం...

ఇక పేజీలు తిప్పండి...





# గోదావరి



ప్రకృతి ప్రసాదించిన అద్భుత వరాలు మన జీవనదులు. మన దేశంలో గంగానది తరువాత గోదావరి నది అతి పవిత్రమైనది. మహిమలలో కూడా రెండింటికి గల సామీప్యాన్ని మన పూర్వీకులు గుర్తించారు. అఖండ గోదావరి నది శాఖోపశాఖలుగా చీలి మొత్తం భారత భూభాగంలో సుమారు పదవవంతు ఉంది. దక్షిణ భారతదేశంలోనే గోదావరి అతిపెద్ద నదిగా గుర్తించబడింది. సుమారు 7 వేల అడుగుల ఎత్తు, 500 సెంటీమీటర్ల వర్షపాతం ఉన్న పడమటి కనుమలలోని నాసికా త్రయంబకం గోదావరి జన్మస్థానం. ఇచట నుండి ఆగ్నేయ దిశగా ప్రవహించి, తూర్పు కనుమలలో ప్రవేశిస్తుంది. ఆంధ్రప్రదేశ్‌లోని అదిలాబాదు, కరీంనగర్, వరంగల్, ఖమ్మం జిల్లాల గుండా ప్రవహించి దేవీపట్నం గుండా తూర్పుప్రాంతంలో ప్రవేశిస్తుంది. దీని మొత్తం పొడవు 1450 కి॥మీ॥ కాగా ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే 927 కి॥మీ॥ ప్రవహిస్తుంది..

శాఖోపశాఖల సంగమ స్రవంతి అయిన గోదావరి నదిని ద్రాక్షారామ భీమేశ్వరస్వామి ప్రతిష్ఠాసమయాన గౌతముడు, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, అత్రి, కౌశికుడు, భరద్వాజుడు, అగస్త్యుడు అనే సప్తమహర్షులు ఒక్కొక్కపాయగా తీసుకువచ్చారనీ, ఈ కారణంగానే ఆ  ఏడుగురు ఋషుల పేరు మీద ఏడు పాయలుగా ఉన్నట్లు ప్రతీతి. గోదావరి నది సప్తశాఖలకు కాశ్యప లేక తుల్యభాగ, అత్రి లేక కోరింగ, గౌతమి, భరద్వాజ, విశ్వామిత్ర లేక కౌశిక, జమదగ్ని, వశిష్ఠ అనే పేర్లు కలవు. కానీ ఈనాడు వాటిలో గౌతమి, వశిష్ఠ మాత్రమే ప్రవహిస్తూ ఉన్నాయి. వీటిలో తూర్పుశాఖగా గౌతమి 45 మైళ్ళ దూరం ప్రయాణించి వృద్ధ గౌతమి, కోరంగి నదులుగా చీలి సముద్రంలో కలుస్తుంది. అదే విధంగా పశ్చిమశాఖగా వశిష్ఠ దక్షిణంగా 25 మైళ్ళ దూరం ప్రయాణించి, వైనతేయపాయగా అంతర్వేది వద్ద సముద్రంలో కలుస్తుంది.

ఖమ్మం జిల్లా కూనవరం ప్రాంతం వద్ద శబరి నదిని అక్కున చేర్చుకునే గోదావరి నది వెడల్పు తూర్పు కనుమల్లోని పాపికొండల వద్ద 175 నుంచి 250 మీటర్లు మాత్రమే ఉంటుంది. దేవీపట్నం నుండి పదిహేను కిలోమీటర్లు దాటిన తర్వాత క్రమేపీ పెరుగుతూ, రాజమండ్రి వద్ద నాలుగు కిలోమీటర్లు, ధవళేశ్వరం వద్ద ఏడు కిలోమీటర్ల వరకూ విస్తరించింది.





# గోదావరి పరివాహక ప్రాంతం


పట్టిసీమ వీరభద్రేశ్వరస్వామి ఆలయం

ప్రకృతి రమణీయమైన అలల సవ్వడి, చిరుగాలుల పరంపర, పచ్చని కొండల నడుమ ఒంపుసొంపులతో పయనించే గోదావరి అందాలను గాంచిన పండితుల మనస్సు ఆనందమయమై, కనులు కలువలై, ఎన్నో వర్ణనలతో స్తుతించారు. కాని సామాన్యులను సైతం తన ప్రవాహవేగంతో కనువిందు చేయగలిగే ప్రకృతి సౌందర్యం గోదావరికే సొంతం.

చల్లనిగాలుల మధ్య, మైమరపించే పచ్చని అందాల మధ్య, పాపికొండల నడుమ గోదావరిలో ప్రయాణం ప్రతి మనిషి జీవితంలో అపురూపమైన దృశ్యం. ప్రకృతి ఉపాసకులకు కొండల నడుమ గోదావరిలో ప్రయాణం వారి జీవితాంతం మరపురాని దృశ్యమాలిక. తమ ఊహలకు పదాలే కరువైన వేళ గోదావరి చెంతనే ఎన్నో ఊహలు మరెన్నో ఊసులతో పాటలు కూర్చిన కవులున్నారు. గోదావరి ఇసుకతిన్నెలను పసిడి వెన్నెలలో తిలకించే దృశ్యం మరపురాని అద్భుతదృశ్యకావ్యమే. పాపికొండల ప్రకృతి సౌందర్యం మనస్సును మైమరపించి, పులకింప చేయడం, కనులారా గాంచిన వారికి మాత్రమే కలిగే అదృష్టంగా పేర్కొనవచ్చు.

తెలుగు చిత్రపరిశ్రమలో తలపండిన దర్శకులు ప్రకృతిని తమ కెమెరాలో బంధించి సెల్యూలాయిడ్‌పై అద్భుతంగా మలచడానికి గోదావరి తీర ప్రాంతాన్నే ముందుగా ఎంచుకుంటున్నారన్నది నగ్న సత్యం. గోదావరి పరీవాహక ప్రాంతాన్ని అద్భుతమైన రీతిలో తెరకెక్కించిన సినీదర్శకులు చాలా మందే ఉన్నారు. యాంత్రికంగా మారిన నగరవాసులకు గోదావరి అందాలు, పాపికొండల సౌందర్యం, గోదావరికి అటుఇటు ఉన్న పల్లెలు, కొండల అందాలను చూసి తరించడం ఎంతో ఉల్లాసాన్నిస్తుందనడంలో సందేహం లేదు. ప్రకృతి రమణీయకతకు ఆలవాలమైన గోదావరి పరీవాహక ప్రాంతంలో నెలకొని ఉన్న కొన్ని పర్యాటక ప్రదేశాలు ఇక్కడ వివరిస్తున్నాము.

### పట్టిసీమ వీరభద్రేశ్వరస్వామి ఆలయం

దక్షయజ్ఞం సమయంలో వీరభద్రుడు ఎక్కుపెట్టిన 'పట్టిసం' అనే ఆయుధం పడిన చోటుగా పట్టిసీమకు పేరుంది. అంతే కాకుండా పరమశివుని ప్రతిరూపం లింగాకారంలో ఆవిర్భవించి పెరిగిపోతుంటే అగస్త్యుడు ఆలింగనం చేసుకున్న ప్రాంతంగా ప్రసిద్ధి. 'పట్టిసం' అనే పేరు వాడుకలో 'పట్టిసీమ'గా మారిందని చెబుతారు.

### మహానందీశ్వర ఆలయం - రామయ్యపేట

పట్టిసీమ వీరభద్రేశ్వరుడి క్షేత్ర పాలకునిగా ఇక్కడ మహానందీశ్వరుడు వెలిసాడు. స్ఫటిక లింగం ఇక్కడి ప్రాధాన్యత. నందీశ్వరుని దర్శనం చేసుకోకుంటే వీరభద్రేశ్వరుని దర్శనఫలం సిద్ధించదని చరిత్ర చెబుతోంది. చాలా సినిమా షూటింగ్‌లకు ఇది వేదికైంది. పట్టిసీమకు మూడు కిలోమీటర్ల దూరంలో ఈ క్షేత్రం ఉంది.

### గండిపోశమ్మ ఆలయం

గోదావరి ఒడ్డున ఈ ప్రాంతంలో గోదావరి సుడులు తిరుగుతూ ఉంటుంది. గిరిజనులను రక్షించేందుకు ఇక్కడ వెలసిన అమ్మవారు పోశమ్మ. ఈ ప్రాంతానికి గండి అని స్థానిక నామం. అందువల్లనే ఈ అమ్మవారిని మాతృశ్రీ గండిపోశమ్మగా పిలుస్తారు.

### ఉమా చోడేశ్వరస్వామి ఆలయం - దేవీపట్నం

చోళరాజుల కాలం నాటి ఉమాచోడేశ్వరస్వామి ఆలయం 11వ శతాబ్దికి చెందినది. ఆ కాలంనాటి చరిత్రకు గుర్తులు కూడా ఆలయం వద్ద ఉన్నాయి. ఇక్కడ స్వామి సంతాన లింగేశ్వరుడుగా ప్రసిద్ధి. కార్తీక మాసంలో వన సమారాధనకు అనువైన ప్రాంతంగా ఈ ఆలయం పేరు పొందింది.

### పేరంటాళ్ళపల్లి విశ్వేశ్వరస్వామి ఆలయం

రాజమండ్రికి సుమారు 50 కి॥మీ॥ దూరంలో గోదావరి మార్గంలో ఉన్న విశ్వేశ్వరాలయం కూడా చారిత్రక పాధాన్యత కలిగినదే. ఈ ప్రాంతం ఓ చారిత్రక సందర్శనా ప్రాంతంగా నిలిచింది. ఈ ప్రాంతాలకు వెళ్ళాలంటే ముందుగా బోట్లు, లాంచీలు బుక్ చేసుకోవాలి.

గండిపోశమ్మ ఆలయం




మహానందీశ్వరాలయం

# సంక్రాంతి

పల్లెల్లోనే కాదు పట్టణాల్లో కూడా... భోగిమంట

‘సంక్రాంతి’...సంప్రదాయాల పండుగ. ఉత్సాహాన్ని ఉరకలెత్తించే పండుగ. మట్టితో ముడిపడ్డ పల్లె జీవనంలో కొత్త కాంతులు నింపే పండుగ. వేకువజామునే గూడు వదిలిన పక్షులు సాయంసంధ్య వేళ తిరిగి గూటికి చేరినట్టు - ఉపాధి, ఉద్యోగాల నిమిత్తం ఎక్కడెక్కడో ఉంటున్న వారంతా ఒకసారి తల్లి ఒడిలాంటి పల్లెకు చేరే పండుగ. రైతులు ఏరువాక మొదలుపెట్టే పండుగ. పిల్లలు, వృద్ధులు, పేద, ధనిక అనే తేడా లేకుండా చేసుకునే సంతోషాల పండుగ. ఒక్క మాటలో చెప్పాలంటే అచ్చ తెలుగుదనం పరవళ్ళు తొక్కే సిసలైన పండుగ మన ‘సంక్రాంతి’

సంక్రాంతి సందర్భంగా పల్లెలు తల్లి రాకను చూసిన లేగల్లా తుళ్ళి పడతాయి. ఇళ్లకు రంగులు వేయించడం, పూరిపాకల అరుగులను పేడతో అలకడాలను పూర్తి చేసి, మేలుకొలుపు సున్నపు ముగ్గులు వేసి అందంగా తయారు చేస్తారు. గుమ్మాలకు మామిడి తోరణాలు, పూలమాలలు కట్టి సంక్రాంతి లక్ష్మికి సంప్రదాయ పద్ధతిలో స్వాగతం పలుకుతారు. దట్టమైన మంచును సూర్యకిరణాలు చీల్చుకువస్తున్న సమయంలో పట్టు పరికిణీలు వేసుకున్న యువతులు తమ ఆహార్యంతో పోటీ పడే ముగ్గులు వేస్తూ ముచ్చట గొల్పుతారు. విచ్చుకున్న రంగవల్లులతో ఏ వీధి చూసినా ఇంద్రధనస్సులు కొలువు తీరాయా...అన్నట్టుగా కనులవిందు చేస్తాయి. పడతుల మునివేళ్ళ నాట్యానికి తోడు వేకువజామునే హరిదాసు కీర్తనలు సందడి చేస్తాయి. మధ్యాహ్న సమయంలో ‘అయ్యగారికి దణ్ణం పెట్టు... అమ్మగారికి దణ్ణం పెట్టు’ అంటూ డూడూ బసవన్నలు... తెలుగువారి పౌరుషానికి చిహ్నంగా చూపించే కోడిపందాలకు పందెంరాయుళ్ళు సిద్ధంకావడం... ఇలా గ్రామాల్లో పండుగ నాలుగు రోజులూ సందడే.. సందడి. సంక్రాంతి ప్రధానంగా రైతు ఇంట వెలుగులు జిమ్మే పండుగ.

గోదావరి జిల్లాల్లో ఈ పర్వదినం ప్రభావం ఎక్కువ. పచ్చని పైర్లతో కళకళలాడే ఈ జిల్లాల్లో రైతులు భోగభాగ్యాలతో ఉంటారని రాష్ట్రం అంతా విశ్వసిస్తారు. కుటుంబ సభ్యులంతా సహపంక్తి భోజనాలు చేసే ఏకైక పండుగ సంక్రాంతి. ఒక ఆకులో కుటుంబ సభ్యులంతా భోజనం చేసే అరుదైన సంప్రదాయం, కనుమరుగవుతున్న ఉమ్మడి కుటుంబ వ్యవస్థ గొప్పదనాన్ని ఈ నాలుగు రోజుల్లో (భోగి, సంక్రాంతి, కనుమ, ముక్కనుమ) ఆస్వాదిస్తారు. ఒక్కమాటలో చెప్పాలంటే అచ్చమైన తెలుగుదనం పరవళ్ళు తొక్కే అతి పెద్ద పండగ ఇది.

*డూడూ బసవన్న - గంగిరెద్దులు*



హరిదాసు





# కోడిపందాలు



సమరానికి సిద్ధం

గోదావరి జిల్లాల్లో సంక్రాంతి సంబరాలకు అచ్చమైన చిరునామాలు. కుక్కుటానికి కత్తి కట్టందే... బరిలో నిలపందే... మకర సంక్రమణం కాదేమోనన్నంతగా ఇక్కడి ప్రజల్లో ఈ ఆచారం నరనరానా జీర్ణించుకుపోయింది. జాతి పుంజులను ఎంపిక చేసి, రాబోయే రణరంగానికి సిద్ధం చేయడం ఓ కళగా భావిస్తారు. పందెంకోళ్ళను తయారు చేయడంలో ఎన్నో ఆసక్తికరమైన అంశాలు తారసపడతాయి. గుడ్డు ఎంపిక నుంచి పందానికి పెట్టే ముహూర్తం వరకూ... ఎన్నో వింతలు గోచరిస్తాయి. అందుకే సంక్రాంతి వేడుకల్లో గోదావరి జిల్లాల్లో కోడిపందాలదే అగ్రస్థానంగా చెబుతారు.

'రణరంగం కాని చోటు భూస్థలమంతా వెదకినా దొరకదు' అని శ్రీశ్రీ మనుషుల గురించి మాత్రమే అన్నాడు.. కానీ నిజానికి ఇది కోడిపుంజులకు కూడా వర్తిస్తుంది. రెక్కలు రెండూ సగం విప్పి, తళతళ మెరిసిపోయే కత్తిని కట్టిన ఎడమకాలిని ఎగరేసి, ప్రత్యర్థి కోడి గుండెలో దించడానికి ప్రయత్నించే పందెంపుంజును చూడని దేశమేదీ లేదు. కణతల దగ్గర సుతారంగా ఊది, ముక్కులు కలిపి వాటిని కింద వదలిపెట్టడం ఆలస్యం, అప్పటి దాకా నాజూకుగా కనిపించిన మెడమీద ఈకలను కర్కశంగా రిక్కించి 'నువ్వో నేనో ఒకరే' అన్న రీతిలో అవి కసిగా కలియబడతాయి.



సై అంటే సై - కోడిపందాలు

# జగ్గన్నతోట ప్రభలతీర్థం


ప్రభను మోస్తూ... యువకులు

పచ్చని తివాచీ పరిచినట్టుండే వరిచేలు... కొబ్బరితోపులు... పంటకాలువలతో కేరళ అందాలతో పోటీపడే కోనసీమ... సంక్రాంతికి మరింత శోభను సంతరించుకుంటుంది. రైతులు తమ పొలాల్లో పండిన తొలకరి వరి పనలను కుచ్చులుగా కట్టి ఇంటి చూరులకు వ్రేలాడదీస్తారు. గ్రామీణ మహిళల చేతి వేళ్ళ నుంచి జాలువారే రంగురంగుల ముగ్గులు... వాటిపై అలంకరించే గొబ్బెమ్మలతో కళకళలాడే వీథులు కనువిందు చేస్తాయి. వీటన్నింటికన్నా కోనసీమలో సంక్రాంతి పండుగ వస్తే జగ్గన్నతోట ప్రభల తీర్థమే గుర్తుకొస్తుంది. దీనికి దేశవిదేశాల్లో ఉన్న స్థానికులతో పాటు, వారి బంధువులు రెక్కలు కట్టుకుని వాలిపోతారు.

జగ్గన్నతోట ప్రభల తీర్థానికి సుమారు 400 సంవత్సరాల చరిత్ర ఉంది. అంతకు ముందు నుంచే ఇక్కడ ప్రభల తీర్థం జరుగుతుందనే వాదన కూడా ఒకటి ఉంది. మొసలపల్లి గ్రామానికి చెందిన భోగేశ్వరస్వామి ఆహ్వానంపై పరమేశ్వరుని రూపాలతో ఉన్న ప్రభలు జగ్గన్నతోటకు తరలివస్తాయని గాథ. ఐదువేల సంవత్సరాల క్రితమే భోగేశ్వరస్వామి ఆలయాన్ని నాగదేవతకు అధిపతి అయిన కర్కోటకుడు నిర్మించినట్లు ఆలయంలోని రాగిశిలాఫలకాలపై పేర్కొనబడ్డాయి. అప్పటి నుండి ప్రభల తీర్థం ఇక్కడ జరుగుతూనే ఉంది. ఏడెకరాల కొబ్బరితోటను జగ్గనతోట అంటారు. ఇక్కడ దేవునికి చిహ్నం ఉండదు. అయినా ఇక్కడ తీర్థం జరగడం వెనుక స్థల విశిష్టతతో పాటు, స్థల పురాణం కూడా ఉంది. గౌతమీ పాయ (ఎగువ కౌశిక)ను అనుకొని ఉన్న జగ్గన్నతోటలో తీర్థం జరుగుతుంది. సముద్రంలో కలిసే సప్తనదులన్నింటిలోనూ గౌతమీ అతివిశిష్టమైనది. మండువేసవిలో కూడా ఇందులో నీరు ప్రవహిస్తుంది. కోటి సూర్యుల నుంచి ఉద్భవించినందునే ప్రభను రంగురంగుల నూలు దారాలు, కొత్త వస్త్రాలతో తీర్చిదిద్దుతారు. పరమశివుని ప్రతిష్ఠించి ఊరేగింపుగా తీసుకువస్తారు. ప్రభల తయారీలో గ్రామ సంప్రదాయం, సంస్కృతి ప్రతిబింబిస్తాయి. కనుమ పండుగ రోజు జరిగే ఈ తీర్థానికి భోగి పండుగకు రెండు రోజుల ముందు ఆలయ ప్రధానార్చకులు పూజలు చేసిన తరువాత ప్రభల తయారీకి శ్రీకారం చుడతారు. ప్రభల తయారీకి తాటిశూలం, టేకుచెక్క, పోకచెట్ల పెంటిలను, శివునికి ప్రీతిపాత్రమైన మర్రి ఊడలను ఉపయోగించి వాటిని తేలికపాటి వెదురు బొంగులను ఆంగ్ల అక్షరం 'యు' ఆకారంలో అమర్చుతారు. ప్రభకు పైన దేవాలయాల్లో ఉంచే పసిడి కుండను ఉంచి చుట్టూ నెమలి పింఛాలతో అలంకరిస్తారు.

నాటి సంప్రదాయం నేటికీ....
ఎద్దులబండి

పచ్చని పంటపొలాల్లో...



కౌశిక దాటుతున్న ప్రభ - అశేష జనవాహిని

# వెండితెర గుండెల్లో... గోదారి

'ఉప్పొంగెలే గోదావరి... ఊగిందిలే చేలో వరి! భూదారిలో నీలాంబరి... మా సీమకే చీనాంబరి! వెతలు తీర్చు మా దేవేరి... వేదమంటే మా గోదావరి! శబరి కలిసిన గోదావరి... రామ చరితకే పునాది!'' గోదావరి విశిష్టతను ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్ని పేజీలైనా రాయొచ్చు, ఎన్ని కథలైనా అల్లొచ్చు, ఎన్ని సినిమాలైనా తీయొచ్చు. నేటి తెలుగు సినీ రంగానికి పుట్టినిల్లే మన గోదావరి!

19వ శతాబ్దం తొలినాళ్ళల్లో రాజమండ్రి కేంద్రంగా తెలుగు సినిమా చిత్రీకరణ జరిగేది. కాలక్రమంలో తమిళనాడు... అనతి కాలంలోనే హైదరాబాద్‌కు పాకింది. అయినప్పటికీ సోయగాలకు నెలవైన గోదావరి నదీపాయలు... పాపికొండల వద్ద వంపులు! దట్టమైన అడవులు... లోయలతో ఏజెన్సీ సోయగాలు! సప్తవర్ణాల కడియం ఉద్యానవనాలు... మరోవైపు ఉత్సాహంగా ఉప్పొంగే సముద్రం... పచ్చని పందిరిలా కోనసీమ అందాలు... తెలుగు సినిమా చిత్రీకరణను నిత్యం తన చుట్టూ తిప్పుకుంటూనే ఉన్నాయి. అలనాటి 'మూగమనసులు' నుంచి నేటి 'సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు' వరకూ జిల్లా అందాల సోయగాలతో తెరకెక్కినవే.

తెలుగు చిత్రసీమలో గోదావరి ప్రస్థానం 1940-50లో ప్రారంభమైంది. అప్పటి నుండి విజయాలు పొందడంతో ఒకరి తరువాత ఒకరు చిత్రీకరణకు రావడం ప్రారంభించారు. 'గోదారీ గట్టుందీ... గట్టు మీద చెట్టుందీ...' 'చేతిలో చెయ్యేసి చెప్పు బావ...' వంటి పాటలు వింటే ప్రతీ ఒక్కరి మదిలో మెదిలే తియ్యటి జ్ఞాపకం కోటిపల్లి రేవు, అక్కడ ఉన్న రావి చెట్టు. అలనాడు అక్కినేని నాగేశ్వరరావు నటించిన మూగమనసులు చిత్రం నుంచి నేటి వర్ధమాన నటీనటుల చిత్రాలకు క్లాప్ కొట్టే ప్రదేశంగా కోటిపల్లి రేవు ప్రసిద్ధి కెక్కింది. కోటిపల్లి రేవును ఆనుకుని ఉన్న రావిచెట్టు సుమారు 150 ఏళ్ళ నాటిదని అంటుంటారు. గోదావరి ఒడ్డున ఉన్న ఈ రావిచెట్టు ఎన్ని తుఫానులు వచ్చినా ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఉంది. గోదావరి దాటి వెళ్ళే ప్రయాణికులు ఇక్కడ కొద్దిసేపైనా ఆగి వెళుతుంటారు. ఈ రావిచెట్టు వద్దనే చాలా తెలుగు సినిమాలు చిత్రీకరణ జరుపుకొన్నాయి. నాగేశ్వరరావు, జమున, సావిత్రి నటించిన మూగమనసులు తెలుగు సినిమాతో ఇక్కడ షూటింగ్‌లు ప్రారంభమయ్యాయి. ఈ సినిమా మొత్తం దాదాపుగా ఇక్కడే సాగింది. అప్పట్లో ఇది పెద్ద సంచలన విజయం సాధించింది. దీంతో ఇక్కడ షూటింగ్ జరుపుకున్న చిత్రం హిట్ కొట్టడం ఖాయం అని సినీవర్గాల నమ్మకం. అందుకేనేమో ఆ తరువాత చాలా చిత్రాలు ఇక్కడే రూపుదిద్దుకున్నాయి. వాణిశ్రీ, నాగేశ్వరరావు నటించిన 'దసరాబుల్లోడు' సినిమా 70శాతం ఇక్కడే తీశారు. కోటిపల్లి లంకల్లోని ఇసుక తిన్నెలు, పడవపైన, రావిచెట్టు వద్ద తీసిన సీన్లు ప్రేక్షకులను ఎంతగానో ఆకట్టుకున్నాయి. 'చేతిలో చెయ్యేసి చెప్పు బావ...' అనే పాట కోటిపల్లి రేవులోనే చిత్రీకరించారు. ఈ పాట చాలా పాపులర్ అయ్యింది. ఆ తరువాత ఎన్టీఆర్ ఎదురీత, కృష్ణ నటించిన ఊరికి మొనగాడు సినిమాలు ఇక్కడే తీశారు. 1978లో కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో శ్రీదేవి హీరోయిన్‌గా వచ్చిన పదహారేళ్ళ వయస్సు సినిమా దాదాపుగా కోటిపల్లి పరిసర ప్రాంతాలలోనే చిత్రీకరించారు. సిరిసిరిమువ్వ, కిరాయి కోటిగాడు, మురారి, అమ్మోరు వంటి సూపర్ హిట్ సినిమాలు ఇక్కడే తీశారు. సినిమాలే కాకుండా టీ.వి. సీరియల్స్‌కు కూడా కోటిపల్లి రేవు పరిసర ప్రాంతాలు ప్రసిద్ధికెక్కాయి.







లొల్లలాకులు



దోసకాయలపల్లి

ఇక ఆత్రేయపురం పేరు వింటే వెంటనే గుర్తుకొచ్చేవి పూతరేకులు, పచ్చళ్ళు. అలాగే నీటి పరవళ్ళతో తొణికిసలాడే శివారులోని 'లొల్లలాకులూ' కళ్ళెదుట ప్రత్యక్షమవుతాయి. ప్రకృతిలో సహజ సిద్ధమైన సుందర ప్రాంతాల్లో చిత్రీకరించిన సినిమాలను ప్రేక్షకులు ఎక్కువగా ఆదరిస్తుండడంతో దర్శకులు, నిర్మాతలు ఇక్కడ షూటింగ్‌లను ఎక్కువగా నిర్వహిస్తున్నారు. దేశవ్యాప్తంగా ప్రసిద్ధి చెందిన పర్యాటక ప్రాంతాలను ఎంచుకునే సినీ పండితులు కోనసీమలో షూటింగ్ చేస్తే లొల్లలాకుల అందాలను వెండి తెరపై తప్పక బంధిస్తారు. సాక్షి, బుద్ధిమంతుడు, గంగోత్రి, అందాల రాముడు, నా ఆటోగ్రాఫ్, గోపి గోపిక గోదావరి వంటి చిత్రాలు ఇక్కడ రూపుదిద్దుకున్నవే.

సినిమాల పల్లెగా పేరుగాంచిన దోసకాయలపల్లి గ్రామంలో పాతతరం మండువాలోగిళ్ళు చూపరులనను విశేషంగా ఆకర్షిస్తాయి. తోటలతో ఆహ్లాదకర వాతావరణంలో పల్లెటూరు సన్నివేశాలు చిత్రీకరించాలంటే జిల్లాలో గుర్తుకొచ్చేది 'దోసకాయలపల్లి'. జిల్లాలో షూటింగ్ తీయాల్సి వస్తే కనీసం ఒక్క సీనైనా దోసకాయలపల్లి గ్రామంలో తీయడం సెంటిమెంట్‌గా భావిస్తారు సినీ నిర్మాతలు. తెలుగు చలనచిత్ర రంగంలోని అక్కినేని నాగేశ్వరరావు, చిరంజీవి, బాలకృష్ణ, శోభన్ బాబు, నాగార్జున, కృష్ణంరాజు, రాజేంద్రప్రసాద్ మొదలు అల్లరి నరేశ్, సునీల్ తదితర కామెడీ హీరోలు ఈ గ్రామానికి వచ్చి షూటింగుల్లో పాల్గొనడం విశేషం. మన ఊరి పాండవులు, దేవత, మేఘసందేశం, స్వాతిముత్యం, జానకిరాముడు, శంకరాభరణం, ప్రేమించి పెళ్ళాడు, అందాల రాముడు, లాంటి తెలుగు సినిమాలతో పాటు తోహ్ఫా, హిమ్మత్‌వాలా వంటి హిందీ సినిమాలు కూడా ఇక్కడ చిత్రీకరణ జరుపుకున్నాయి.

ఒకవైపు సముద్రం, మూడు వైపులా గోదావరి, పచ్చని తివాచీ పరచినట్లుగా వరిచేలు.... ఒంపుసొంపులతో పయనించే కాలువలు... తలలూపుతూ స్వాగతం పలికే కొబ్బరి చెట్లు.. కేరళ తరహా అందచందాలతో అందరినీ మంత్రముగ్ధులను చేసే సీమ 'కోనసీమ'. అందుకే కోనసీమ సినీరంగాన్ని ఎప్పుడూ విశేషంగా ఆకర్షిస్తుంది. తక్కువ బడ్జెట్‌తో సుందరమైన దృశ్యాలను చిత్రీకరించి లాభాలు ఆర్జించిన సినిమాలు ఎక్కువగా కోనసీమలో తీసినవే కావడం గమనార్హం. హిట్ సెంటిమెంట్ ఇప్పటికీ కొనసాగుతుండటంతో అనేకమంది దర్శక నిర్మాతలు కోనసీమలోనే షూటింగ్ స్పాట్‌లను ఎంచుకుని చిత్రాలను తీస్తున్నారు. కోనసీమవాసులు ఇచ్చే ఆతిథ్యంతో పాటు సినిమా నిర్మాణానికి అవసరమైన పట్టణ, పల్లె వాతావరణాలతో పాటు దేశంలో మరెక్కడా లేనటువంటి ప్రకృతి సిద్ధమైన ప్రాంతాలు ఇక్కడ ఎక్కువగా ఉన్నాయి. అటు అన్నవరం నుండి ఇటు అంతర్వేది వరకూ...





పాపికొండల నుండి యానాం వరకూ ఎన్నో సినిమాల షూటింగులకు మన గోదావరి తీరం నెలవవుతోంది. అంతే కాదు, దిగ్గజాల్లాంటి నటీనటులు, దర్శకులు, సాంకేతిక నిపుణులెందరినో కూడా ఈ గడ్డ అందించింది.

సినీ ప్రముఖుల పురిటిగడ్డ తూర్పుగోదావరి. నటుల విషయానికి వస్తే నల్ల రామ్మూర్తి, సూర్యకాంతం, గీతాంజలి, సి.ఎస్.రావు, కల్పనారాయ్, గౌతంరాజు, జయప్రద, ఆలీ, జిత్‌మోహన్ మిత్ర, వహీదా రెహ్మాన్, లక్ష్మీపతి, పొట్టి రాంబాబు, భానుప్రియ, శాంతిప్రియ, రావుగోపాలరావు, గోకిన రామారావు, కృష్ణభగవాన్, రాళ్ళపల్లి, ద్రాక్షారామ సరోజ, కృష్ణుడు, హైమ, హరనాథ్, ఆర్. నారాయణమూర్తి, దేవదాస్ కనకాల, రాజీవ్ కనకాల (యానాం), దర్శకుల పరంగా చూస్తే ఆదుర్తి సుబ్బారావు, ఎస్.వి. కృష్ణారెడ్డి, వంశీ, శ్రీను వైట్ల, సుకుమార్, శోభన్, చందులు ఈ జిల్లాకు చెందినవారే. ఇక నృత్య దర్శకుడు కె.యస్. రెడ్డి, ఫొటోగ్రఫీలో ఎంతో పేరు ప్రఖ్యాతులు గాంచిన ఛోటా కె. నాయుడులు కూడా ఈ జిల్లావారే. రచయితలు ముళ్ళపూడి వెంకటరమణ, భమిడిపాటి రాధాకృష్ణ, యండమూరి వీరేంద్రనాథ్, వంశీ, సత్యమూర్తి, అదృష్టదీపక్ (గేయరచయిత)తో పాటు ప్రముఖ సంగీత దర్శకులు జె.వి. రాఘవులు, దేవిశ్రీప్రసాద్, రఘు కుంచే కూడా ఇక్కడి వారే. గాయకులు పిఠాపురం నాగేశ్వరరావు, నిర్మాతలు ఏడిద నాగేశ్వరరావు, డి.వి.ఎస్. రాజులు సైతం ఈ జిల్లాకు చెందినవారే కావడం గమనార్హం.



రామచంద్రపురం కోట

# జానపద కళారూపాలు



తూర్పుగోదావరి జిల్లా జానపదకళలకు పెట్టింది పేరు. భారతీయ సంస్కృతి, సంప్రదాయాలను చాటి చెప్పేవి ఈ కళలు. తమ ప్రతిభాపాటవాలతో మహారాజులతో సైతం భేష్ అనిపించుకొన్న కళాకారులకు పురుటిగడ్డ ఈ జిల్లా. బుర్రకథలు, తప్పెట గుళ్లు, వీరనాట్యం, గరగనృత్యం, పగటి వేషాలు, బుడబుక్కల వేషాలు, కొమ్మదాసరి, తోలుబొమ్మలాట, ధింసా నృత్యం, కొమ్మునృత్యం, గారడీ, కోలాటం, హరికథలు, డప్పు వాయిద్యం, కత్తిసాము, కర్రసాము, గంగిరెద్దు ఆటలు, జంగమ దేవర వంటి జానపద కళలకు ఈ జిల్లా పెంట్టింది పేరు.

జానపదాల (పల్లెల) నుంచి పుట్టుకొచ్చినవే జానపద కళలు. పూర్వకాలంలో ప్రజలు వినోదం కోసం తయారు చేసుకున్న ఈ కళలు వారికి లభించే కర్రలు, జంతు చర్మాలతో, ఆటపాటలతో నిండి ఉండేవి. వినోదం కోసం పుట్టిన వాయిద్యాలనే తదనంతరం కాలగమనంలో దేవతల సంబరాల్లో తమ భక్తిని చాటేందుకు వాడడం మొదలైంది. పరిశోధకులు 40కి పైగా జానపద కళారూపాలను గుర్తించారు. రాజులను తమ విద్యలతో అలరించి ఉపాధి పొందే కళాకారులు ఒక వర్గమయితే, పంట దిగుబడి వచ్చే కాలంలో భూస్వాములను, రైతులను ఆశ్రయించి జీవించేవారు మరో విభాగంగా వీరిని గుర్తించారు.







# తూర్పు రుచులు



తాపేశ్వరం కాజా

కోనసీమ
కొబ్బరిబొండాం

ఆత్రేయపురం
పూతరేకులు

కాకినాడ కాజా

అన్నవరం
ప్రసాదం

గొల్లలమామిడాడ
ఇమిర్తి

రంపచోడవరం
బొంగుచికెన్

గోదావరి స్పెషల్
'పులస'



తూర్పు పండుగల
స్పెషల్ 'బూరెలు'

పెరుమాళ్ళపురం
పాకం గారెలు

రావులపాలెం
ముంతబిర్యానీ

అంబాజీపేట
పొట్టిక్కలు

*తూర్పుగోదావరి జిల్లా వంటలకూ పెట్టింది పేరు. నోరూరించే అచ్చతెలుగు ఆహార పదార్థాలు చేయడంలో ఇక్కడి నిపుణులది అందె వేసిన చేయి. జిల్లాలో చేసే కొన్ని ప్రత్యేక వంటకాలు రుచి చూసి తీరాల్సిందే. వీటిలో కాజా, పూతరేకులు, మామిడితాండ్ర, పొట్టిక్కలు, పాకంగారెలతో పాటు అన్నవరం సత్యదేవుని ప్రసాదం ప్రధానంగా ఉన్నాయి. ఇంకా మాంసప్రియులకు ప్రత్యేకంగా పులస, బొంగుచికెన్, ముంతబిర్యాని లాంటివే కాకుండా దేశీయ శీతలపానీయాలూ ఉన్నాయి. వాటిలో కొన్ని మీకోసం...*



## తాపేశ్వరం కాజా

తాపేశ్వరం పేరు చెబితే గుర్తుకు వచ్చేది కాజా. జిల్లాలోనే కాక దేశ, విదేశాలలో సైతం ఇక్కడి కాజాకు పేరు ప్రఖ్యాతులున్నాయి. తాపేశ్వరం కాజాలు రంగు, రుచి, ఆకారంలో ప్రత్యేకంగా ఉండడంతో అందరినీ ఇట్టే ఆకట్టుకునేవి. ఆ ప్రత్యేకతే ఆ నోటా ఈ నోటా పాకి నేడు రాష్ట్రస్థాయిలో తాపేశ్వరం కాజాకు పేరు తెచ్చింది.

ఇక్కడ కాజా తయారీకి ఎక్కడా లేని విధంగా యంత్రాలను రూపొందించి ఉపయోగిస్తున్నారు. సాంప్రదాయ ఆధునికతల మేళవింపుతో కాజాను తీర్చిదిద్దారు. తాపేశ్వరం గ్రామం 1939 నాటి నుంచే ఆంధ్రా పిండివంటల తయారీలో ప్రత్యేకతను సొంతం చేసుకుంది. తాపేశ్వరం కాజాను డీప్‌ఫ్రిజ్‌లో ఉంచి రెండు మూడు నెలల వరకూ నిల్వ చేసుకోవచ్చని, ఫ్రిజ్ నుంచి తీసిన తర్వాత పది నిమిషాలు బయటి వాతావరణంలో ఉంచితే తాజాగా ఉంటాయని తయారీదారులు వివరిస్తున్నారు.



## కోటయ్య కాజా

కాకినాడ నగర ప్రతిష్ఠను విశ్వవ్యాప్తం చేసిన 'కోటయ్య కాజా' తరతరాలనూ ఊరిస్తూ వస్తోంది. దేశ విదేశాల్లో కూడా 'కోటయ్య కాజా'కు పేరు ప్రఖ్యాతులు ఉన్నాయి. మైదాతో తయారు చేసిన 'గొట్టంకాజా' నోరూరించే రుచితో అతి తక్కువ కాలంలోనే ఎంతో ప్రాచుర్యం పొందింది. కాకినాడ మసీద్ సెంటర్ సమీపంలో కోటయ్య స్వీట్‌స్టాల్ పేరుతో చిన్న మిఠాయి దుకాణంగా ప్రారంభమై అతి తక్కువ వ్యవధిలో వినియోగదారుల నోటి ప్రచారంతో దశదిశలా పాకి అంతర్జాతీయ స్థాయిలో క్రేజ్ సంపాదించు కుంది. సామాన్యుల నుంచి సినీ తారలు, రాజకీయ ప్రముఖుల వరకు కోటయ్య కాజాను లొట్టలేసుకుంటూ తింటారు. కాకినాడ వచ్చిన వారెవరైనా కాజా రుచి చూడందే వెళ్లరు. బ్రాండ్ ఇమేజ్ బాగా పెరగడంతో ట్రేడ్ మార్క్, కాపీరైట్ హక్కులను కూడా సాధించుకున్నారు.







## ఆత్రేయపురం పూతరేకులు

పట్టుకుంటే రాలిపోయేటంత పలుచని పొరల్లా ఉండే పూతరేకులు నోట్లో పెట్టుకోగానే మధురానుభూతినిస్తూ కరిగిపోతాయి. పసిపిల్లలు మొదలుకొని వృద్ధుల వరకు వీటిని తిందామని తహతహలాడుతుంటారు. తూర్పుగోదావరి జిల్లాలోని ఆత్రేయపురం గ్రామంలో తయారయ్యే పూతరేకులు దేశ, విదేశాల్లో ప్రాచుర్యం గడించాయి. వీటి తయారీ రెండు దశలుగా ఉంటుంది. మొదటి దశలో రేకులు తయారు చేసుకోవాలి. రెండవ దశలో అలా తయారు చేసిన రేకులను ఒకదానిపై ఒకటి ఉంచి నెయ్యి, మెత్తగా పొడి చేసిన పంచదార, యాలకులపొడి, జీడిపప్పు పొడి చల్లి, చిన్నవిగా మడత పెట్టి తినడానికి వీలుగా చుడతారు.



## పెరుమాళ్లపురం పాకంగారెలు

"తింటే గారెలే తినాల"న్నది పెద్దల మాట. గారెలు తినాలన్నారే కాని ఎక్కడ తినాలో చెప్పలేదు. నిజంగా వారు కాని పెరుమాళ్ళపురం పాకం గారెలు తిని ఉంటే తప్పనిసరిగా ఈ గారెలనే తినాలని చెప్పి ఉండేవారు. తీరప్రాంత కూడలి గ్రామమైన పెరుమాళ్ళపురం మినప పాకంగారెలకు ప్రసిద్ధి. 5 దశాబ్దాలకుపైగా ఇక్కడ ప్రజలకే కాకుండా సుదూర ప్రాంతాల ప్రజలకు పెరుమాళ్ళపురం గారెల రుచి సుపరిచితమే. మినప పిండితో తయారై బెల్లంపాకంలో నానిన గారెలు నోటిలో వేసుకుంటే వెన్నపూసలా కరిగిపోతుండడంతో ఈ ప్రాంతం గుండా వెళ్ళేవారు తప్పనిసరిగా ఆగి పాకం గారెలను లాగించి మరీ వెళ్తారు.





## అన్నవరం ప్రసాదం

అన్నవరం క్షేత్రంలో మిగతా క్షేత్రాలకు భిన్నంగా గోధుమరవ్వతో తయారు చేసిన ప్రసాదం లభ్యమవుతుంది. ఇది అమోఘమైనదిగా ప్రతీతి. విష్ణు పంచాయతన క్షేత్రంగా విరాజిల్లుతున్న అన్నవరంలో మాత్రమే ఈ ప్రసాదం తయారీ ఉంటుంది. సత్యదేవుని దివ్య ప్రసాదం తయారు చేసేందుకు ప్రధానంగా నాణ్యమైన గోధుమనూక, పంచదార, నెయ్యి, యాలకుల పొడి పదార్థాలను ఉపయోగిస్తారు. దీంతో పాటు ప్రసాదానికి సుగంధద్రవ్యాలు, ఇతర వస్తువులను ఉపయోగించడంతో రుచి గణనీయంగా పెరిగి భక్తులను ఆకర్షిస్తోంది.

## అంబాజీపేట పొట్టిక్కలు

'తింటే గారెలు తినాలి... వింటే మహాభారతం వినాలి' అంటారు పెద్దలు. గారెలే కాదు... పొట్టిక్కలు కూడా తినొచ్చంటారు అంబాజీపేట వాసులు. ఎందుకంటే ఇక్కడ తయారయ్యే పొట్టిక్కలు ఆంధ్రుల ప్రత్యేక వంటకమైన గారెల రుచికన్నా మిన్నగా ఉంటాయి. పనస ఆకుల్లో తయారయ్యే ఈ వంటకం ఆరోగ్యానికి మంచిదంటారు. అచ్చం ఇడ్లీలా ఉండే ఈ వంటకానికి ఇడ్లీకన్నా ఎక్కువ డిమాండ్ ఉంది. పొట్టిక్క అసలైన రుచి చట్నీలలోనే ఉంది. కారప్పొడి-నెయ్యి, కొబ్బరిచట్నీ, బొంబాయ్ చట్నీ (శనగపిండి చట్నీ), దబ్బకాయ చట్నీలతో పొట్టిక్క తింటేనే అసలు మజా. ముఖ్యంగా తీపి, పులుపు, కారం మిశ్రమాలతో తయారు చేసే దబ్బకాయ చట్నీతో పొట్టిక్కను తింటే ఆ రుచిని మరిచిపోలేరు.





## కోనసీమ కొబ్బరి బొండం

ఆరోగ్యాన్ని నీటిరూపంలో ఇముడ్చుకున్న అమృతభాండం కొబ్బరిబొండం. తియ్యటి ఆ నీళ్ళు తాగాక, అందులో ఉండే లేత కొబ్బరి రుచి.. తిని చూడాలే తప్ప వర్ణించనలవి కాదు. కల్పవృక్షాన్ని వదులుకోలేని దేవుడు కొబ్బరిచెట్టును ప్రసాదించాడని కోనసీమవాసుల ప్రగాఢ విశ్వాసం. వారి నమ్మకానికి తగ్గట్టే అది మనిషి జీవితంలో ఎన్నో విధాలుగా అల్లుకుపోయింది. అవసరానికి ఆదుకుంటూ కోనసీమ కుటుంబాలకు పెద్దదిక్కుగా... వేలమందికి ఉపాధినిస్తూ, కోనసీమ కంఠహారంగా భాసిల్లుతోంది. ఆరోగ్యానికి కొబ్బరినీళ్లు చేసే మేలు అంతా ఇంతా కాదు. ముదురు కొబ్బరి నీళ్ళ కన్నా లేత కొబ్బరినీళ్లు శరీరాన్ని చల్లబరచడమే గాక జీర్ణక్రియకి ఎంతో మేలు చేస్తాయి. ముఖ్యంగా రోగులకీ, వృద్ధులకీ దీన్ని మించిన టానిక్ లేదు.

## పులస

పుస్తెలమ్మైనా పులస తినాలనేది ఒక నానుడి. దీన్ని బట్టే అర్థమవు తుంది ఈ చేప గొప్పతనం. గోదావరి జిల్లాల్లో తప్ప రాష్ట్రంలో మరెక్కడా పులస లభించదు. ధవళేశ్వరం బ్యారేజీ నుంచి గోదావరి సముద్రంలో కలిసే వరకు గోదావరి పరీవాహక ప్రాంతం అంతా పులసలు దొరుకుతాయి. గోదావరికి వరద నీరు వచ్చే జూలై, ఆగష్టు, సెప్టెంబరు నెలల్లో మాత్రమే ఈ పులసలు దొరుకుతాయి. గోదావరి వరద సమయంలో ఎర్రనీరు సముద్రంలో ప్రవేశించగానే, ఈ చేపలు సాగర జలాల్లోంచి గోదావరిలోకి వస్తాయి. ఉప్పునీటిలో పుట్టే వీటికి మంచినీటిలో ప్రవేశించగానే మంచి రుచి ఏర్పడుతుందని మత్స్యకారులు చెబుతారు. వెండి రంగులో ఉండి చూడడానికి కనువిందు చేసే పులస అదే స్థాయిలో రుచి కూడా ఉంటుంది.

పులస చేపకు గోదావరి పరీవాహక ప్రాంతంలో మంచి గిరాకీ ఉంది. 'హిల్సా ఇలీషా' శాస్త్రీయనామంగా గల ఆరోహక వలస జాతికి చెందిన పులస సాధారణంగా సముద్రంలో విలసగా జీవిస్తుంది. ఈ చేప గోదావరి వరద నీరు వచ్చి సముద్రంలో కలిసే సమయంలో గుడ్లు పెట్టడం కోసం గోదావరిలోకి ప్రవేశిస్తుంది. గుడ్లు పెట్టిన తరువాత మళ్ళీ అక్టోబరు నాటికి తిరిగి సాగరానికి చేరుకుంటాయి. ఈ సమయంలోనే కొన్ని చేపలు వలలకు చిక్కుతాయి. నదీ ప్రవాహానికి అతివేగంగా ఎదురీదడం ఈ చేప ప్రత్యేకత. వలలో పడిన వెంటనే చనిపోవడం, రెండు రోజులైనా పాడవకుండా ఉండడం కూడా పులసల విశిష్టలక్షణం!

వీటి ధర ఒక్కోచోట ఒకో విధంగా ఉంటుంది. సముద్రానికి దగ్గరగా ఉండే యానాం, కోనసీమ ప్రాంతాల్లో సామాన్యులకు అందుబాటులో వీటి ధర ఉంటుంది. అక్కడ దొరికే చేపలకు రుచి కూడా కొంచెం తక్కువే. అక్కడి నుండి రావులపాలెం మీదుగా ఎదురీదుతూ ధవళేశ్వరం బ్యారేజీ వద్దకు చేరే సరికి వీటి రుచితో పాటు ధర కూడా అదిరిపోతుంది. ఏ ఆహారమైనా వేడి వేడిది తింటే రుచి బావుంటుంది, కానీ పులస చేప దీనికి భిన్నంగా నిల్వ ఉంచి మరునాడు తింటే అమోఘంగా ఉంటుంది. దీని పులుసును ఈ ప్రాంత వాసులు ప్రత్యేకంగా చేస్తుంటారు. మట్టి గిన్నెలో మసాలా అద్ది, పులుసు పెడితే రుచితో పాటు సువాసనలు వెదజల్లుతుందని స్థానిక మహిళలు చెబుతున్నారు.





## రావులపాలెం ముంత బిర్యాని

హైదరాబాద్ బిర్యానీ గురించి తెలియని వారుండరు. ఉత్తర... దక్షిణాది రాష్ట్రాల వారిని అద్భుత రుచితో లొట్టలు వేయించే హైదరాబాద్ బిర్యానీకి దాసోహం కాని మాంసప్రియులు ఉండరంటే అతిశయోక్తి కాదు. అటువంటి హైదరాబాద్ బిర్యానీని సైతం మరిపించే బిర్యానీ ప్రస్తుతం మన జిల్లాలోనే దొరుకుతోంది. అదే రావులపాలెం కుండ బిర్యానీ. కొంచెం ఘాటు... కొంచెం కారం... ఎంతో కమ్మదనంతో ఉండే ఈ బిర్యానీ నోట్లో పెట్టుకోగానే వెన్నలా కరిగిపోతూ... తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలకు చెందిన మాంసప్రియులను నోరూరిస్తోంది.

'ఆహా ఏమి రుచి తినరా మైమరచి' అనేలా మాంసం ప్రియుల చేత లొట్టలు వేయిస్తోంది. 2005లో రావులపాలెంలోని ఒక రెస్టారెంట్‌లో పది కుండలతో ప్రారంభమైన ఈ బిర్యానీకి క్రమేపీ ఆదరణ పెరగడంతో ప్రస్తుతం అన్ని రెస్టారెంట్లు దీనిని విక్రయిస్తున్నాయి. రావులపాలెం పరిసర ప్రాంతాల ప్రజలతోపాటు జాతీయ రహదారి మీదుగా రాకపోకలు సాగించే ప్రయాణికులు, మోటార్ వాహనాల యజమానులు సైతం ఈ బిర్యానీ కోసం ఎగబడతారు. డిమాండ్ కారణంగా సాధారణ రోజుల్లో కూడా ఎనిమిది దాటితే చాలు కుండ బిర్యానీ దొరకడం కష్టమే. అదే ఆదివారం అయితే ఏడు గంటలకు ముందే అమ్మకాలు పూర్తవుతాయి. ప్రత్యేకంగా తయారు చేసిన కుండలో బిర్యానీ ఉంచి పైన రంగురంగు పేపర్లతో అందంగా అలంకరించి అమ్మకాలు సాగిస్తారు.





## బొంగు చికెన్

కోడికూర ఏ రెస్టారెంట్లో అయినా దొరుకుతుంది. కానీ... బొంగు చికెన్ తినాలంటే మాత్రం ఏజన్సీ ప్రాంతంలోని మారేడుమిల్లి వెళ్ళాల్సిందే. మన్యంలో పచ్చదనాన్ని, ఆహ్లాదకరమైన వాతావరణాన్ని తనివితీరా తిలకిస్తూ ఏజన్సీ ప్రత్యేక వంటకం బొంగుచికెన్ రుచిని కూడా ఆస్వాదించవచ్చు. ఇక్కడికి పర్యాటకులుగా వచ్చిన వారు గంటల తరబడి నిలబడి మరీ బొంగు చికెన్ తయారు చేయించుకుని ఆ రుచిని ఆస్వాదిస్తున్నారు.

కోడి మాంసాన్ని ముక్కలుగా కోసి శుభ్రపరచి, దానికి అల్లం, వెల్లుల్లి, మసాలా, పచ్చిమిర్చి మిశ్రమాలను కలిపి కొద్దిసేపు ఉంచుతారు. తర్వాత పచ్చి వెదురు బొంగును అడుగున్నర పొడవుతో, ఒకవైపు మూసి ఉండేలా నరికి సిద్ధం చేస్తారు. ముందుగా కలిపి ఉంచిన మాంసం ముక్కల మిశ్రమాన్ని ఈ బొంగులో నింపి, అడ్డాకులతో ఈ బొంగు మూతిని మూసేస్తారు. ఇప్పుడు ఈ బొంగును నిప్పుల మీద సుమారు గంటపాటు కాలుస్తారు. అంతే బొంగు చికెన్ రెడీ. బొంగును పగులగొట్టి ఉడికిన మాంసాన్ని లొట్టలేసుకుంటూ తినేస్తారు.

ఇక్కడ విశేషమేమిటంటే ఈ బొంగు చికెన్ తయారీలో నూనె అస్సలు ఉపయోగించరు. పచ్చి వెదురు బొంగు ఉపయోగించడం వల్ల అందులో ఉన్న నీరు మాంసం ఉడకడానికి సహాయపడుతుంది. డాక్టర్లు సైతం 'వితవుట్ ఆయిల్ ఫుడ్ ఈజ్ బెస్ట్ ఫుడ్' అంటున్నారు.



# బౌద్ధారామాలు





## కాపవరం

క్రీ॥శ॥ 1,2 శతాబ్దాలకు చెందిన అత్యంత ప్రాచీన బౌద్ధక్షేత్రాలలో 'కాపవరం' పాండవుల కొండ ఒకటి. రాజమండ్రికి 20 కి॥మీ॥ దూరంలో గల కోరుకొండ శివారులో కాపవరం ఉంది. 65 ఎకరాల విస్తీర్ణం గల పాండవుల మెట్ట పచ్చని పచ్చికబయళ్ళు, ఆహ్లాదకరమైన తోటల మధ్య ప్రకృతి అందాలను ఒలికిస్తూ భూమికి 250 అడుగుల ఎత్తులో వుంది. ఈ కొండ పైభాగాన సుమారు 35 ఎకరాల భాగం చదునుగా ఉండి పర్యాటకులను ఆకర్షిస్తున్నది. రక్షిత స్మారక ప్రాంతంగా ప్రకటించేందుకు 1972లో మొదటిసారి ఈ కొండపై పరిశోధనలు జరిగాయి. ఈ పరిశోధనల ఆధారంగా ఈ ప్రాంతాన్ని క్రీ॥శ॥ 1,2 శతాబ్దాలకు చెందిన చారిత్రక బౌద్ధారామ ప్రాంతంగా గుర్తించారు. తదుపరి 2001- 2002లో రెండవ దశ తవ్వకాలు జరిగాయి. ప్రస్తుతం పాండవుల కొండ ఉభయ గోదావరి జిల్లాలకు చెందిన ప్రముఖ బౌద్ధక్షేత్రంగా భాసిల్లుతోంది.

కొండ మధ్యలో ప్రాచీన కాలంనాటి రాతి గుహలు, కొండపైన సువిశాల ప్రాంగణంలో మూడు ప్రధాన ప్రాచీన బౌద్ధక్షేత్రాలు, క్రీ॥శ॥ 1వ శతాబ్దం నాటి భూగర్భ డ్రైనేజి వ్యవస్థ, 27 మెట్లతో 30 అడుగుల ఎత్తున 2వ శతాబ్దంలో నిర్మించిన ప్రాచీన మెట్లదారి, ప్రాచీన కాలం నాటి బుద్ధుని పీఠం, చైత్యాలు, ఆరామాలు, స్తూపాలు, బౌద్ధ మత గురువుల ప్రార్థనా మందిరం, బౌద్ధ శిష్యుల నివాస గృహాలు, బౌద్ధ సన్యాసుల సమావేశ మందిరం, అర్ధ చంద్రాకారం, 'యు' ఆకారం, చతురస్రాకారంలో గల ప్రాచీన బౌద్ధ ఓటివ్‌స్తూపాలు, కొండపైన గల పూలతోటలు మొదలగునవి ఈ కొండపై ఉన్న విశేషాలు.







## కొడవలి

3వ శతాబ్దానికి చెందిన శాతవాహనుల కాలంనాటి బౌద్ధారామాలు, బౌద్ధస్తూపాలు చెరిగిపోతున్న ఆనవాళ్లు మనకు కొడవలి గ్రామంలో కనిపిస్తాయి. శంఖవరం మండలం కొడవలి సమీపంలో కొడవలి బౌద్ధారామం ఉంది. శాతవాహన రాజులలో చివరివాడైన గౌతమీపుత్ర యజ్ఞశ్రీ కొడవలి బౌద్ధారామాన్ని నిర్మించి బౌద్ధులకు ఇక్కడ ఆశ్రయం కల్పించాడని తెలుస్తోంది. కొడవలి గ్రామంలో బౌద్ధ స్తూపాన్ని ఇటుకమట్టి కలిపి నిర్మించారు. స్థానికులు ఈ స్థూపాన్ని ధనందిబ్బగా పిలుస్తారు. కొండపై బౌద్ధస్తూపంతో పాటు బౌద్ధుల మత చిహ్నాలు అనేకం ఉన్నాయి. ఆ స్తూపం చుట్టూ తాపడం చేసిన నాలుగు పెద్ద నూతులు ఉన్నాయి. ఒక గోడపై ప్రాకృత భాషలో రాయబడిన శిలా శాసనం ఉంది.

## ఆదుర్రు

భారతదేశంలో బౌద్ధమతం ఆవిర్భవించి విరాజిల్లిన కాలంలోనే కోనసీమలోని 'ఆదివూరు'లో బౌద్ధం తన సౌరభాలతో గుబాళించింది. దేశంలో అతి పురాతన ప్రాధాన్యత కల మూడు బౌద్ధ దివ్య క్షేత్రాలలోను 'ఆదివూరు' మొదటిదని చరిత్ర చెబుతోంది. నాటి 'ఆదివూరు' కాలక్రమంలో నేడు ఆదుర్రుగా మారిందని అంటున్నారు. ఇక్కడి బౌద్ధస్తూపం సుమారు 2400 సంవత్సరాల క్రితం నిర్మితమైనట్లు చరిత్ర తెలుపుతోంది. మౌర్య చక్రవర్తి అయిన అశోకుడు క్రీ॥పూ॥ 271లో చేసిన కళింగ యుద్ధం అనంతరం జీవహింస విడనాడాలని నిర్ణయించుకున్న సమయంలోనే ఈ బౌద్ధస్తూపం నిర్మాణం జరిగిందని అంటున్నారు. దేశంలో అశోకుడు తన ప్రచారపర్వంలో 84వేల బౌద్ధస్తూపాలు నిర్మించాడు. వీటిలో 60 మహాక్షేత్రాలుగాను, 3 దివ్య క్షేత్రాలుగాను విభజించాడు. ఈ మూడింటిలో మొదటిది ఆదుర్రు లోను, రెండవది సాంచిలోను, మూడవది సారనాథ్‌లోను నిర్మించాడు.

## కుమ్మరిలోవ

బుద్ధం శరణం గచ్ఛామి... ధర్మం శరణం గచ్ఛామి... సంఘం శరణం గచ్ఛామి అనే నినాదం కొన్ని వేల సంవత్సరాల కిందట తుని మండలం 'కుమ్మరిలోవ'లో మారుమోగేది. బౌద్ధమతం వ్యాప్తికి ఈ గ్రామం మూల కేంద్రంగా ఉందని వెలుగు చూస్తున్న వాస్తవాలను బట్టి అర్థమవుతుంది. బౌద్ధభిక్షువులు వివిధ ఆకారాల్లో తయారు చేసిన కుండలు, పాత్రలు ఇక్కడి నుంచి విదేశాలకు సైతం ఎగుమతి చేసినట్లు నిరూపితమయ్యే మినీ పోర్టు(జట్టీ) ఈ ప్రాంతంలో బయటపడటం ద్వారా చరిత్రకారులు జిల్లాలోనే ఇప్పటి వరకూ బయటపడిన బౌద్ధపుణ్యక్షేత్రాల కంటే అతి పెద్దదిగా ఈ గ్రామాన్ని గుర్తించారు.









# డా॥ మంగళంపల్లి





### శంకరగుప్తం కేరాఫ్ డా॥ మంగళంపల్లి

తూర్పుగోదావరి జిల్లా మలికిపురం మండలంలో అదో కుగ్రామం. పేరు శంకరగుప్తం. ఆ గ్రామం నుండే కర్ణాటక సంగీతంలో ఆణిముత్యం, గాన గంధర్వ, పద్మభూషణ్, పద్మవిభూషణ్ వంటి అత్యున్నత పురస్కారాలే కాకుండా ప్రపంచస్థాయిలో బెనిలియర్ పురస్కారాన్ని సైతం అందుకున్న డాక్టర్ మంగళంపల్లి బాలమురళీ కృష్ణ జన్మించారు.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందట. అదే విధంగా బాలమురళీకృష్ణ తన 12వ సంవత్సరంలోనే 800 సంకీర్తనలకు బాణీలు సమకూర్చడమే కాకుండా నృసింహ భరణి అనే రాగాన్ని సృష్టించి అప్పటి భారత ప్రధాని స్వర్గీయ పి.వి. నరసింహారావు చేతుల మీదుగా ఆ రాగాన్ని ఆవిష్కరింపచేసిన మహోన్నత వ్యక్తి బాలమురళీ. కర్ణాటక సంగీత విద్వాంసునిగా భారతదేశంలోనే కాకుండా అనేక ఇతర దేశాల్లో సైతం కచేరీలు నిర్వహించి దేశ, విదేశాల్లోని యూనివర్శిటీల నుండి అనేక డాక్టరేట్లు అందుకున్న ఘనుడు బాలమురళీ.

విజయవాడ సంగీత కళాశాల మొదటి ప్రిన్సిపాల్‌గా పనిచేసి ఆయన జి.వి. అయ్యర్ వంటి ప్రముఖ దర్శకుల చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించారు. బాలమురళి భక్తప్రహ్లాద సినిమాలో నారదునిగా నటించి నటనలో కూడా ప్రవేశం పొందారు. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన బాలమురళీ కృష్ణను తిరుమల తిరుపతి దేవస్థానం వారు శాశ్వత ఆస్థాన విద్వాంసునిగా నియమించుకోవడం శంకరగుప్తం గ్రామానికే కాకుండా తూర్పుగోదావరి జిల్లాకే గర్వకారణం.

బాలమురళీ బాల్య జీవితాన్ని పరిశీలిస్తే... 1930 జూలై, 6న శంకరగుప్తంలో తొలి ఏకాదశి పర్వదినాన పట్టాభిరామయ్య, సూర్యకాంతం దంపతులకు జన్మించారు. తండ్రి పట్టాభిరామయ్య వయోలిన్ టీచర్‌గా పనిచేయడం, తాత ప్రయాగ రాందాసు సంగీత విద్వాంసులు కావడంతో ఆయనను సంగీత పాఠశాలలో చేర్చారు. పదో ఏటనే సంగీత కచేరీ చేసిన ఘనత బాలమురళీది.



# పరిశ్రమలు

వ్యవసాయ, సాంస్కృతిక, సాహిత్య, వ్యాపార రంగాలలో అగ్రగామిగా వెలుగొందుతున్న తూర్పుగోదావరి జిల్లా దేశ పారిశ్రామిక పటంలో అగ్రభాగానికి దూసుకుపోతోంది. కాకినాడ పారిశ్రామిక వాడలో జి.ఎం.ఆర్ ఆయిల్ రిఫైనరీ, పవర్ ప్లాంట్లతో పాటు వేల కోట్ల పెట్టుబడులతో రసాయన పరిశ్రమలు, అద్దకం పరిశ్రమలు రానున్నాయి. ఇప్పటికే జి.ఎం.ఆర్. ఎనర్జీ లిమిటెడ్, జి.వి.కె. పవర్ లిమిటెడ్, జి.వి.కె. ఇండస్ట్రీస్, రిలయన్స్ ఇండస్ట్రీస్, రిలయన్స్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ లిమిటెడ్, కెయిర్న్ ఎనర్జీ ఇండియా ప్రై లిమిటెడ్, భాగ్యనగర్ గ్యాస్ లిమిటెడ్, కె.పి.ఆర్. ఫెర్టిలైజర్స్ లిమిటెడ్, నవభారత్ వెంచర్స్, స్పెక్ట్రమ్ పవర్ జనరేషన్ లిమిటెడ్ (కొమరగిరి గ్రామం) పవర్ ప్లాంట్లు ఉన్నాయి. ఇంకా గ్యాస్ ఆధారిత పరిశ్రమలు అనేకం రానున్నాయి. తీర ప్రాంతంలో ఓ.ఎన్.జీ.సి.తో పాటు గుజరాత్ పెట్రోలియం కార్పోరేషన్, కెయిర్న్ ఎనర్జీ వంటి సంస్థలు చమురు, సహజవాయువుల నిక్షేపాలను వెలికి తీస్తున్నాయి. ఇప్పటి వరకు జిల్లాలో ది ఆంధ్రాపేపర్ మిల్స్ లిమిటెడ్, కాకినాడలో నాగార్జున ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్, కోరమండల్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, చెల్లూరు, సామర్లకోట, కాకినాడ, హుస్సేన్‌పురం, మండపేట, ద్వారపూడి తదితర ప్రాంతాలలో తవుడు నుండి నూనె తీసే కర్మాగారాలు, కాకినాడలో బయోడీజిల్ ప్లాంటు చెప్పుకోదగ్గ పరిశ్రమలు. తుని, దివాన్ చెరువు ప్రాంతాలలో జీడిపిక్కల ప్రోసెసింగ్ యూనిట్లు, కడియం, ద్వారపూడిలలో పేపరుమిల్లులు, పెద్దాపురం పారిశ్రామిక ప్రాంతంలో రాక్ సిరామిక్స్, ఎడిబి రోడ్డులో పామాయిల్ ఫ్యాక్టరీ చెప్పుకోదగ్గ పరిశ్రమలుగా భావించవచ్చు. పారిశ్రామిక ప్రగతిలో రానున్న కాలంలో జిల్లాలో కోట్లాది రూపాయల వ్యయంతో మరిన్ని భారీ పరిశ్రమలు స్థాపించబడడానికి ఔత్సాహిక పారిశ్రామికవేత్తలు సిద్ధమౌతున్నారు. కాకినాడ ఎస్.ఈ.జెడ్‌తో పాటు కోస్టల్ క్యారిడార్, కాకినాడ రూరల్ అచ్యుతాపురం, తమ్మవరంలలో ఏర్పాటు చేస్తున్న పారిశ్రామిక పార్కులు, పెద్దాపురం ఇండస్ట్రియల్ ఏరియాలోని ఓరియంట్ సిరామిక్ ఫ్యాక్టరీ, భారీ సాంకేతిక పరిజ్ఞానంతో రూపొందిన రైసుమిల్లులు, కోనసీమ ప్రాంతంలో కొబ్బరి నీళ్ళ ప్రోసెసింగ్ యూనిట్, ఏజన్సీలో రబ్బరు ప్రోసెసింగ్ యూనిట్లు కూడా భవిష్యత్‌లో పారిశ్రామికంగా కీలకపాత్ర వహించనున్నాయి.






### కాకినాడ రేవు

దేశంలో తూర్పుతీరం రేవులలో కాకినాడ ఓడరేవు పూర్వం నుండీ ప్రసిద్ధిగాంచినది. రాష్ట్రంలో విశాఖపట్నం భారీ పోర్టు తర్వాత కాకినాడ పోర్టే పెద్దది. కాకినాడ సముద్రతీరంలో లోతైనది కాకపోవడంతో పెద్ద నౌకలు ఒడ్డు సమీపానికి రావడానికి వీలుకాదు. దీనితో ఒడ్డుకు మూడున్నర కిలోమీటర్ల దూరంలో నౌకలు నిలిపి ఉంచితే చిన్న పడవలు అక్కడకు వెళ్ళి సరుకును ఒడ్డుకు చేరుస్తాయి. దీనిని యాంకరేజ్ పోర్టుగా పిలుస్తారు. ఒకప్పుడు చిన్న చిన్న పడవల ద్వారా ఒడ్డు నుండి నౌక వద్దకు వెళ్ళి సరుకు తీసుకువచ్చే పద్ధతుల్లో చాలా మార్పులు వచ్చాయి. చిన్న పడవలు స్థానే స్టీలు బార్జీలు వచ్చాయి.

### డీప్ వాటర్ పోర్టు

నౌకలు నేరుగా ఒడ్డున నిర్మించిన ఫ్లాట్‌ఫాం వద్ద నిలిపి ఉంచేందుకు ఉద్దేశించిన డీప్‌వాటర్ పోర్టు నిర్మాణాన్ని 1991లో చేపట్టారు. ఇది యాంకరేజీ పోర్టుకు సమీపంలో ఉంది. ఆసియా అభివృద్ధి బ్యాంకు ఋణంతో ఈ నిర్మాణాన్ని 1996లో పూర్తి చేసారు. నౌకలు నేరుగా ఒడ్డుకు చేరడానికి సముద్రం లోపల నుండి 3.3 కి॥మీ॥ దూరం ఒడ్డు వరకూ 40 అడుగుల లోతున సుమారు 400 అడుగుల వెడల్పుతో ఒక ఛానల్‌ను తవ్వారు. ఈ ఛానల్ ద్వారా నౌకలు నేరుగా ఒడ్డున ఉన్న ఫ్లాట్‌ఫాం వద్దకు వచ్చి నిలిచే అవకాశం ఏర్పడింది. 1999లో ఈ కొత్త పోర్టును కాకినాడ సీపోర్ట్ ప్రైవేట్ లిమిటెడ్ అనే కంపెనీకి ప్రభుత్వం అప్పగించింది. దీంతో దీని రూపురేఖలే పూర్తిగా మారిపోయాయి. భారీ నౌకలకు సంబంధించి షిప్ టు షిప్ ఆపరేషన్ ద్వారా కోట్లాది రూపాయల వ్యాపారం జరుగుతోంది. రాష్ట్ర, దేశ, విదేశీ వాణిజ్యంలో కాకినాడకు ఈ పోర్టుల ద్వారా ప్రత్యేక గుర్తింపు వచ్చింది. పోర్టు సౌకర్యంతో కాకినాడ పరిసర ప్రాంతాల్లో కోట్లాది రూపాయల వ్యయంతో అనేక పరిశ్రమలు వచ్చాయి. భవిష్యత్తులో మరిన్ని భారీ పరిశ్రమలు ఏర్పాటు చేయడానికి బడా పారిశ్రామికవేత్తలు, విదేశీ కంపెనీలు సంసిద్ధంగా ఉన్నాయి.





# తూర్పువేదం.. చింతలూరు ఆయుర్వేదం





తూర్పుగోదావరిజిల్లాలోని ఈ పల్లెటూళ్ళో తయారైన మందులు డాబర్, బైద్యనాథ్ వంటి దిగ్గజాల్ని ఢీకొని, అలోపతిని తట్టుకుని, అంతర్జాతీయ మార్కెట్‌లో సైతం దూసుకుపోతున్న చింతలూరు ఫార్మసీ విజయం, నూటికి నూరుపాళ్ళు భారతీయ మేనేజ్‌మెంట్ అద్భుతం. చెదలుపట్టిన తాళపత్ర గ్రంథాలకూ, వైద్యశిఖామణుల అద్దాల అరలకూ పరిమితమైపోయిన ఆయుర్వేదాన్ని ఇంటింటికీ పరిచయం చేసిన ఘనత చింతలూరు వారిదే. ఇప్పుడా ఔషధాలు దేశదేశాలకు ఎగుమతి అవుతున్నాయి. ఎనిమిదన్నర దశాబ్దాల నాటి అచ్చ తెలుగు ఆయుర్వేద బ్రాండ్ 'వేంకటేశ్వర ఫార్మసీ'.

ద్విభాష్యం వెంకటేశ్వర్లు తండ్రి దగ్గర ఆయుర్వేదం అభ్యసించారు. ప్రాచీన గ్రంథాలు చదువుకున్నారు. మూలికల్ని గుర్తించడం తెలుసుకున్నారు. మందుల తయారీలో మెలకువలు గ్రహించారు. కొద్దికాలంలోనే హస్తవాసి ఉన్న వైద్యుడిగా పేరుతెచ్చుకున్నారు. నలభైమూడేళ్ళ వయసులో ఔషదాలు తయారీ మీదే దృష్టి సారించాలని నిర్ణయించుకున్నారు. ఆ లక్ష్యంతోనే 1925లో ఆలమూరు మండలం చింతలూరు గ్రామంలో 'వేంకటేశ్వర ఆయుర్వేద నిలయం' స్థాపించారు.

1949లో వెంకటేశ్వర్లు మరణంతో, సూర్యనారాయణమూర్తి బాధ్యతలు స్వీకరించారు. ఆయన హయాంలోనే ఆయుర్వేద నిలయం 'ప్రైవేట్ లిమిటెడ్'గా మారింది. నారాయణమూర్తి ఆధునీకరణకు ప్రాధాన్యమిచ్చారు. గిరాకీకి సరిపడే సరఫరా పెంచడానికి యంత్రాల్ని ఉపయోగించారు. అలా అని సంప్రదాయ పద్ధతుల్ని పూర్తిగా వదిలిపెట్టలేదు. పాతకొత్తల్ని మేళవించారు. శ్రీరామమూర్తితో మూడోతరం నిర్వహణ మొదలైంది. ఆయన నాయకత్వంలో టర్నోవరు కోట్లకు చేరుకుంది.

ఒకప్పుడు 5 శాఖలతో ప్రారంభమైన వేంకటేశ్వర ఫార్మసీకి ప్రస్తుతం 215 శాఖలున్నాయి. ప్రభుత్వ అనుమతితో సొంతంగా రిసెర్చ్ అండ్ డెవలప్‌మెంట్ వింగ్ (ఆర్ అండ్ డీ) ఏర్పాటు చేసుకొన్నారు. ఔషదాల నాణ్యతను ముందుగా ఇక్కడ పరీక్షించిన తర్వాతే మార్కెట్లో విడుదల చేస్తారు. రాష్ట్రంలో అత్యాధునిక హంగులతో మైక్రోబయాలజీ లేబొరేటరీ ఉన్న ఆయుర్వేద సంస్థ ఇదొక్కటే. ఆయుర్వేద రంగంలో ఇన్ని పేటెంట్లు సాదించిన సంస్థ మరొకటి లేదు. ఆంధ్రప్రదేశ్‌లో ఐఎస్ఓ సర్టిఫికెట్ పొందిన మొట్టమొదటి ఆయుర్వేద కంపెనీ కూడా ఇదే.

ఆయుర్వేద ఔషదాల్లో 'చ్యవనప్రాశ'కు చాలా గిరాకీ ఉంది. 1998లో ఆంధ్ర విశ్వవిద్యాలయ రసాయనశాస్త్ర విభాగాధిపతి ఎస్.సోమేశ్వరరావు దేశవ్యాప్తంగా వివిధ సంస్థలు ఉత్పత్తి చేస్తున్న చ్యవనప్రాశ లేహ్యాలను పరీక్షించి, ఆయుర్వేద నిలయం తయారు చేసిందే శ్రేష్టంగా ఉందని గుర్తించారు. వేంకటేశ్వర ఆయుర్వేద నిలయం సిద్ధమకరధ్వజం, పూర్ణచంద్రోదయం, వసంత కుసుమాకరం తదితర ఔషధాల తయారీతో ఎంతో పేరు తెచ్చుకుంది.



## నాణ్యతకు పెద్దపీట

ఆయుర్వేద నిలయం ఎండీ శ్రీరామమూర్తి గదిలోకి అడుగుపెట్టగానే 'క్వాలిటీ ఫస్ట్... లాస్ట్... ఫర్‌ఎవ్వర్' అన్న మాటలు కనిపిస్తాయి. ఆ సంస్థ విజయ రహస్యం కూడా అదే. ప్రాణం నిలిపే మందుల్నీ వాటి తయారీ విధానాల్నీ ప్రాణసమానంగా చూసుకోవాలన్నది వ్యవస్థాపకుల కాలం నుంచీ పాటిస్తున్న సూత్రం.

ఆయుర్వేద నిలయాన్ని ప్రారంభించిన తొలిరోజుల్లో చింతలూరు ఎలాంటి ప్రత్యేకతలూ లేని కుగ్రామం. సరైన దారిలేదు. పోస్టాఫీసు లేదు. కనీస సౌకర్యాలు లేవు. ఆ పేరుతో ఓ ఊరు ఉందన్న సంగతి కూడా చాలామందికి తెలియదు. ఆ పల్లెకు ప్రపంచపటంలో ప్రత్యేకమైన గుర్తింపును తీసుకొచ్చింది వేంకటేశ్వర ఫార్మసీ. వెంకటేశ్వర్లు అయినా, ఆయన వారసులైనా సొంత ఊరి అభివృద్ధి విషయంలో తమ బాధ్యతను ఎప్పుడూ మరచిపోలేదు. చింతలూరుతోపాటు, చుట్టుపక్కల గ్రామాల వారికి ఉచితంగా వైద్యం చేస్తున్నారు. 'అందరికీ ఆయుర్వేదం... ఆయుర్వేదంతో ఆరోగ్యం'... ఇదే వారి నినాదం.









# రామదుర్గం

చుట్టూ ఎత్తైన కొండలు.. దట్టమైన చెట్లు... పక్షుల కిలకిలారావాలు చూడముచ్చటగా గిలిగింతలు పెట్టించే ఆహ్లాదకరమైన వాతావరణం... ఇవన్నీ కలబోసిన మహాదుర్గం రామదుర్గం. చరిత్రకు అందని సాక్ష్యాలెన్నో ఈ కొండపై ఉన్నాయి. తూర్పు కనుమల నడుమ ఎత్తైన కొండపై వున్న ఈ చారిత్రక దుర్గం గురించి చాలామందికి తెలియదు. అద్భుతమైన రాతి శిల్పాలు ఇక్కడ ఉన్నాయి. దేవీపట్నం మండలం నెలకోట సమీపంలో రామదుర్గం ఉంది. ప్రకృతి రమణీయ దృశ్యాలకు నిలయంగా ఉన్న ఈ ప్రాంతానికి చేరుకోవాలంటే మిక్కిలి శ్రమ పడాల్సిందే. రామదుర్గం చేరుకోవాలంటే సుమారు మూడు వందల మెట్లు ఎక్కాలి. ఆ తరువాత వాగులు వంకలు వేసిన కాలిబాటే ఇదెక్కడానికి ఆధారం. చల్లని గాలి, ఆహ్లాదకరమైన వాతావరణం, రమణీయమైన ప్రకృతి దృశ్యాలు రామదుర్గం ప్రాంతానికి చేరిన వారికి ఉల్లాసాన్నిస్తాయి. ఏటా శ్రీరామనవమితో పాటు ముఖ్యమైన వేడుకలు రామదుర్గంలో జరుగుతుంటాయి.

ఈ కొండ మీద ఒక రాతి కొలను విచిత్రంగా ఉంటుంది. రాతిమెట్లతో సుమారు ఎనిమిది అడుగుల లోతులో ఉండే ఈ కొలనులో నీరు చాలా మధురంగా ఉంటాయి. ఎన్ని వందల మంది స్నానాలు చేసినా ఎంత నీరు ఇందులోంచి తోడినా ఏమాత్రం తరగదు. ఇంత పెద్ద కొండపై ఈ కొలను ఉండటం చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. ఈ కొండపై మూడు దశాబ్దాలకు పైగా ఒంటరిగా నివాసమున్న సాధువు మొదట్లో అక్కడి ఆలయంలోనే ఉండేవారు. ఇక ఈ కొండపై నుంచి పెద్ద కొండకు కాలిబాట వుంది. దాని గుండా సుమారు రెండు కిలోమీటర్లు నడిస్తే పైకి చేరతాము. పెద్ద కొండనే రామదుర్గం అంటారు. ఈ కొండ ఎక్కడం కూడా ఎంతో శ్రమతో కూడుకున్నదే. చుట్టూ చీమలు పెట్టిన పుట్టలు, మధ్యమధ్యలో రాతిబండలు దాటి పైశిఖరానికి చేరాలి. శిథిలావస్థలో ఉన్న ఒక పెద్ద కోటగోడ, దాని సింహద్వారం  మనకు స్వాగతం పలుకుతాయి.

*గోకవరం నుండి ఇందుకూరు పేట మీదుగా సుమారు 15 కి॥మీ॥ దూరంలో దేవీపట్నం మండలంలో రామదుర్గం ఉంది. రాజమండ్రి నుండి పురుషోత్తపట్నం వెళ్ళే దారిలో కూడా రామదుర్గం చేరుకోవచ్చు.*













అది దాటి పైకి వెళితే అక్కడ మెట్లదారి ఉంటుంది. ఆ బాటలో మరో రెండు ఫర్లాంగులు ఎక్కితే అక్కడ వేణుగోపాల స్వామి గుడి ఉంటుంది. ఆ గుడికి పక్కనే చిన్న చిన్న రాళ్ళు పేకమేడలా పేర్చి ఉంటాయి. చూడడానికి ఎవరైనా చిన్నపిల్లలు ఆడుకున్నట్టు పేర్చి ఉంటాయి. కానీ సప్త సంతానాలలో గుడి కట్టడం ఒకటి. సంతానం లేనివారు ఇక్కడికి వచ్చి వేణుగోపాలుని దర్శించుకొని అలా గుడి కట్టినట్లు రాళ్ళు పేర్చటం ప్రాచీనుల విశ్వాసం. ఈ గుడిని ఆనుకుని రెండు రాతి ప్రహరీలు శిథిల దశలో ఉన్నాయి. చెట్లుపుట్లను తొలగించుకుని వాటి లోపలకు ప్రవేశిస్తే లోపల రెండు విశాలమైన హాలు వంటి గదులు ఉన్నాయి. వాటి చుట్టూ కూడా రాతి ప్రాకారాలు ఉన్నాయి. వీటిలోకి ప్రవేశించడానికి నాలుగువైపులా ద్వారాలు కూడా ఉన్నాయి. ఇక్కడికి సుమారు రెండు వందల గజాల దూరంలో ఒక రాతిపై రెండు గుంటలు ఉన్నాయి. వీటిని పచ్చకోనేరు, ఎరుపు కోనేరు అని పిలుస్తారు. చిత్రం ఏమిటంటే ఇందులో ఎన్ని నీళ్ళు పోసినా నిల్వ ఉండవు. పైగా ఒక గుంటలో నీళ్ళు పోస్తే అవి పచ్చగా మారిపోతాయి. దీనిని ఆనుకునే దుర్గం అంచు ఉంటుంది. ఈ అంచు వెంట రాతి ప్రహరీ భయం గొలిపే విధంగా ఉంటుంది. అంత ఎత్తున, అంత చివరన ఆ రాళ్ళు ఎలా తీసుకువెళ్ళారో, ఎలా కట్టారో ఆశ్చర్యం కలిగిస్తుంది. ఈ కోట గోడలు ఏ కాలం నాటివనే ప్రశ్నకు సమాధానం లేదు. ఈ కోట 11వ శతాబ్దంలో రఘుదేవపురాన్ని పాలించిన గజపతుల కాలంనాటిదని, వారికి సంబంధించిన రహస్య మందిరాలుగా ఈ దుర్గాన్ని నిర్మించుకున్నారని చెబుతున్నారు. పేరుకు రామదుర్గమే అయినా ఈ కోటపై కొలువున్నది శ్రీ వేణుగోపాలస్వామి. క్రింద కొండపై రామాలయం ఉండేది. శ్రీకృష్ణదేవరాయలు దక్షిణదేశ దండయాత్రకు వచ్చినపుడు గోదావరిని ఈ ప్రదేశంలోనే దాటాడని, ఈ కొండల అనుపానులు గమనించి ఈ ఎత్తైన కొండపై దుర్గం నిర్మిస్తే రక్షణ చర్యలకు బావుంటుందని భావించి ఈ దుర్గం నిర్మించారని ప్రచారం ఉంది. ప్రకృతి ప్రేమికులకు, చారిత్రక అభిమానులకు ఇది అద్భుతమైన ప్రదేశం. వంపులు తిరిగిన గోదావరి అందాలు చూడాలంటే ఈ కొండపై నుంచే చూడాలి. అందాలు చిందించే రామవరపు ఆవ ఈ కొండపై నుండి చూడడం గొప్ప అనుభూతినిస్తుంది.



# విప్లవజ్యోతి అల్లూరి






అల్లూరి సీతారామరాజు
పోస్టల్ స్టాంపు



రామరాజు చిన్ననాటి ఫొటో

బ్రిటిష్ సామ్రాజ్యాన్ని గడగడలాడించిన మన్యం వీరుడు... బ్రిటీష్ దొరల ఆగడాలకు ఎదురొడ్డి పోరాడిన విప్లవజ్యోతి మన అగ్గిపిడుగు "అల్లూరి సీతారామరాజు". తెల్లదొరల బానిస సంకెళ్ళ నుంచి మన్యంవాసుల విముక్తి కోసం ఎడతెగని పోరు సలిపిన ఈ మహనీయుడు అందరి మనసుల్లో చిరస్థాయిగా నిలిచిపోయాడు. పోరుబాటలో ఎన్ని కష్టాలు ఎదురైనా ఏమాత్రం వెరవక ఉద్యమాన్ని బలంగా ప్రజల్లోకి తీసుకెళ్ళాడు. ఆ మహావీరుడికి గోదావరి జిల్లాలతో ఎనలేని అనుబంధం ఉంది. ఆయన ఉద్యమ పథానికి బీజాలు పడింది మన రాజమహేంద్రవరంలోనే.

రాజు సొంత ఊరు పశ్చిమగోదావరి జిల్లాలోని మోగల్లు. 1897 జూలై 5న విశాఖ జిల్లా పాండ్రంకిలో సీతారామరాజు జన్మించాడు. రామరాజు 1904 నుంచి 1910 వరకూ రాజమండ్రిలో 6వ తరగతి వరకూ చదువుకున్నాడు. 1911లో రామచంద్రపురం జాతీయ పాఠశాలలో 7వ తగరతి, 1912లో కాకినాడ పి.ఆర్. పాఠశాలలో 8వ తరగతి, 1913లో విశాఖపట్నంలోని ఏవిఎస్ ఉన్నత పాఠశాల, నరసాపురంలోని టైలర్ స్కూలులో 9వ తరగతి, 1914-15లో తునిలో సంస్కృతం, జోతిష శాస్త్రము, హఠయోగము, విలువిద్య, గుర్రపుస్వారీ నేర్చుకున్నాడు. 1915-17 వరకూ ఉత్తరదేశ యాత్రలు చేసి అనంతరం గోదావరి-విశాఖ మన్యంలో ప్రవేశించాడు.

రామరాజు తండ్రి వెంకటరామరాజు పశ్చిమగోదావరి జిల్లా తణుకులో స్టూడియో నడుపుతుండేవాడు. అక్కడ ఆర్థిక పరిస్థితి బాగోక మిత్రుల సూచన మేరకు 1902లో రాజమహేంద్రికి వచ్చేశాడు. ఇన్నీసుపేటలోని జువ్వాది వారి దుకాణాల సముదాయంలోకి స్టూడియో మార్చాడు. రామరాజు పదేళ్ళ వయసులో ఒకరోజు తండ్రితో గోదావరి తీరానికి వెళ్ళాడు. ఆ సమయంలో బ్రిటిష్ దొర అటుగా గుర్రంపై వస్తుండగా గోదావరి తీరానికి షికారుకు వచ్చిన వారంతా లేచి నిలబడి ఆ దొరకు వందనం చేయడం మొదలు పెట్టారు. వారిని చూసి రామరాజు కూడా దొరకు నమస్కారం చేశాడు. అది చూసిన రామరాజు తండ్రి తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేస్తూ తెల్లదొరల ఆకృత్యాలను రామరాజుకు వివరించి మందలించాడు. ఈ సంఘటనతోనే రామరాజు మనసులో తెల్లవారి పట్ల వ్యతిరేకభావం మొదలైంది. క్రమేపి వారి ఆగడాలను కళ్ళారా చూసిన అల్లూరి, వారి నుంచి విముక్తి కోసం పోరాటానికి సిద్ధమయ్యాడు.

1922 జనవరి నుండి 1924 మే వరకూ దాదాపు 27 నెలలు రామరాజు సాగించిన విప్లవం ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర్య చరిత్రలో ప్రధాన ఘట్టమైంది. ఆయన సాగించిన విప్లవం విశాఖ, తూర్పుగోదావరి జిల్లాలకే పరిమితమైనా, అప్పటి రవి అస్తమించని బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడలాడించింది. సహాయ నిరాకరణ ఉద్యమం కంటే అల్లూరి విప్లవమే బ్రిటిష్ ప్రభుత్వాన్ని వణికించింది. బాల్యంలో చూసిన పలు సంఘటనలే ఆయనలో దేశభక్తిని రగిల్చి విప్లవ రాజకీయాల వైపు ఆకర్షితుడిని చేశాయి. గాంధీజీ అహింసా మార్గాన్ని వ్యతిరేకించిన రామరాజు బ్రిటిష్ పాలకులను దేశం నుండి తరిమివేయడానికి విప్లవోద్యమమే సరైన మార్గమని నమ్మాడు. జలియన్‌వాలాబాగ్ ఉదంతం గురించి విని చలించిపోయిన ఆయన 1921లో పశ్చిమబెంగాల్‌లోని చిట్టలాంగ్ అడవులకు వెళ్ళి బెంగాల్ విప్లవకారులతో సమావేశమయ్యాడు. అనంతరం విశాఖ జిల్లా గూడెం అడవులను స్థావరంగా ఎంచుకుని విప్లవోద్యమాన్ని ప్రారంభించాడు. చింతపల్లి తహసీల్దారు బాస్టియన్, ఓవర్‌సీస్ ఉద్యోగి సంతానం పిళ్ళై అకృత్యాలను ఎదుర్కొనేందుకు రామరాజు గిరిజనులను సమీకరించాడు.

విప్లవకారుడిగా మారిన రోజుల్లో రామరాజు తండ్రి స్నేహితుడైన ఫజుల్లాఖాన్ పోలవరం డిప్యుటీ కలెక్టర్‌గా పని చేసేవారు. రామరాజును విప్లవమార్గం నుండి తప్పించేందుకు అడ్డతీగల సమీపంలోని పైడిపుట్టలో 30 ఎకరాల భూమిని వ్యవసాయం చేసుకోమని ఇప్పించారు. ఆ సమయంలో తల్లి, బావ, తమ్ముడితో రామరాజు కొంతకాలం అక్కడే గడిపాడు. 1922 జూన్‌లో ఫజుల్లాఖాన్ మృతి చెందాక రామరాజు విప్లవ కార్యక్రమాలు తిరిగి ప్రారంభమయ్యాయి. బ్రిటిష్ వారిపై పోరాటానికి ఆయుధాలు ముఖ్యమని భావించిన రామరాజు మిరపకాయ టపాసుల ద్వారా ముందుగానే హెచ్చరించి పోలీస్‌స్టేషన్‌పై దాడులు చేసేవాడు. 1923 ఆగష్టు 22న చింతపల్లి పోలీసుస్టేషన్‌పై, ఆగష్టు 24న రాజవొమ్మంగి స్టేషన్‌పై తన అనుచరులతో దాడి చేశాడు. ఈ విడుదల విషయాన్ని దేశంలోని పత్రికలన్నీ పతాక శీర్షికల్లో రాశాయి. రాజు పేరు దేశమంతటా మారుమ్రోగింది. బ్రిటిష్ ప్రభుత్వానికి పక్కలో బల్లెంలా తయారైన సీతారామరాజును తలుచుకుంటేనే వెన్నులో చలిపుట్టేది. సీతారామరాజును పట్టించిన, ఆచూకీ తెలిపినా పదివేల రూపాయలు బహుమతి ఇస్తామని ప్రభుత్వం ప్రకటించింది. రాజును పుట్టుకునేందుకు జిల్లా ఏజన్సీలో గుర్తేడు నుంచి చింతపల్లి వరకూ భారీ ఎత్తున సైన్యాన్ని దింపింది. డాసన్, షర్బీస్, హమ్స్, కౌస్టర్స్, ట్రైమన్ అనే సైనికాధికారులను నియమించి రాజును బంధించే బాధ్యత అప్పగించింది.

రాజు అక్టోబరు 16న అడ్డతీగల పోలీసు స్టేషన్‌పై దాడి చేశాడు. ముందుగా కబురు పంపి చేసిన ఈ దాడిని ఎదుర్కొనేందుకు ప్రభుత్వం ప్రయత్నించింది. ఇందుకు అదనపు సైన్యాన్ని ఇతర ప్రాంతాలకు పంపింది. పేరు మోసిన పంజాబుకు చెందిన విప్లవ యోధుడు పృథ్వీసింగ్‌ను ప్రభుత్వం బంధించి రాజమండ్రి సెంట్రల్‌జైలుకు తీసుకువచ్చింది. రాజు జైలుపై దాడిచేసి విడుదల చేయనున్నాడని పుకార్లు వ్యాపించాయి. ప్రభుత్వం జైలు చుట్టూ భద్రతను కట్టుదిట్టం చేసింది. ఈ సంఘటన రాజు అంటే బ్రిటీషు ప్రభుత్వానికున్న దడను తెలియజేస్తుంది. అనంతరం 1924, మే 6న రాజు రంపలో ఉన్నట్టు సమాచారం తెలుసుకున్న ప్రభుత్వం అక్కడికి పోలీసులను పంపింది. అల్లవర్ నాయుడు అనే సైనికాధికారి రాజును బంధించాడు. అక్కడ జమేదారును రాజును కాల్చి చంపాల్సిందిగా మేజర్ గోడాల్ అనే బ్రిటీషు సైనికాధికారి అదేశించాడు. అతను రాజు భుజంపై కాల్చాడు. అనంతరం గోడాల్ రాజును కాల్చి చంపాడు. ఆ విధంగా బ్రిటిష్ గుండెల్లో తుఫాను సృష్టించిన విప్లవవీరుడు సీతారామరాజు నేలకొరిగాడు.



శ్రీ అల్లూరి శ్రీరామరాజు గారి సమాధి

బ్రిటిష్‌వారు అల్లూరి సీతారామరాజుకు ఇచ్చిన పైడిపుట్టగ్రామంలోని 50 ఎకరాల భూమిని నిరాకరిస్తూ ఆయన స్వంత దస్తూరితో వ్రాసి యిచ్చిన లేఖ



తుపాకీ తూటాలకు
నేలకొరిగిన అల్లూరి
(పాతచిత్రం)

# సంప్రదాయ విందు

తాటాకు స్పూన్‌తో బాదం ఆకు ప్లేటులో అల్పాహారం... అరిటాకు దొనెలో తేనీరు... మట్టి పాత్రల్లో మట్టి పొయ్యలపై వండిన ఆహార పదార్థాలతో... అరటి డొప్పల కంచంలో భోజనం... ఈ విందు ఏదో కొంచెం కొత్తగా... కాసింత వింతగా అనిపిస్తుందా....! కానీ ఇదేం కొత్త కాదు. ఇవన్నీ మన గతకాలపు స్మృతులే... కొత్తదనం మోజులో ఈ నాగరిక సమాజంలో మనం సంప్రదాయ వస్తువుల వాడకాన్ని విస్మరించి ప్రమాదకరమైన ప్లాస్టిక్ వస్తువులను వాడుతూ అటు పర్యావరణాన్ని, ఇటు ఒళ్ళు గుల్ల చేసుకుంటున్నాం. అయితే తాళ్లరేవు మండలం చొల్లంగిపేట సముద్రతీర ప్రాంతంలో ఉన్న ఓ ప్రైవేటు అతిథి గృహంలో ఈ సంప్రదాయ వస్తువులను వినియోగిస్తున్నారు. తమ అతిథిగృహానికి వచ్చే యాత్రికులకు కాళ్ళుకడగడానికి చెంబుతో నీళ్ళు అందిస్తూ అప్యాయతతో కూడిన స్వాగతం అందిస్తున్నారు. అంతేకాదు ఆడవారికి సంప్రదాయంగా కుంకుమ బొట్టు పెట్టి ఆహ్వానించడం ఇక్కడి ప్రత్యేకత. వంట చేయడానికి కూడా మట్టి పొయ్యిలు, మట్టి పాత్రలనే ఉపయోగిస్తూ మరిచిపోయిన మాధుర్యాలను మళ్ళీ మనకు చూపిస్తున్నారు. ఈ సంప్రదాయ విందుతో వీరు యాత్రికులకు కొత్త అనుభూతిని కలిగిస్తున్నారు.





# గ్రామదేవతలు

ఈ సృష్టికి మూలమైన జగన్మాత త్రిమూర్తులను సృష్టించి తనను పరిణయమాడవలెనని కోరగా, అందుకు బ్రహ్మ, విష్ణువులు అంగీకరించక పోవుటచే శంకరున్ని కోరగా మూడవనేత్రమును, తన శక్తులను తన వశము చేసినచో అందుకు అంగీకరించెదనని తెలిపెను. ఆ మాటలకు జగన్మాత అంగీకరించి తన శక్తులతో పాటు మూడవ నేత్రమును శంకరుని వశము చేసినంతనే శంకరుడు జగన్మాతను భస్మము చేసెనట. అంతట ఆ భస్మమును నాలుగు భాగములు చేసి మూడు భాగములను సరస్వతి, లక్ష్మీదేవి, పార్వతిగా తాను పొందిన శక్తి ప్రభావముచే సృష్టించెను. మిగిలిన నాల్గవ భాగమును మరలా 101 భాగములుగా చేసి వాటికి ప్రాణం పోసి లోకరక్షణకై ఒక్కొక్క గ్రామమునకు ఒక్కొక్క దేవత గ్రామ రక్షణ గావించవలెనని ఆదేశించెనట. అలా పరమశివుడు ఆదేశించిన దేవతలే నేడు గ్రామదేవతలుగా ప్రతీ గ్రామంలోనూ వెలిసినారట. అలా వెలసిన వారే నూకాలమ్మ, పోలేరమ్మ, సత్తెమ్మ, శ్యామలమ్మ, ముత్యాలమ్మ, మద్ది గౌరమ్మ, మొద కొండమ్మ, నేరేళ్ళమ్మ, మరిడమ్మ, పళ్ళాలమ్మ తదితర దేవతలుగా 101 మంది అక్కాచెళ్ళెల్లు ఉద్భవించినారట. శ్రీ మహావిష్ణువు వీరందరికీ తమ్ముడుగా పోతురాజు అనే నామంతో ఉద్భవించెనట. అప్పటి నుండియూ ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క గ్రామదేవత వెలసి గ్రామసంరక్షణార్థమై గ్రామ పొలిమేరల్లో ఉంటూ గ్రామాన్ని దుష్టశక్తుల బారి నుంచి కాపాడి రక్షిస్తున్నారట. ప్రతీ సంవత్సరం ఫాల్గుణ శుద్ధ అమావాస్య వరకూ ప్రతీరోజూ రాత్రి గ్రామ సంరక్షణార్థమై ఈ దేవతలు తనకు ప్రతిరూపమైన గరగలుగా వెళ్ళి ఎక్కేగుమ్మం దిగేగుమ్మంగా వెళ్తూ ఏమైనా దెయ్యాలు-భూతాలు కనిపించినచో తమ తమ్ముడైన పోతురాజుకు అప్పగించి వస్తారట.

తన అక్క తనకు అప్పచెప్పిన దుష్టశక్తులను పోతురాజు బారికోడు (మాదిగవాడు)కి అప్పగించి వస్తాడట. అలా అప్పగించిన దూతలను బారికోడు మరల గ్రామ పొలిమేరకు తీసుకెళ్ళి దిగదుడుపులను వదిలి వస్తుంటాడట. ఇది అనాదిగా వస్తున్న ఆచారంగా ఈనాడు పల్లెలయందు - పట్టణాలయందు కూడా పూర్వపు సంప్రదాయబద్ధంగా ఆచరిస్తూ వస్తున్నారు.

# తూర్పు వేదం

'వేదంలా ఘోషించే గోదావరి...' అని ఒక సినీ కవి వర్ణించినట్టుగా, గోదావరి పరవళ్ళు వేదాలను ఘోషిస్తాయి. అటువంటి గోదావరిని ఆనుకుని ఉన్న ఈ జిల్లాలో ముఖ్యంగా కోనసీమ ప్రాంతంలో పలు గ్రామాల్లో పురాణకాలం నుంచి నేటి వరకూ ఏదో ఒకచోట వేదఘోష మారుమ్రోగుతూనే ఉంటుంది. కాలం మారినా, ఇప్పటికీ వేదాలు అభ్యసించి, వాటిని దేవాలయాల వద్ద పఠించేవారు ఎందరో ఉన్నారు. వేదాలనగానే కోనసీమలో ముందుగా గుర్తుకు వచ్చే గ్రామం పి. గన్నవరం మండలం ముంగండ. మునులు ఋషీశ్వరులు సంచరించే ఈ ప్రాంతాన్ని ఒకప్పుడు మునిగండ అని పిలిచేవారట. పిఠాపురం సంస్థాన పరిధిలోని ముంగండ గ్రామంలో మునులు సంచరిస్తూ తపస్సు చేసుకునేవారని పూర్వీకులు చెబుతుంటారు. నా మునిగండ రానురాను వాడుకలో ముంగండగా మారింది. ముంగండ గ్రామం వేదాలకు పుట్టినిల్లు. తాజ్‌మహల్ నిర్మించిన మొగల్ సామ్రాజ్యాధినేత షాజహాన్ చక్రవర్తికి ఆస్థాన పండితుడైన జగన్నాథ పండితరాయులది ముంగండ గ్రామమే. సంస్కృత విద్వాంసునిగా ఆయన జాతీయస్థాయిలో పేరుపొందారు. అప్పటికే ఈ గ్రామం ఎంతోమంది వేదపండితుల వేదఘోషతో పునీతమైందని చరిత్ర చెబుతోంది. నాటి షాజహాన్ కాలం నుండి నేటి వరకు ఈ గ్రామానికి చెందిన ఎంతోమంది వేదాలను అవపోసన పట్టి గ్రామానికి వన్నె తెచ్చారు.



ముంగండతో పాటు అమలాపురం మండలం పేరూరు కూడా వేదపండితుల గ్రామంగా పేరుగాంచింది. తమిళనాడుకు చెందిన ద్రవిడ బ్రాహ్మణులు ఇక్కడకు వచ్చి స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నారు. ఒకప్పుడు ఈ గ్రామాన్ని పెళమలూరు అని పిలువగా కాలక్రమేణా పేరూరుగా మారింది. ఈ గ్రామానికి చెందిన ఎంతోమంది పండితులు వేదపారాయణలో ఘనాపాఠీలుగా పేరొందారు. ఈ గ్రామానికి చెందిన దివంగత గంటి సుబ్బయ్య దీక్షితులు, గంటి ఎర్రసోమయాజులు వేదపండితులుగా ప్రసిద్ధి చెందారు. అలాగే భట్నవిల్లి గ్రామానికి చెందిన దివంగత మండలీక వెంకటశాస్త్రి , బులుసు అప్పనశాస్త్రిలు ప్రఖ్యాత వేదపండితులు. రావులపాలెం మండలం పొడగట్లపల్లి కూడా వేదపండితుల గ్రామంగా పేరుగాంచింది. గ్రామానికి చెందిన పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి వేదపండితునిగా గుర్తింపు పొందారు. అంబాజీపేట మండలం ఇరుసుమండకు చెందిన దువ్వూరి సర్వేశ్వర ఘనాపాఠి తిరుమల తిరుపతి దేవస్థానంలో వేదవిద్యా పరీక్షాధికారిగా సేవలందిస్తున్నారు. ముక్కామలకు చెందిన దువ్వూరి ఫణిశర్మ కోనసీమ వేదపాఠశాల శిక్షణాధికారిగా సేవలందిస్తున్నారు. అయినవిల్లి మండలం నేదునూరుకు చెందిన యనమండ్ర ఘనాపాఠి వారు వేదపండితులుగా పేరుప్రఖ్యాతులు గడించి కోనసీమకు వన్నె తెచ్చారు.

# అర్తమూరు

పూర్వజన్మలో చేసుకున్న పుణ్యాలే జన్మజన్మలకు తోడుంటాయన్న చందాన ఏనాడు ఏ పుణ్యం చేసుకుందో ఆ భూమిపై ఆధ్మాత్మిక వనాలు విరజిల్లాయి. మహానుభావులు ఆ ఊరిలో అవతరించారు. ఎంతో పుణ్యం చేస్తే కానీ అటువంటి చోట పుట్టరనే నానుడిని నిజం చేస్తూ గ్రామమంతా సుభిక్షంగా ఉండడం విశేషం. దేశం నలుమూలలా ఆధ్యాత్మిక సందేశాలను అందిస్తున్న శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ జీయర్ స్వామి, శ్రీశ్రీశ్రీ పెరియర్ జీయర్ స్వామీజీలు జన్మించిన పుణ్యస్థలం అర్తమూరు గ్రామం. ఆ గ్రామంలో లక్ష్మీదేవి కొలువు తీరిందా అనే రీతిలో ఆప్రాంతమంతా సుభిక్షంగా ఉంటుంది. 1956 నవంబర్, 3న వెంకటాచారి, అలివేలు మంగతాయారు దంపతులకు చినజీయర్ స్వామి జన్మించారు. ఆయనకు శ్రీమన్నారాయణ రామానుజాచారి అని నామకరణం చేసారు. ఈయన విద్యాభ్యాసం రాజమండ్రి గౌతమీ విద్యాపీఠంలో జరిగింది. చిన్న వయస్సులోనే తండ్రిని కోల్పోడంతో కుటుంబ భారం ఆయనపై పడింది. దాంతో రాష్ట్రవ్యాప్తంగా ఆధ్యాత్మిక ప్రవచనాలు చేస్తుండే తన తాతగారు అయిన పెదజీయర్ స్వామి వద్ద సహాయకునిగా చేరారు. ఆయనకు ఆధ్యాత్మికత పుష్కలంగా ఉండడంతో పెదజీయర్ స్వామి వెంట పర్యటించే అవకాశం కలిగింది. 1975లో హైదరాబాద్‌లో నిర్వహించిన స్వాదాయన జ్ఞానయజ్ఞం ద్వారా చిన జీయర్ స్వామి ఆధ్యాత్మిక విషయాలలో మెళకువలు నేర్చుకున్నారు. 1979లో పెదజీయర్ స్వామి పరమపదించడంతో గురుదేవుల ఆశీర్వాదం మేరకు 22 సంవత్సరాల వయసుకే చినజీయర్ ఆ బాధ్యతలను స్వీకరించారు. వికాసతరంగణి ద్వారా ఎన్నో సేవాకార్యక్రమాలను నిర్వహిస్తూ ఆదివాసులు ఉండే ప్రాంతాల్లో ఆశ్రమ పాఠశాలలు ఏర్పాటు చేసి ఆదర్శప్రాయులయ్యారు.





# ఉప్పాడ

ఉప్పాడ-కొత్తపల్లి చేనేత జాంధానీ చీరల్లో ఎంతో ప్రాచీన హస్తకళా నైపుణ్యం కనబడుతుంది. మగ్గం సాయంతో తయారు చేసే ఈ వెండి, బంగారు జాంధానీ చీరలకు ప్రత్యేకమైన గుర్తింపు ఉంది. కార్మికుల కళాత్మక దృష్టికి అద్దంపట్టే జాంధానీ చీరలను అప్పటి పిఠాపురం, బొబ్బిలి, వెంకటగిరి, నూజివీడు, గురజ మహారాజుల భార్యలకు వారు కోరిన విధంగా తయారుచేసేవారు.

పడుగు, పేకల కలయికలో అచ్చుగుద్దినట్లు రెండువైపులా ఒకే విధంగా కనిపించే డిజైన్ ఉండే విధానాన్ని జాంధాని అంటారు. ఈ చీరల నేతలో అడ్డు, నిలువు పట్టు దారాలను, డిజైన్లకు స్వచ్ఛమైన జరీని ఉపయోగించి ఎటువంటి యంత్రాల సహాయం లేకుండా కేవలం మగ్గాలపై చేతి ద్వారా అరుదైన డిజైన్లను సృష్టించడం జాంధాని విశిష్టత. ముందు గ్రాఫ్‌కాగితం మీద డిజైన్లు వేసి ఎన్ని చుక్కలు, అంచులు వస్తాయో కొనుగోలుదారులకు వివరిస్తారు. వారి ఇష్టప్రకారం బంగారం, వెండి తీగలు, జరీని వాడుతూ చీర తయారు చేస్తారు. జాంధానీ చీరలకు సమతూకంలో చెరోవైపు నుంచి నాడిని విసురుకుంటూ... తదనుగుణంగా బుటాలు (డిజైన్లు) అమర్చుకోవాలి. చీర ఉల్లిపొరలా అత్యంత తేలికగా ఉంటుంది. ఇక్కడి జాంధానీ చీరలకు దేశ, విదేశాల్లో ఎంతో డిమాండ్ ఉంది. సినీనటుల నుంచి పలువురు ప్రముఖులు ఈ జాంధానీ చీరల కొనుగోలుపై ఆసక్తి చూపుతున్నారు.



జాంధాని చీరల తయారీలో కూడా అతివలదే ముఖ్యపాత్ర అంటే అతిశయోక్తి కాదు. దేశ విదేశాలలో ఖ్యాతినార్జించిన జాంధాని చీరల తయారీలో కొత్తపల్లి మండలం మహిళలు తమ కళానైపుణ్యం ప్రదర్శిస్తున్నారు. ఉప్పాడ, కొత్తపల్లి, మూలపేట, అమీనాబాద, వాకతిప్ప, కుతుకుడిమిల్లి తదితర గ్రామాల్లో నేత కార్మికులు అధికంగా ఉన్నారు. జాంధాని చీరల తయారీలో ఆద్యంతం అతివల చేయిపడందే పనిపూర్తికాదు. మహిళల కళానైపుణ్యం జాంధాని చీరల్లో కళ్లకు కట్టినట్టు కన్పిస్తుంది. 5 సంవత్సరాల బాలికల నుంచి 60 సంవత్సరాల వృద్ధుల వరకు చీరల తయారీలో నిమగ్నమై ఎంతో శ్రమిస్తారు. చీరల తయారీలో కళాత్మకత ఎంతో అవసరం. పడుగు తయారీ నుంచి చీర నేసే వరకు మహిళలు అన్ని విషయాల్లోనూ భాగస్వాములే.



జాంధాని చీరల్లో అతిముఖ్యమైనది డిజైన్ తయారు చేయడం. దీనిని చుక్కలు తీయడం అంటారు. ఈ ప్రక్రియకు ఒక్కొక్క మగ్గానికి ఇద్దరి నుంచి ముగ్గురు మహిళలు అవసరమవుతారు. మగ్గానికి ఇరువైపులా ఇద్దరు కూర్చుని సంబంధిత డిజైన్‌లకు అనువుగా ఆకారం వచ్చేవిధంగా జరీ పోగులతో ఉన్న బెండ్లను చుక్కలు తీస్తారు. ఒక్కొక్క చీర తయారీలో ఒక్కొక్క వరుసకు 50 నుంచి 150 బెండ్లువరకు ఉపయోగించి చుక్కలు తీస్తారు. ఈ చుక్కలు తీసేటప్పుడు పోగులు తెగిపోకుండా జాగ్రత్త వహించడంతోపాటు డిజైన్ దెబ్బతినకుండా చూసుకుంటూ ఉండాలి. మగ్గంపై నాలుగు చీరలు సరిపడే పొడవు (ఒక పడుగు) తయారయ్యాక మరో పడుగు వేయడానికి రెండింటినీ కలపడాన్ని అచ్చు అతకడం అంటారు. ఒక్కొక్క అచ్చు అతకడానికి ఇద్దరు మహిళలు ఒక రోజంతా పనిచేయాల్సి ఉంటుంది. అచ్చు అతికి అల్లు పట్టి బొండచుట్టి మగ్గంపై నేస్తారు. ఒక పట్టుపిడి (దారపు ఉండ) విడిగా విడదీసి దానిని కండెలుగా చుడతారు. దీని కోసం రాట్నం ఉపయోగిస్తారు. ప్రత్యేకంగా తయారు చేసిన మూడు కర్రకుందులకు నూలును తగిలించి రాట్నంతో వడికి వాటిని కండెలుగా చుట్టి మగ్గంపై చీరలు నేయడానికి ఉపయోగిస్తారు. జాంధానీ చీర తయారీకి జరీ బల్లను తీసుకుని రెండుబల్లలు కలిపి ఒక పడుగుగా (నాలుగు చీరలకు సరిపడా) జరీ అంచును తయారు చేస్తారు. డిజైన్‌లు చీర విలువను బట్టి చీరల అంచులకు జరీని సిద్ధం చేస్తారు. బండిచక్రం ఆకారంలో ఉండే ఆసుకు ఈ జరీని చుడతారు. జాంధానీ చీరల తయారీలో అచ్చు అతకడం, ఆసుతోడడం, నూలువడకడం, చుక్కలుతీయడం వంటి అన్ని పనుల్లో ఎంతో కళానైపుణ్యం కనిపిస్తుంది.

# తూర్పు శివకాశీలు

దీపావళి బాణాసంచా పేరు చెప్పగానే వెంటనే తమిళనాడులోని శివకాశి గుర్తుకు రావడం సహజం. అయితే తూర్పుగోదావరి జిల్లా కూడా దానికి తీసిపోని రీతిలో శతాబ్దాలుగా బాణాసంచా తయారు చేస్తోంది. జిల్లాలోని వేట్లపాలెం, జువ్విపాడు, కొమరిపాలెం, ద్రాక్షారామం కేంద్రాలుగా బాణాసంచా తయారీ జరుగుతోంది. ఇక్కడి నుంచి దేశంలోని పలు ప్రాంతాలకు బాణాసంచా ఎగుమతి జరుగుతుంది. బాణాసంచా తయారీలో జిల్లాలోని వేట్లపాలెం దేశంలో మంచి ఖ్యాతి గడించింది. ఇక్కడ సుమారు 70 సంవత్సరాలకు పైగా బాణాసంచా తయారు చేస్తున్నారు. జిల్లాలోని వివిధ ప్రాంతాలకే కాకుండా రాష్ట్రంలోని అనేక ప్రధాన నగరాలకు, పట్టణాలకు బాణాసంచా ఇక్కడి నుండే సరఫరా అవుతుంది. రాష్ట్ర రాజధానిలోని ప్రముఖుల ఇళ్ళలోని శుభకార్యాలకు, వివాహాలకు సైతం బాణాసంచా ఇక్కడి నుండే వెళుతుంది. అంతేకాకుండా రాష్ట్రంలోని అనేక పట్టణాలలోని తిరునాళ్ళు, జాతరలకు సైతం బాణాసంచా ఇక్కడి నుండే వెళుతుంది. ఇదీ తూర్పు శివకాశీల ప్రత్యేకత.



# పాతకొట్టాం

బొమ్మలంటేముచ్చటపడని వారుండరు. చిన్నారుల నుంచి పెద్దల వరకూ బొమ్మలంటే అందరికీ ఇష్టమే. ఇటువంటి బొమ్మల పేర్లు చెప్పగానే గుర్తుకొచ్చేవి కొండపల్లి, ఏటికొప్పాక. అయితే ఇంతటి ఖ్యాతి ఉన్న ఊరు తూర్పుగోదావరి జిల్లాలో కూడా ఒకటి ఉందంటే ఆశ్చర్యమే... కోటనందూరు మండలంలో ఓ మారు మూల గ్రామమే 'పాతకొట్టాం'. దశాబ్దాల కాలం నుండి ఈ గ్రామంలోని వారు బొమ్మల తయారీయే ఆధారంగా జీవిస్తున్నారు. ఇక్కడ తయారు చేసిన కొయ్య బొమ్మలకు సరైన మార్కెట్ సదుపాయం లేక ఏటికొప్పాక నుంచి వచ్చే వ్యాపారులకు వీటిని విక్రయిస్తారు ఇక్కడి తయారీదారులు. దీంతో పాతకొట్టాం కళాకారులు జీవం పోసిన బొమ్మలు కూడా ఏటికొప్పాక బొమ్మలుగానే పేరు పొందుతున్నాయి. దేశంలో ఎక్కడ హస్తకళాప్రదర్శనలు జరిగినా పాతకొట్టాం కళాకారులు పాల్గొంటారు. అంతే కాకుండా ఆయా ప్రాంతాల్లో ఏర్పాటు చేసే హస్తకళా ప్రదర్శనల్లో బెస్ట్‌స్టాల్స్ సర్టిఫికెట్లు కూడా పొందిన దాఖలాలు కోకొల్లలు.







ఆత్రేయపురం
వాడపల్లి
గుమ్మిలేరు
రామచంద్రపురం
చింతలూరు
ద్రాక్షారామం
ర్యాలి
రావులపాలెం
మందపల్లి
ధనమ్మమర్రి
యానాం
కోటిపల్లి
పలివెల
వానపల్లి
మురమళ్ళ
అయినవిల్లి
ముక్తేశ్వరం
ముమ్మిడివరం
కొత్తలంక
అమలాపురం
అప్పనపల్లి
సోంపల్లి
అల్లవరం
ఓడలరేవు
అంతర్వేది

N

అమలాపురం నుండి వివిధ ప్రధాన నగరాలకు గల దూరం

న్యూఢిల్లీ............1958 కి.మీ.
ముంబయి..........1170 కి.మీ.
కోల్‌కత్తా..........1086 కి.మీ.
చెన్నై..................644 కి.మీ.
హైదరాబాద్.......455 కి.మీ.
విజయవాడ..........183 కి.మీ.
విశాఖపట్టణం.......218 కి.మీ.

# అమలాపురం
## డివిజన్





### అమలాపురం డివిజన్‌లోని దర్శనీయ ప్రదేశాలు

| | |
|---|---|
| అయినవిల్లి | సోంపల్లి |
| ముక్తేశ్వరం | అప్పనపల్లి |
| మురమళ్ళ | పలివెల |
| ముమ్మిడివరం | వానపల్లి |
| కొత్తలంక | ధనమ్మమర్రి |
| ఓడలరేవు | మందపల్లి |
| అంతర్వేది | ర్యాలి |
| బెండి | వాడపల్లి |




# కోనసీమ







ఒకవైపు సముద్రం... మూడు వైపులా గోదావది నదీపాయలు.. గలగల పారే సెలయేర్లు... ఎటు చూసినా ఆకుపచ్చ తివాచీలు పరిచినట్టుండే వరిచేలు... నీలి నిగారింపుతో విశాలసముద్రతీరం... గలగల పారే గోదారి తరగలు... వెన్నెల్లో మెరిసే ఇసుక తిన్నెలు... వాటి మధ్య సుతారంగా సాగే తెరచాప పడవలు... వంపు సొంపుల కాల్వలు... వాటిని వెంబడిస్తున్నట్టు నల్లటి తారురోడ్లు... బాటలకిరువైపులా ఠీవిగా నిలిచి తలలూపుతూ సాదరంగా ఆహ్వానించే కొబ్బరిచెట్లు.. అడుగడుగునా చరిత్ర ప్రసిద్ధి గాంచిన ప్రాచీన దేవాలయాలు... ప్రకృతి రమణీయకతతో కోనసీమ అందాలను ద్విగుణీకృతం చేసే విశేషాలు ఎన్నో! ఉపాధికోసం ప్రాణాలకు తెగించి వేటసాగించే మత్స్యకారుల జీవనచిత్రం... ఆంధ్రప్రదేశ్‌ను అన్నపూర్ణగా మార్చిన అన్నదాతల ఆహార్యం, వ్యవసాయ కూలీల జాన'పదం', షడ్రుచులతో కొలువుదీరిన ఆతిధ్యంతో కోనసీమ పర్యాటకుల మదిలో కలకాలం మధురస్మృతిగా నిలిచిపోతుంది. ప్రకృతి అందాలకు నెలవైన ఈ సీమ, భూతలస్వర్గం.



# అయినవిల్లి

ఏ కార్యం తలపెట్టినా ముందుగా ఈ వినాయకుని పూజిస్తే ఆ కార్యం నిర్విఘ్నంగా నెరవేరుతుందని భక్తుల విశ్వాసం. విఘ్నాలు తొలగించే స్వామిగా అయినవిల్లి వినాయకుడు ప్రసిద్ధి చెందాడు.కోనసీమలో పచ్చని కొబ్బరి చెట్ల సోయగాలతో అలరారే అయినవిల్లిలో నెలకొని ఉన్న శ్రీ సిద్ధివినాయక ఆలయం ఎంతో చారిత్రక ఖ్యాతి చెందినది.

దక్ష ప్రజాపతి యజ్ఞం నిర్వర్తించే ముందు విఘ్ననాయకుడైన ఈ వినాయకుని పూజించి పునీతుడైనట్లు క్షేత్ర పురాణం తెలుపుతోంది. వ్యాస మహర్షి దక్షిణ యాత్ర ప్రారంభంలో పార్వతీ తనయుణ్ణి ఇక్కడ ప్రతిష్ఠించేడని మరో కథ వ్యాప్తిలో ఉంది. అతి పురాతనమైన ఈ 'సిద్ధి' ప్రియుడు కోరిన కొర్కెలన్నీ తీర్చే సిద్ధివినాయకునిగా పేరు గాంచాడు.

గౌతమీ గోదావరి నది ఒడ్డున సువిశాలమైన ఆవరణలో ఎత్తైన ప్రాకారంతో విరాజిల్లుతోన్న ఈ దేవాలయంలో క్షేత్రస్వామి శ్రీ విఘ్నేశ్వరుడు దక్షిణాభిముఖుడైయున్నాడు. రెండు గోపురాలు, రెండు సింహద్వారాలతో అలరారే ఈ దేవాలయంలో దక్షిణ సింహద్వారము గుండా శ్రీ విఘ్నేశ్వరుని, తూర్పు సింహద్వారం గుండా క్షేత్ర ప్రభువును దర్శించవచ్చు. ఇదే ప్రాంగణంలో శ్రీదేవీభూదేవీ సమేత శ్రీ కేశవస్వామిని ప్రతిష్ఠించుట శివకేశవ తారతమ్యాలు లేవని చాటి చెబుతున్నది. విఘ్నేశ్వరాలయం ప్రక్కనే అన్నపూర్ణాదేవి ప్రతిష్ఠించ బడింది. క్షేత్రపాలకుడగు శ్రీ కాలభైరవస్వామిని కూడా ఈ ప్రాంగణంలో ప్రతిష్ఠించారు. వీరిలో గణానికి గణపతి, శైవానికి శివుడు, శాక్తేయానికి శక్తి, వైష్ణవానికి విష్ణువు, క్షేత్రపాలకుడుగా కాలభైరవుడు దర్శనమిస్తారు. ఈ క్షేత్రమున స్వామి స్వయంభూలింగం అగుట వలన నిత్యం శక్తి ప్రస్ఫుటమవుతుంది. ఈ స్వామి అభిషేక ప్రియుడు. ఈ క్షేత్రం పంచాయతన క్షేత్రం. అతి పురాతనమైన ఈ దేవాలయాన్ని తొలుత దేవతలు నిర్మించారని పెద్దల మాట. కాలక్రమేణా ఆలయ పునర్నిర్మాణాలు, అభివృద్ధి పెద్దాపురం సంస్థానాధీశులు నిర్వహించేవారు. ప్రస్తుతం ఈ ఆలయం దేవాదాయశాఖ అధీనంలో ఉంది.

ప్రతినిత్యం శైవాగమ ప్రకారం సహస్రాధికములుగా నారికేళ ఫలోదకములతో అభిషేకాలు జరుపుట ఇక్కడ ప్రత్యేక విశేషము. భక్తుల కోర్కెలు శీఘ్రంగా నెరవేర్చుటలో స్వామి కృప అపారము. ఈ ఆలయంలో ఏకాదశ రుద్రాభిషేకము, మహాన్యాస అభిషేకము, లఘున్యాస అభిషేకము, అష్టోత్తర పూజ, హారతి, అన్నప్రాశన, అక్షరాభ్యాసము, కేశఖండన జరుగుతాయి. ప్రతి మాసం ఉభయ చవితి, దశమి, ఏకాదశి తిథులలోను, వినాయకచవితి మరియు గణపతి నవరాత్రులు, కార్తీకమాసం, మహాశివరాత్రి పర్వదినాలలో ప్రత్యేక పూజలు నిర్వహిస్తారు. సంక్రాంతి రోజు ప్రభల ఉత్సవం ఇక్కడ ప్రత్యేకం.

**దర్శన సమయం:** ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు, సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు,

**ఫోన్:** 08856-225812, 9440116663. ***Website:*** *www.ainavillivighneswara.com*



**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 70 కి.మీ. |
| రాజమండ్రి | 56 కి.మీ. |
| కాకినాడ | 45 కి.మీ. |
| అమలాపురం | 12 కి.మీ. |
| రావులపాలెం | 25 కి.మీ. |
| తుని | 112 కి.మీ. |







# ముక్తేశ్వరం

అయినవిల్లి మండలంలో గౌతమీ గోదావరి ఒడ్డున సాక్షాత్తూ శ్రీరామునిచే ప్రతిష్ఠ జరిగినట్టు శ్రీ ముక్తికాంతాక్షణముక్తేశ్వర ఆలయానికి లోకప్రసిద్ధి. పక్కనే శ్రీదేవి, భూదేవి సమేత కేశవస్వామి ఆలయం కూడా ఉంది. పూర్వం జయద్రధుని భార్య, తన భర్తచే శాపగ్రస్తురాలై, తన మామగారిని వేడుకొనగా గౌతమీ నదిలో స్నానము చేసి, ఆ తీరంలో జ్యోతిర్లింగమును ప్రతిష్ఠించి తపస్సు చేయమని, త్రేతాయుగమున శ్రీరాముడు, సీతాలక్ష్మణులతో వచ్చి నీకు దర్శనమిచ్చినప్పుడు నీవు ముక్తురాలువగుదువని చెప్పాడు. అది మొదలు ఆమె జ్యోతిర్లింగ సన్నిధిలో నిరాహారియై తపస్సు ప్రారంభించింది. కోటిపల్లిలో శివలింగం ప్రతిష్ఠించిన శ్రీరాముడు పుష్పకవిమానమున ఆ దారిలో ప్రయాణిస్తూండగా, ఈ ప్రదేశంలో విమానం కదలక, కిందకు దిగి వనములందు వెదుకగా, జ్యోతిర్లింగ సన్నిధిలో తపమాచరించుచున్న జయద్రధుని భార్య కనబడింది. అప్పుడు శ్రీరాముడు అమ్మా నీవెవ్వరవు అని అడుగగా, రామ వాక్యమును విన్న ఆమె రామునికి నమస్కరించి తన శాపవృత్తాంతమును తెలిపినది. అప్పుడు శ్రీరాముడు కూడా ఆ జ్యోతిర్లింగమును స్తోత్రము చేయగా ఆ లింగము నుండి శంకరుడు ఉద్భవించి, శ్రీరాముని ఆలింగనము చేసుకొని 'ఓ రామా! నీవు వచ్చెదవని చాలా కాలము నుండి ఈ లింగమందు నిరీక్షిస్తున్నానని' తెలియజేశాడు. అప్పుడు శ్రీరాముని కోరిక మేరకు శంకరుడు ఆ స్త్రీకి ముక్తిని ప్రసాదించగా ఆమె ఆ జ్యోతిర్లింగములో ప్రవేశించి అదృశ్యమైనది. అప్పుడు శంకరుడు ఈ లింగమును చూసిన వారికి క్షణమాత్రముననే ముక్తి కలుగునని వరం ప్రసాదించాడు. అందువల్లనే ఈ క్షేత్రం ముక్తికాంతాక్షణముక్తేశ్వరుడుగా సార్ధకమైనది. ఈ క్షేత్రం అయినవిల్లికి కేవలం 2 కి.మీ. దూరంలో ఉంది.

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 72 కి.మీ. |
| రాజమండ్రి | 57 కి.మీ. |
| కాకినాడ | 44 కి.మీ. |
| అమలాపురం | 10 కి.మీ. |
| రావులపాలెం | 26 కి.మీ. |
| తుని | 111 కి.మీ. |

**దర్శన సమయం:** ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు, సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు,
**ఫోన్:** 08856-225812









# మురమళ్ళ





మురమళ్ళ భద్రకాళీ సమేత వీరేశ్వరస్వామి ఆలయం వందలాది సంవత్సరాల చరిత్ర కలిగి ఉంది. దేశంలో గల సుప్రసిద్ధ శైవ క్షేత్రాల్లో ఈ ఆలయం ఒకటి. మురమళ్ళ ప్రాంతం పూర్వం మునిమండలిగా పేర్కొనబడి, రానురానూ మురమళ్ళగా ప్రసిద్ధి గాంచింది. దక్షయజ్ఞాన్ని విధ్వంసం చేసిన వీరభద్రుడు అతిఉగ్రస్వరూపుడై దక్షుడిని సంహరించాక, మహావిష్ణువు కోరిక మేరకు అతనికి గొర్రె తలను అమర్చి యజ్ఞం పూర్తి చేయిస్తాడు. వీరభద్రుని శాంతింపజేయుటకు, ఆదిపరాశక్తి షోడశకళలలో ఒక కళ భద్రకాళీ రూపాన లావణ్య రూప కన్యగా సాక్షాత్కరిస్తుంది. ఆమెను చూసిన వీరభద్రుడు శాంతిస్తాడు. దీనితో మునులు వీరభద్రునికి, భద్రకాళికి గాంధర్వరీతిన వివాహం చేస్తారు. ఈ ఆలయానికి లక్ష్మీనరసింహస్వామి క్షేత్రపాలకునిగా ఉన్నాడు.

గౌతమీ నదికి వరదలు వచ్చిన సమయంలో స్వామి ఆలయం నదిలో పడిపోవడంతో శైవభక్తుడు వేలవలి శరభరాజుకి కలలో స్వామి కనిపించి మునిమండలి ప్రాంతంలో గోదావరిలో మునిగి ఉన్న తనను వెలికి తీసి, ఆలయం పునఃనిర్మించాలని ఆదేశించినట్టు తెలుస్తోంది. శివలింగాన్ని గడ్డపారలతో పైకి లేవదీసేందుకు ప్రయత్నించగా దెబ్బ తగిలి శివలింగం నుండి నెత్తురు రావడంతో, భయభ్రాంతులైన భక్తులు స్వామిని ధ్యానించుకోగా శివలింగం నుండి మాటలు వినిపించాయని, తన శివలింగాన్ని ఐ.పోలవరం సమీపంలో ఉన్న బాణేశ్వరాలయానికి తీసుకు వెళ్ళాలని, ఈలోగా తనకు అనుకూలంగా ఉన్న చోట ఆగిపోతానని చెప్పారని చరిత్రను బట్టి తెలుస్తోంది. భక్తులు జయ జయ శివనామ స్మరణ ధ్వనులతో శివలింగాన్ని తీసుకొస్తుండగా మురమళ్ళ గ్రామంలో ఒక పవిత్ర స్థలం వద్ద శివలింగం భారీగా పెరగడంతో స్వామి ఆజ్ఞగా భావించిన భక్తులు శివలింగం అక్కడే దించివేసి ఆ ప్రాంతంలోనే ఆలయం నిర్మించినట్టు తెలుస్తోంది. ఆ స్థలమే నేటి మురమళ్ళ వీరేశ్వరస్వామి పుణ్యక్షేత్రంగా భాసిల్లుతోంది. ప్రతి ఏటా మహాశివరాత్రిని ఇక్కడ అత్యంత వైభవంగా నిర్వహిస్తారు. మురమళ్ళ శ్రీభద్రకాళీ సమేత వీరేశ్వరస్వామి వారికి అవివాహితులు కళ్యాణం చేయిస్తే వెంటనే పెళ్ళి అవుతుందని భక్తుల ప్రగాఢ విశ్వాసం.

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 90 కి.మీ. |
| రాజమండ్రి | 75 కి.మీ. |
| కాకినాడ | 36 కి.మీ. |
| అమలాపురం | 22 కి.మీ. |
| రావులపాలెం | 45 కి.మీ. |
| తుని | 104 కి.మీ. |

**దర్శన సమయం:**
ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు,
సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు,
**ఫోన్:** 08856-278136, 9848332933.
***Website:*** ***www.sriveereswaraswamytemple.com***





# ముమ్మిడివరం



ముమ్మిడివరం తపోభూమి. వేదపండితులు, మునీశ్వరులు జన్మించడంతో ఈ ప్రాంతానికి ప్రత్యేకత ఏర్పడింది. శివరాత్రి వచ్చిందంటే ముమ్మిడివరంలో సందడే సందడి. శివరాత్రి మరునాడు జరిగే శ్రీ బాలయోగీశ్వరుల తీర్థానికి దేశం నలుమూలల నుంచి భక్తులు తరలివస్తారు. ముమ్మిడివరంలోని బాలయోగీశ్వరులు కఠోరతపస్సు చేశారు. ముమ్మిడి వరంలోని ఒక దళితవాడలో వ్యవసాయం చేసుకుని జీవించే కటికదల గంగయ్య, రామమ్మ దంపతులకు 1930 అక్టోబరు 23న ఒక బాలుడు జన్మించాడు. అతనికి సుబ్బారావు అని నామకరణం చేశారు. తల్లి మరణించడంతో మేనత్త సుబ్బాయమ్మ ఆ బాలుడిని పెంచింది. అతడే పెద్ద బాలయోగి. 1941 నవంబరు, 3న గంగయ్య మూడవ భార్యకు ఒక బాలుడు జన్మించాడు. అతనికి భూషణం అని పేరు పెట్టారు. అతడే చిన బాలయోగి, సుబ్బారావు పదవ ఏట వరకు ఆట పాటలతో గడిపి ఆ తర్వాత పశువుల కాపరిగా పనిచేశాడు. ముమ్మిడివరంలో జరిగే లంకతల్లమ్మ తీర్థంలో కృష్ణుడు, నారదుడు ఉన్న చిత్రపటాన్ని కొని రోజూ పూజలు చేసేవాడు. విళ్ళ గోవిందరావుకు చెందిన కొబ్బరితోటలో కృష్ణనామం స్మరిస్తూ 1946 జూన్ 22న తపస్సు ప్రారంభించారు. అనంతరం నాలుగు సంవత్సరాలకు అంటే 1950 మార్చి 26న చినబాలయోగి కూడా తపస్సు ప్రారంభించారు. వీరిని దర్శించేందుకు అధిక సంఖ్యలో భక్తులు వస్తుండే వారు. దీనితో బాలయోగి తపస్సుకు అవరోధం ఏర్పడటంతో, రిటైర్డ్ ఎక్సైజ్ ఇన్‌స్పెక్టర్ వ్యాసం సత్తిరాజుతో బాలయోగి మాట్లాడి తన మందిరానికి తాళం వేయమని కోరినట్టు స్థానికులు చెబుతారు. జన్మ పరంపరలో తన జన్మ చిట్టచివరిదని, తన తపస్సుకు భంగం కలిగించవద్దని ఆయన కోరినట్టు వారు చెబుతారు. 1985 జూలై, 19న పెదబాలయోగి, 1991 అక్టోబరు 28న చినబాలయోగి కైవల్యసిద్ధిని పొందారు. అక్కడ నిర్మించిన సమాధులను భక్తులు నేటికీ దర్శిస్తూనే ఉంటారు.



**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 83 కి.మీ. |
| రాజమండ్రి | 70 కి.మీ. |
| కాకినాడ | 45 కి.మీ. |
| అమలాపురం | 15 కి.మీ. |
| రావులపాలెం | 37 కి.మీ. |
| తుని | 112 కి.మీ. |



ఆధ్యాత్మికం

# కొత్తలంక

మతసామరస్యానికి నిలయంగా పేరు గాంచిన కలియుగ దైవం కొత్తలంక వలీబాబా దర్గా నిత్యకళ్యాణం పచ్చతోరణంలా భక్తులతో కళకళలాడుతోంది. కులమతాల తారతమ్యంతో కత్తులు దూసుకునే వారు సైతం ఈ ప్రాంతంలో సోదరభావంతో మెలగడం ఈ దర్గా విశిష్టత. కుల, మతాలకు అతీతంగా అందరూ కలిసి బాబాను దర్శించుకోవడం బాబా దర్గాకు ఉన్న ప్రత్యేకత. బాబా దర్గాని దర్శించి సమాధి వద్ద భక్తితో కోరుకుంటే అవి వెంటనే తీరుతాయని భక్తుల విశ్వాసం.

దిగంబర రూపంలో ఉండే బాబా అసలు పేరు హజరత్ సయ్యద్ అహ్మదలీషాఖాదర్ వలీ బాబా. ఈయన ఎక్కడ, ఎప్పుడు పుట్టారో స్పష్టంగా తెలియకపోయినా 175 ఏళ్ళు జీవించి సజీవ సమాధి పొంది భగవంతునిగా పూజలందుకుంటున్నారు. ముమ్మిడివరం మండల కేంద్రానికి 3 కి॥మీ॥ల దూరంలో ఉన్న వలీబాబా సజీవ సమాధి గురించి దర్గా నిర్వాహకులు చెప్పిన వివరాల ప్రకారం కొత్తలంక బాబాగా పేరొందిన ఈయనది నల్గొండ జిల్లా బొల్లేపల్లి. బాబా ఒకరోజు దిగంబరంగా కుండలేశ్వరం సమీపంలో గౌతమీ గోదావరి చెంతన తిరుగుతూ కొత్తలంకకు చెందిన గేదెల వెంకటరత్నం, గోవిందరాజులు, గురవయ్యలకు కనిపించారు. బాబా దివ్య తేజస్సును చూసిన వీరు ఆయనను చేరదీసి పూజించడం ప్రారంభించారు. అయితే ఎప్పటినుండో సంతానం లేక కృంగిపోతున్న గోవిందరాజుల దంపతులకు బాబా రాకతో సంతానం కలగడంతో ఆయనపై మరింత భక్తి భావాన్ని పెంచుకున్నారు. బాబా మహిమలు ఒక్కొక్కటిగా బయటపడడంతో ముమ్మిడివరం పరిసర ప్రాంతంలో బాబా పేరు మార్మోగిపోయింది.

బాబా మహిమలు కళ్ళారా చూసేందుకు పరిసర ప్రాంతాల నుండి భక్తులు తరలివచ్చి దర్శించుకునేవారు. అయితే అందరికీ బాబా దర్శనం లభించేదికాదని, ఎవరైతే తనపై పూర్తి విశ్వాసంతో వస్తారో వారికి మాత్రమే కనిపించేవారని నిర్వాహకులు చెబుతున్నారు. నేటికీ బాబా మహిమలపై ఈ ప్రాంతవాసులకు అపార నమ్మకం. గోదావరి నదిలో అరిటాకుపై తేలియాడే వారని, ఒకే సమయంలో వేర్వేరు ప్రాంతాల్లో భక్తులకు కనిపించి ఆశ్చర్యానికి గురిచేసేవారని భక్తులు చెబుతున్నారు. బాబా మహిమలను స్వయంగా చూసిన వారు ఇప్పటికీ ఇక్కడ అనేక ప్రాంతాల్లో జీవించి ఉండటం విశేషం.

సుమారు 175 ఏళ్ళు జీవించిన బాబా 1948 జనవరి, 22న కొత్తలంక గ్రామంలో సజీవ సమాధిలోకి వెళ్ళిపోయారు. అప్పటి నుండి ప్రతియేటా బాబా ఉరుసు ఉత్సవాలను నిర్వహిస్తూండడం, ఈ ఉత్సవాలకు వేల సంఖ్యలో భక్తులు తరలిరావడం విశేషం.



**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 86 కి.మీ. |
| రాజమండ్రి | 73 కి.మీ. |
| కాకినాడ | 48 కి.మీ. |
| అమలాపురం | 18 కి.మీ. |
| రావులపాలెం | 40 కి.మీ. |
| తుని | 115 కి.మీ. |

విడిది

# ఓడలరేవు

సువిశాల తీరం... వైనతేయనదీ పాయ సాగర సంగమ ప్రాంతం... సుందర తీరం... చల్లదనం అందించే సరుగుడు తోటలు. ఇదే గ్రామం కేంద్రంగా సముద్రజలాల్లోకి వెళ్ళి చేపలవేట సాగించే బోట్ల రాకపోకలు అంతా పర్యాటకానికి అనువైనవే. ఇవన్నీ నిన్నమొన్నటి వరకు నిరుపయోగంగానే ఉండేవి. అయితే సముద్ర బీచ్ రిసార్ట్స్ రాకతో ఓడలరేవు సాగరతీరానికి పర్యాటక సొబగులు సమకూరాయి. ఈ రిసార్ట్స్ కోనసీమలో తొలి బీచ్‌రిసార్ట్స్‌గా పేరొందాయి. ఐదెకరాల సువిశాల స్థలంలో సూట్, లగ్జరీ గదులున్నాయి. పర్యాటకుల ఆర్డర్‌పై దేశీయ, విదేశీ వంటకాలు అందించేందుకు రెస్టారెంట్ ఉంది. 'విడిది' పేరుతో ప్రత్యేక భవనాలు కూడా ఏర్పాటు చేసారు.

అమలాపురం నుంచి సుమారు 18 కి॥మీ॥ దూరంలో ఉన్న ఓడలరేవు బీచ్ వరకు రహదారి సౌకర్యం ఉంది. ఆహారానికి, నాలుగు రోజులు ఉండటానికి ఇక్కడ సదుపాయాలు ఉన్నాయి. ఇక్కడ సాగర సంగమ ప్రాంతంలో కనిపించే అరుదైన పక్షులు వీక్షకులకు ఆనందాన్ని పంచుతాయి. సముద్రాన్ని వీక్షిస్తూ కుటుంబ సమేతంగా ఉల్లాసంగా గడిపేందుకు ఇక్కడ ప్రత్యేక ఏర్పాట్లు చేశారు.





**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 105 కి.మీ. |
| రాజమండ్రి | 90 కి.మీ. |
| కాకినాడ | 78 కి.మీ. |
| అమలాపురం | 21 కి.మీ. |
| రావులపాలెం | 56 కి.మీ. |
| తుని | 143 కి.మీ. |




# అంతర్వేది

వశిష్ఠ ప్రతిష్ఠగా వెలసిన లక్ష్మీనరసింహుడు కలియుగంలో కేశవదాసు అనే యాదవుడికి పుట్టలో దర్శనమివ్వగా అతడు కర్రలతో ఆలయాన్ని నిర్మించాడు. తర్వాతి కాలంలో దక్షిణ భారతదేశాన్ని పాలించిన పల్లవరాజులు క్రీ॥శ॥ 5వ శతాబ్దంలో ఆలయాన్ని నిర్మించినట్టు చరిత్ర చెబుతోంది. అయితే ఆ ఆలయం కాలగర్భంలో కలిసిపోవడంతో బెండమూర్లంక గ్రామస్థుడు, నౌకావ్యాపారి కొపనాతి ఆదినారాయణ రాతితో ఆలయాన్ని, మండపాలు, శిఖరాల నిర్మాణం చేపట్టారు. ఆయన తరువాత ఆయన కుమారుడు కొపనాతి కృష్ణమ్మ క్రీ॥శ॥ 1823లో (శాలివాహన శకం 1745) ఆలయ నిర్మాణాన్ని పూర్తి చేసినట్టు ఆలయం లోపల ఒక శిలాశాసనం ఉంది.

బ్రహ్మపురాణంలోని గౌతమీ మహత్యంలో అంతర్వేది లక్ష్మీనరసింహస్వామి దివ్య కథను చెప్పారు. హిరణ్యాక్షుని కుమారుడైన రక్తలోచనుడు ఈశ్వర వరం పొంది కంటకునిగా మారాడు. పవిత్రమైన అంతర్వేదిలో వశిష్ఠ మహర్షి ఆశ్రమం నిర్మించుకుని యజ్ఞయాగాదులు నిరాటంకంగా చేసేవారు. మహర్షి తన భార్య అరుంధతిని, తన నూరుగురు సంతానాన్ని విడిచి ఒకసారి సత్యలోకం వెళ్లాడు. ఆ సమయంలో శివుని వల్ల పొందిన వర గర్వంతో రక్తలోచనుడు తపస్సు చేసుకునే రుషులను హింసించ సాగాడు. వాడి దుర్మార్గాలను అడ్డుకునే ప్రయత్నం చేసిన ఆశ్రమవాసులను, ఆశ్రమాలను ధ్వంసం చేసాడు. వశిష్ఠుని నూరుగురు సంతానాన్ని సంహరించాడు.





అప్పుడు వశిష్ఠ మహర్షి రాక్షస సంహారం చేయాల్సిందిగా శ్రీహరిని ప్రార్థించగా, విష్ణుమూర్తి నరసింహుని రూపంలో వచ్చి రక్తలోచనునితో పోరు ప్రారంభించాడు. ఇద్దరి మధ్య భీకరపోరు సాగింది. శివుని వరప్రభావంతో రక్తలోచనుని రక్త బిందువులు కింద పడిన ప్రతిసారీ ఇసుక రేణువులన్నీ రాక్షసులుగా మారడం మొదలుపెట్టాయి. అప్పుడు నరసింహుడు తన సోదరి అశ్వరూఢాంబిక సహాయంతో రక్తలోచనుని సంహరించాడు. యుద్ధ సమయంలో అశ్వరూఢాంబిక రక్తలోచనుని రక్తబిందువులు నేలపై పడకుండా తన నాలుక చాపింది. రాక్షస సంహారానంతరం నాలుకపై ఉన్న రక్తాన్ని కింద విడిచి పెట్టింది. ఆలయం పక్కన నేటికీ రక్తతుల్య పేరుతో ఒక నదీపాయ ప్రవహిస్తుంది.

రక్తతుల్య నదిలో కూర్మరూపుడై స్వామి అవతరించాడు. నరసింహస్వామితో పాటు శ్రీకూర్మనారాయణునికి సైతం ఇక్కడ నిత్యాభిషేకాలు జరుగుతున్నాయి. స్వామి వారికి సుమారు రూ. 100 కోట్ల విలువైన నగలు, కిరీటాలు, పచ్చలు, కెంపులు పొదిగిన హారాలు, వజ్ర వైఢూర్యాలతో పొదిగిన బంగారు ఆభరణాలు ఉన్నాయి. ఆలయ ఆవరణలో గరుడాళ్వార్, ఆంజనేయ స్వామి వార్ల పురాతన విగ్రహాలు వెలుగు చూసాయి. ఇవి మూడున్నర శతాబ్దాల ఘనచరిత్ర ఉన్న విగ్రహాలుగా పురావస్తు శాస్త్రవేత్తలు గుర్తించారు. వీటిపై ఉన్న లిపి ఆధారంగా శాలివాహన శకం 1582 (క్రీ॥శ॥ 1660) నాటివిగా తేల్చారు. సుమారు 350 ఏళ్ళనాటి విగ్రహాలు భక్తుల సందర్శనార్థం ఆలయం లోపల ఉంచారు. అలాగే ఆలయ పరిసరా ల్లో భక్తులు, పర్యాటకులు వీక్షించేందుకు శ్రీనీలకంఠేశ్వరస్వామి ఆలయం, గుర్రాలక్క గుడి, రాఘవేంద్రస్వామి, ఆంజనేయస్వామి ఆలయాలు, వశిష్ఠ సేవాశ్రమంతో పాటు లైట్‌హౌస్, సాగరసంగమ (అన్నాచెల్లెలు గట్టు) ప్రాంతాలు ఉన్నాయి.

**దర్శన సమయం:**

**ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు,**
**సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు,**

**ఫోన్: 08862-59313, 9491000719, 9440219241.**
***Website:* www.antarvedisrilakshminarasimhaswamy.com**

### ఎంత దూరం...

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 110 కి.మీ. |
| రాజమండ్రి | 96 కి.మీ. |
| కాకినాడ | 105 కి.మీ. |
| అమలాపురం | 47 కి.మీ. |
| రావులపాలెం | 65 కి.మీ. |
| తుని | 170 కి.మీ. |















# దిండి

వశిష్ఠ గోదావరి నది ఒడ్డున మలికిపురం మండలం దిండిలో రాష్ట్రపర్యాటకశాఖ ఆధ్వర్యంలో "హరిత కోకోనట్ కంట్రీరిసార్ట్స్" కోనసీమ ప్రకృతి అందాల నడుమ పర్యాటకులకు సేవలందిస్తోంది. దిండి పర్యాటక కేంద్రం రాజమండ్రికి 80 కి॥మీ॥ దూరంలో ఉంది. ఇక్కడ 32 ఏసీ గదులు, పెద్ద కాన్ఫరెన్స్‌హాలు, ఈతకొలను, రెస్టారెంటు, వ్యాయామశాల అందుబాటులో ఉన్నాయి. ఇంకా వినోదానికి ఈతకొలను, వాటర్ స్పోర్ట్సులో వాటర్ వాకింగ్‌బాల్, ట్రాంపోలైన్, కమేండోనెట్, విలువిద్య, స్పోర్ట్సుసైకిల్ సౌకర్యాలున్నాయి. నదీ విహారంతో ఉత్సాహంగా గడిపేందుకు గృహపడవలు, వశిష్ఠబోటు, స్పీడుబోటు, కానోబోటు అందుబాటులో ఉన్నాయి. ఇక చుట్టుపక్కల ఉన్న అంతర్వేది శ్రీలక్ష్మీనరసింహస్వామి ఆలయం, అప్పనపల్లి శ్రీబాలబాలాజీ ఆలయాలను సైతం దర్శించుకోవచ్చు.

ఆంధ్రప్రదేశ్ టూరిజం కార్పొరేషన్ గోదావరి నదిలో తిప్పుతున్న హౌస్‌బోట్‌లు పర్యాటకులకు ఎంతో ఆహ్లాదాన్ని, ఆనందాన్ని కలిగిస్తున్నాయి. గోదావరిలో విహరిస్తుంటే చుట్టూ కనిపించే కొబ్బరి చెట్లు, పచ్చని ప్రకృతి, చిన్న చిన్న లంకలు, వాటిపై సన్నగా కప్పుకున్న పచ్చిక ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. పగలంతా సహజసిద్ధమైన అందాలను తనివితీరా చూసే టూరిస్టులు రాత్రి కదలకుండా నదిలో ఒకే చోట వుండిపోతారు కాబట్టి ఏసీ సదుపాయాన్ని టూరిజం కార్పొరేషన్ అందుబాటులో వుంచుతోంది.

**ఫోన్: 08862-227991, 227992, 9912877055.**









### ఎంత దూరం...

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 93 కి.మీ. |
| రాజమండ్రి | 78 కి.మీ. |
| కాకినాడ | 87 కి.మీ. |
| అమలాపురం | 30 కి.మీ. |
| రావులపాలెం | 49 కి.మీ. |
| తుని | 152 కి.మీ. |





# సోంపల్లి

దిండి రిసార్ట్స్‌కు వెళ్ళే దారిలో రాజోలు మండలం సోంపల్లిలో నదీతీరాన ఉన్న మరో ప్రైవేటు రిసార్ట్స్ అన్ని హంగులతో ఉంది. విశాలమైన ఏసీ రూమ్‌లతో పాటు ఆర్డర్‌పై వంటకాలు చేసి అందించే ఏర్పాట్లు, స్విమ్మింగ్‌పూల్, బోటు షికారులతోపాటు ఉల్లాసంగా గడిపేందుకు అనువైన వసతులన్నీ ఇక్కడున్నాయి.

**ఫోన్:** 040-69998111, 8008727111, 8008727222.







**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 82 కి.మీ. |
| రాజమండ్రి | 68 కి.మీ. |
| కాకినాడ | 77 కి.మీ. |
| అమలాపురం | 20 కి.మీ. |
| రావులపాలెం | 39 కి.మీ. |
| తుని | 142 కి.మీ. |



# అప్పనపల్లి

వైనతేయ నదీ తీరాన అప్పనపల్లి బాలబాలాజీ ఆలయం బాల తిరుపతిగా విరాజిల్లుతోంది. వైనతేయ నదిలో స్నానం చేసి బాలబాలాజీ స్వామిని దర్శిస్తే అంతా శుభం జరుగుతుందని భక్తుల అపార నమ్మకం. సుమారు 5 దశాబ్దాల చరిత్ర కలిగిన అప్పనపల్లి ఆలయ విశిష్టత రాష్ట్ర ఎల్లలు దాటి పొరుగు రాష్ట్రాలకూ విస్తరించింది. ఇక్కడ కొన్ని దశాబ్దాల క్రితం ప్రారంభించిన నిత్య అన్నదాన పథకం రాష్ట్ర దేవాదాయ, ధర్మాదాయ శాఖకే తలమానికంగా నిలిచిందని చెప్పడంలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు. అప్పనపల్లిలో నిత్యాన్నదానం విజయవంతమై ప్రస్తుతం రాష్ట్రవ్యాప్తంగా ప్రసిద్ధ ఆలయాల్లో అమలవుతున్న నిత్యఅన్నదాన పథకాలకు మూలంగా నిలిచింది.

అప్పనపల్లి ఆలయం ఇంతటి పురోభివృద్ధి సాధించడం వెనుక అదే గ్రామానికి చెందిన దివంగత మొల్లేటి రామస్వామి కృషి ఎంతో ఉంది. రామస్వామి ఆలయ నిర్మాణానికి బీజం నాటి, తన స్వశక్తితో పెంచి పెద్ద చేశారు. ఇంతింతై వటుడింతై అన్న చందంగా రామస్వామి హయాంలో అప్పనపల్లి ఖ్యాతి రాష్ట్రం నలుచెదురులా వ్యాపించడమే కాకుండా, పొరుగు రాష్ట్రాలైన తమిళనాడు, కేరళలకూ పాకింది. దీంతో నిత్యం వేలాది మంది భక్తులు అప్పనపల్లి తరలిరావడంతో ఆదాయం సమకూరేది. తన కొబ్బరి కొట్టులో తిరుమల తిరుపతి నుంచి తెచ్చిన బాలబాలాజీ స్వామి చిత్రపటం ఉంచి సుమారు దశాబ్దకాలం పూజలందించిన రామస్వామి 1970లో నూతన ఆలయ నిర్మాణానికి అంకురార్పణ చేశాడు. ఇప్పటికీ రామస్వామి నెలకొల్పిన చిత్రపటం కలిగిన ఒకప్పటి కొబ్బరికొట్టు పాత ఆలయంగా ప్రసిద్ధిలో ఉంది. దశాబ్దకాలం నాటికి నూతన ఆలయంతో పాటు నలువైపులా ప్రాకారం, సత్రం, నిత్య అన్నదానం చేసేందుకు ఒక అంతస్తుతో భవనాలను రామస్వామి పూర్తి చేయించారు. 1981లో దేవాదాయ, ధర్మాదాయ శాఖ ఆలయాన్ని స్వాధీనం చేసుకుంది. అటు తర్వాత కోర్టులో వ్యాజ్యాలు నడిచాయి. చివరకు 1990 ఏప్రిల్, 9న ఆలయాన్ని దేవాదాయ ధర్మాదాయ శాఖకు అప్పగిస్తూ హైకోర్టు తీర్పునిచ్చింది. రామస్వామి నిర్మించిన నూతన ఆలయంలో 1991 జూలై 4వ తేదీన విగ్రహ ప్రతిష్ఠ జరిగింది. తిరుమల తిరుపతి దేవస్థానం పంపించిన బాలబాలాజీ స్వామి మూలవిరాట్‌ను త్రిదండి చినజీయర్ స్వామి ప్రతిష్ఠించారు. ప్రధాన ఆలయానికి ఇరువైపులా ఉప ఆలయాలు నిర్మించి పద్మావతీ దేవి, ఆండాళ్ తాయార్‌లను ప్రతిష్ఠించారు. అప్పట్నుంచి ప్రతి ఏటా జ్యేష్ఠ శుద్ధ ఏకాదశి రోజు రాత్రి బాలబాలాజీ స్వామి కల్యాణం నిర్వహించడం సంప్రదాయంగా వస్తోంది.

తాను అభివృద్ధి చేసిన ఆలయాన్ని దేవాదాయ ధర్మాదాయశాఖ స్వాధీనం చేసుకోవడం జీర్ణించుకోలేని రామస్వామి రెండు దశాబ్దాలపాటు ఆలయానికి దూరంగా ఉండి, తన స్వగృహంలోని పాత ఆలయంలోనే పూజలు నిర్వహించేవారు. ఆ తరువాత ట్రస్టుబోర్డు ఛైర్మన్‌గా ఆయన ఆలయ ప్రవేశం చేసి తన సేవలందించారు. అప్పనపల్లి ఆలయంలో నిర్వహించే ఉచిత నిత్యఅన్నదానం అమోఘంగా ఉంటుంది. ఇక్కడ అన్నదానం అందించిన ఫలితమే రాష్ట్ర వ్యాప్త ఆలయాలకు ఆదర్శమవ్వడం విశేషం.

అప్పనపల్లి ఆలయంపై రూపుదిద్దుకున్న శిల్పకళను చూస్తే కళ్లు చెదిరిపోతాయి. ప్రధాన ఆలయ మండపంపై పుట్టలో ఉన్న విష్ణువుకి పాలధార కురిపిస్తున్న ఆవును, తదేకంగా చూసే యాదవుడి చిత్రాలు కన్నార్పకుండా చేస్తాయి. అంతేకాకుండా ఆలయ గోపురం మీద చుట్టూ అద్భుతమైన శిల్పకళ ఎంతగానో ఆకట్టుకుంటుంది. ఆలయం చుట్టూ నాలుగువైపులా చూడముచ్చటైన ప్రాకారాలు ఔరా అనిపిస్తాయి. ఒకసారి అప్పనపల్లి బాలబాలాజీని దర్శిస్తే మళ్లీ మళ్లీ చూడాలని మనసు ఉవ్విళ్లూరడం సహజం.

**దర్శన సమయం:** ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00, సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00
**ఫోన్:** 08862-239562, 9491000720. ***Website:*** www.appanapallibalabalaji.com



శ్రీ మొల్లేటి రామస్వామి

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 90 కి.మీ. |
| రాజమండ్రి | 74 కి.మీ. |
| కాకినాడ | 70 కి.మీ. |
| అమలాపురం | 13 కి.మీ. |
| రావులపాలెం | 44 కి.మీ. |
| తుని | 135 కి.మీ. |

# పలివెల



**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 58 కి.మీ. |
| రాజమండ్రి | 44 కి.మీ. |
| కాకినాడ | 70 కి.మీ. |
| అమలాపురం | 23 కి.మీ. |
| రావులపాలెం | 11 కి.మీ. |
| తుని | 136 కి.మీ. |

కొత్తపేటకు సమీపాన గల పలివెలలో ఉమాకొప్పేశ్వరస్వామి వారి ఆలయం ఉంది. పురాతన పుణ్యక్షేత్రంగా భాసిల్లుతున్న నేటి పలివెల ఒకనాటి పల్వలపురం. అగస్త్య మహాముని ఇక్కడ ఈశ్వరుని ప్రతిష్టించారని ఈ ప్రాంతవాసుల నమ్మకం. ఇక్కడ శివుని కొప్పులింగేశ్వరునిగా కొలుస్తారు. పూర్వం అగస్త్య మహాముని కౌశికానదీ తీరాన పల్వలపుర ప్రాంతంలో తపస్సు చేసుకొనుచుండగా హిమవత్ పర్వతమున లోక కల్యాణార్థమై పార్వతీ పరమేశ్వరుల కల్యాణం అతి వైభవంగా జరుగుతోంది. ఆ కల్యాణం చూసి తరించవలెనని అగస్త్యుడు సంకల్పించి, బయలుదేరాడు. వింధ్య పర్వతం తన విశ్వరూపంతో గ్రహభ్రమణానికి తీవ్ర విఘాతం కలిగిస్తుందని భావించిన ఇంద్రాది దేవతలు అగస్త్యుని ప్రయాణాన్ని విరమింపజేసేందుకు విశ్వబ్రహ్మను పంపారు. అగస్త్యుడు విశ్వబ్రహ్మ ద్వారా కల్యాణ మహోత్సవ వైభవాన్ని శ్రవణానందంగా విని, తన దివ్యదృష్టిచే కనులారా చూసి పార్వతీ పరమేశ్వరులను కళ్యాణ పసుపు వస్త్రాలతో దర్శనమీయవలసిందిగా ప్రార్థించాడు. అందుకు వారు అంగీకరించి దర్శనమిచ్చారు. కల్యాణపీఠంపై దివ్య మంగళ స్వరూపులుగా విరాజిల్లుతున్న పార్వతీ పరమేశ్వరులను ఏకపీఠంపై పల్వలపుర క్షేత్రాన లోక కళ్యాణార్థం ప్రతిష్టగావిస్తాడు. అగస్త్యునిచే లింగ ప్రతిష్ఠ గావించుట వల్ల ఈ క్షేత్రాన్ని అగస్త్యేశ్వర క్షేత్రం అని కూడా పిలిచెడివారు.

పల్వలపురంలో అగస్తేశ్వరుని వెలనాటి వంశానికి చెందిన ఒక విప్రుడు విశేషభక్తితో పూజించేవాడు. అయితే విప్రుడు వేశ్యాలోలుడు కావడం వల్ల ఆ చర్యలను పౌరులు సహించలేక రాజ్యపాలకునికి ఫిర్యాదు చేశారు. రాజు ఆకస్మికంగా పూజారిని పరీక్షించదలచి పల్వలపురానికి వస్తాడు. ఆ సమయంలో పూజారి వేశ్య వద్ద ఉంటాడు. మహారాజు రాక విని, రివాజు ప్రకారం ఇచ్చే నిర్మాల్యమాలికకై వెదుకులాడి, లేదని గ్రహించి, వేశ్య కొప్పులో అంతకు ముందే వుంచిన స్వామిపూలమాలను తీసి రహస్యంగా ఆలయంలోకి తీసుకువచ్చి, నిర్మాల్యమాలికగా రాజుకు ఇస్తాడు. మహారాజు ఆ నిర్మాల్య మాలిక యందు నిగనిగలాడుతున్న పొడవైన కేశంను చూసి శంకించి పూజారిని ప్రశ్నించగా అందుకు పూజారి పరమశివుడు 'జటాజూటధారి' అయినందున అగస్త్యేశ్వరుని కేశం చుట్టుకొని ఉండవచ్చని సమాధానమిచ్చాడు. లింగానికి జటాజూటమా? అని రాజు ఆశ్చర్యపడి చూపమనగా, పూజారి నిర్మల హృదయుడై ధైర్యం వహించి మహారాజా ఇది మధ్యాహ్న సమయం, స్వామి వారికి అభిషేకపూజా విధులు నిర్వర్తించి, మహా నివేదన మొనర్చి నాగాభరణాలు అలంకరించినందున, రేపటి ఉదయం ప్రాతఃకాలమున జటాజూటాన్ని చూపెదనని పూజారి తెలుపుతాడు. మహారాజు దానికి అంగీకరించి 'జటాజూటం చూపనిచో నీకు శిరచ్ఛేదం తప్పదు' అని పలికి ఆ రాత్రి పల్వలపురంలోనే విడిదిచేస్తాడు. దానితో పూజారి తనకు శిరచ్ఛేదం తప్పదని తలంచి అవసాన కాలంలో ఈశ్వర ధ్యానం చేసుకున్నచో మోక్షం లభిస్తుందని తలచి, ఆ రాత్రంతా స్వామి గర్భాలయం వద్దే ఉండి పరమశివుని పలు రీతులలో వేడుకొనుచూ స్వామీ! నేను నీ భక్త పరమాణువును, నా పూర్వజన్మఫలంచే నేను పాపాలు చేసియుంటిని. నా తప్పులను మన్నించి ఇప్పుడు మీరు కొప్పును ధరించవలెను. మీ కొప్పును మహారాజుకు చూపనిచో నాకు శిరచ్ఛేదం తప్పదు. మీరు కొప్పును ధరించనిచో నా శిరస్సును ఈ లింగానికి బాదుకొని ప్రాణం విడిచెదనని దీనంగా పలికి మూర్ఛిల్లుతాడు. అప్పుడు నీలకంఠుడు పూజారి మొర విని, లింగోద్భవ కాలాన కొప్పు ధరిస్తాడు. స్వామి కొప్పును ధరించుట పూజారి గాంచి ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అవుతాడు. మరునాడు మహారాజుకు కొప్పును చూపిస్తాడు. పరమేశ్వరుడు కొప్పును ధరించుట కేవలం పూజారి చేసిన కృత్రిమ చర్య అని ప్రజలు పలుకగా, మహారాజు శిరోజం పెకిలించి తీసుకురమ్మని ఆజ్ఞాపిస్తాడు.

పూజారి అట్లే చేస్తాడు. శిరోజం మొదట రక్తం కనిపించగా వెంటనే రాజుకు నేత్ర అవరోధం కలుగుతుంది. మహారాజు పరమేశ్వరునికి అపచారం జరిగిందని భావించి దోషాన్ని మన్నించి దృష్టిని ప్రసాదించాలని వేనోళ్ళ వేడుకొనగా, పరమేశ్వరుడు తిరిగి దృష్టిని ప్రసాదిస్తాడు. వెంటనే మహారాజు పరమేశ్వరుని శిరోజాల రక్షణార్థం ఆ గ్రామాన్ని స్వామికి సమర్పిస్తాడు. అదే నేడు జుత్తుగపాడు గ్రామం. ఈ గ్రామం రావులపాలెం మండలం పొడగట్లపల్లికి సమీపంలో ఉంది.

**దర్శన సమయం:**

**ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు, సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు**

**ఫోన్: 08855-243316.**

# వానపల్లి

రాష్ట్రంలో అశేష భక్తజనం సందర్శించే ఆరాధ్య దేవాలయాలలో కొత్తపేట మండలం వానపల్లిలో పళ్ళాలమ్మ ఆలయం ఒకటి. గ్రామ దేవతలలో పళ్ళాలమ్మ వారికి పురాతన ప్రాశస్త్యం ఉంది. భక్తుల పాలిట కల్పతరువు, కోరిన కోర్కెలు తీర్చే కొంగు బంగారంగా పళ్ళాలమ్మ అమ్మవారిని కోనసీమ ప్రాంతీయులే కాక ఉభయ గోదావరి జిల్లాల ప్రజలు కొలుస్తారు. వనాలు, వానరాలు ఉండే ఈ ప్రాంతాన్ని వానరపల్లిగా పేర్కొనేవారు. కాలక్రమేణా వానపల్లిగా మారింది.

వనవాసంలో సీతమ్మ గౌతమీ తీరంలోని వానరపల్లికి వచ్చింది. ఒకరోజు స్నానమాచరించి, ఆ వనంలో ప్రకృతిదేవిని పూజించగా, ప్రకృతి నుండి ఆవిర్భవించిన అమ్మవారు సీతాదేవికి దర్శనమిచ్చింది. పండ్లు పువ్వులు, వనాల సమూహమైన ఆ ప్రకృతిమాత కాలక్రమేణా పళ్ళాలమ్మగా పూజలందుకుంటోంది. సీతమ్మ నాటిన ఒక మొక్క మహావృక్షంగా ఇప్పటికీ ఉందని ఇక్కడి ప్రజల నమ్మకం. ఆ పేరు తెలియని వృక్షాన్ని దర్శించి పళ్ళాలమ్మ తల్లిని పూజిస్తే పుత్రులు లేని దంపతులకు వంశాభివృద్ధి గల పుత్రులు జన్మిస్తారని ఇక్కడి ప్రజల ప్రగాఢ విశ్వాసం. వృక్షమును దర్శించిన వారు సంతానం కలిగిన వెంటనే ఒక కొబ్బరి మొక్కను, చీరను మొక్కుబడిగా సమర్పిస్తారు.

ప్రతీ ఏడాది అమ్మవారి పీఠం కింద నుంచి పవిత్రమైన గౌతమీ నది జలం ఉద్భవిస్తుంది. గంగాదేవి స్వయంగా గర్భగుడిలో పీఠం కింద నుంచి పుట్టి కనీసం 10 నుండి 20 రోజుల వరకు అమ్మవారికి స్నానమాచరించడం గొప్ప విశేషంగా ఈ ప్రాంతవాసులు చెబుతారు. పరాయిదేవతగా అమ్మవారి ఆలయం దగ్గరలోనే పోలేరమ్మ విగ్రహం కూడా ఉంది. పోతురాజువారు క్షణముక్తేశ్వరున్ని దర్శనార్థమై వెళ్ళి తిరుగి వస్తున్న సమయంలో సూర్యోదయం కావడం వల్ల మార్గమధ్యలో శిలగా స్థిరపడిన ప్రాంతం ఊరు మధ్యలో ఉంది. ఈ ఆలయంలో ఈశాన్యదిశలో దక్షిణముఖం చూస్తూ గణపతి విగ్రహం ఉండడం విశేషం. అమ్మవారి శిల్పస్వరూపం కాలుమీద కాలు వేసుకుని 'వీరస' భంగిమలో, కాలు క్రింద నక్క, అలాగే పీఠం క్రింద గౌతమీ నది జలబావి ఉన్నది.

వానపల్లి గ్రామం పిఠాపురం మహారాజు సంస్థానంలో ఉండేది. పళ్ళాలమ్మ అమ్మవారిని మహారాజు దర్శించి తరించినట్లు ఈ ప్రాంత పెద్దలు చెబుతుంటారు. ఒక రోజు అమ్మవారు మహారాజుకు కలలో కనిపించి తనకు పండ్లు, పూలు పంపించాలని కోరిందట. ఈ ప్రకారం చేస్తే రాజవంశం భోగభాగ్యాలతో తులతూగి సుఖంగా వర్థిల్లుతుందని చెప్పిందని, వెంటనే రాజు అమ్మవారు చెప్పినట్లే పండ్లు, పూలు పంపడమే కాక పండ్లు ఉండే భూమిని సమర్పించి, ధూప దీప నైవేద్యాల కొరకు ఒక అర్చక స్వామిని నియమించారు.

కోనసీమను బంగారుసీమగా మార్చిన సర్ ఆర్థర్ కాటన్ ధవళేశ్వరం వద్ద ఆనకట్ట కట్టి రాజమహేంద్రవరం నుంచి కుండలేశ్వరం వరకూ ఉన్న ముక్తేశ్వరం కాలువను తవ్వడానికి వానపల్లి గ్రామం వద్ద పళ్ళాలమ్మ ఆలయం అడ్డురాగా, ఆలయాన్ని తొలగించాలని భావించారు. అప్పుడు కాటన్ దొరకు అమ్మవారు స్వప్నంలో కనిపించి 'నా ఆలయం పక్కగా కాలువ తవ్వకం ప్రారంభించు, దిగ్విజయంగా అది నెరవేరుతుంది. నీ ఆశయానికి నా శక్తిని ప్రసాదిస్తాను' అని చెప్పిందిట. ఆయన అలాగే చేసి స్వయంగా అమ్మవారిని దర్శించి, అమ్మవారు నక్కను తొక్కిఉండటం చూచి, అమ్మవారు నక్కను తొక్కడమేమిటని అనుకొన్నాడు. ఆ ప్రాంతమంతా అరణ్యం కావడంతో నక్కలు ఎక్కువగా ఉండేవని, గ్రామానికి నక్క అరుపు కీడేకాక అమ్మవారికి నిద్రాభంగము కలగడం వల్ల అమ్మవారు నక్కను తొక్కారని చెప్పుకుంటారు. కాటన్ ఈ విషయాన్ని తెలుసుకొన్నాడు. నక్కను తొక్కిన అమ్మవారిని దర్శించుట వలన చాలా శుభం జరుగుతుందని ఈ ప్రాంత పూర్వీకులు చెబుతుంటారు.

ఒకరోజు ఆసాది ధూప, దీప నైవేద్యాలు సమర్పించి సాయంకాలం పొరసేవ చేసి పవళింపు చెప్పి తలుపులు వేసి, మరలా నిశిరాత్రి సమయమున హఠాత్తుగా తలుపులు తీసాడుట. ఆ సమయమున నూటొక్క చెళ్ళెళ్లతో ఉన్న పళ్ళాలమ్మవారి శక్తి స్వరూపాన్ని హఠాత్తుగా చూసి ఆసాది ప్రాణాలు వదిలినట్టు పెద్దలు చెబుతారు. మరణించిన ఆ మొదటి ఆసాదికాయాన్ని ఆలయం పక్కన దక్షిణమున సమాధి చేశారని పేర్కొంటుంటారు. అది ఇప్పటికీ ఉందని వీరు చెబుతారు.



### ఎంత దూరం...

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 62 కి.మీ. |
| రాజమండ్రి | 47 కి.మీ. |
| కాకినాడ | 46 కి.మీ. |
| అమలాపురం | 20 కి.మీ. |
| రావులపాలెం | 16 కి.మీ. |
| తుని | 121 కి.మీ. |

ఆధ్యాత్మికం

# ధనమ్మమర్రి

గోదావరి గలగలల చెంత ఆహ్లాదకర వాతావరణంలో భక్తుల కోర్కెలు తీర్చే కల్పవల్లిగా పేరు గాంచిన ధనమ్మమర్రి పర్యాటకులను ఎంతగానో ఆకర్షిస్తోంది. ఊయలలను తలపించే ఊడలు, చల్లటి గాలి, విశాలమైన తోటలు, చక్కటి అనుభూతిని అందించే గోదావరి పడవ ప్రయాణం అన్నింటికీ మించి ధనమ్మతల్లి ఆశీర్వాదం ఇలా చెప్పు కుంటూ పోతే అనేక ప్రత్యేకతలు ధనమ్మమర్రి సొంతం. కపిలేశ్వరపురం మండలం కేదార్లంక గ్రామంలోని వీధివారి లంక సమీపంలో సుమారు రెండెకరాల విస్తీర్ణంలో ధనమ్మమర్రి ఉంది.

పచ్చదనంతో కళకళలాడే గోదావరి గట్టు, మర్రిచెట్టు పెద్దపెద్ద ఊడలు చూపరులను అబ్బురపరుస్తాయి. సాధారణ రోజుల్లో కంటే కార్తీకమాసంలో అమ్మవారి సందర్శనకు వచ్చే భక్తుల సంఖ్య అధికంగా ఉంటుంది. చుట్టూ ఉన్న మామిడి తోటలు సందర్శకులను ఎంతగానో ఆకర్షిస్తాయి. ఇక్కడకు సాధారణంగా కుటుంబ సమేతంగా తరలి వస్తుంటారు. పిల్లలు, పెద్దలు, వృద్ధులు ఇలా ఎవరికైనా ధనమ్మమర్రి ప్రాంతం ఓ మంచి అనుభూతిని స్తుంది. అమ్మవారి దర్శనానికి వచ్చే భక్తుల సౌకర్యార్థం ఆలయ ప్రాంగణం లోనే పూజా సామగ్రి, వంటసామగ్రి అందుబాటులో ఉన్నాయి.

ఇక్కడకు చేరుకునేందుకు రెండు మార్గాలున్నాయి. కొత్తపేట, బోడిపాలెం వంతెన నుండి సుమారు 2 కి॥మీ॥ దూరంలో ధనమ్మమర్రి ఉంది. వాహనాలపై వచ్చే వారికి ఈ మార్గమే అనుకూలం. రెండోది కపిలేశ్వరపురం నుండి గోదావరి దాటి రావాలి. కొత్తపేట, వాడపాలెం నుండి ఆటో సౌకర్యం కూడా ఉంటుంది.

ధనమ్మమర్రికి గొప్ప ప్రాశస్త్యముంది. మూడు శతాబ్దాల క్రితం మర్రిచెట్టు వద్ద స్థానిక భక్తులకు ధనమ్మతల్లి దర్శనమిచ్చి, ప్రజల రక్షణ కోసం తానిక్కడ కొలువై ఉన్నట్టు చెప్పిందని పెద్దలు చెబుతారు. అప్పటి నుండి ఈ ప్రాంతాన్ని ధనమ్మమర్రిగా పిలవడం ఆరంభించారు. ఎంతో భక్తి శ్రద్ధలతో కొలవడమే కాదు... ఏటా అమ్మవారికి ఉత్సవాలు కూడా చేస్తున్నారు. అప్పట్లో పెద్ద మ్రానుగా ఉన్న మర్రిచెట్టును అమ్మవారి ప్రతిరూపంగా ప్రజలు పూజించేవారు. తరువాత కాలంలో అమ్మవారికి ఆలయం నిర్మించారు. ఇక్కడి అమ్మవారి భోగభాగ్యాలను, ధనమ్మమర్రి ప్రాంతాన్ని కపిలేశ్వరపురం జమీందారులైన బలుసు వంశస్తులు చూడటం ఆచారంగా వస్తోంది. వారి ఆధ్వర్యంలో సందర్శకులకు సౌకర్యాలు కల్పించడంతో పాటు ఏటా మే నెలలో అన్నవరం సత్యనారాయణ స్వామి కళ్యాణం జరిగిన మర్నాడు అమ్మవారి ఉత్సవాలు వైభవంగా నిర్వహిస్తారు.




**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 56 కి.మీ. |
| రాజమండ్రి | 42 కి.మీ. |
| కాకినాడ | 40 కి.మీ. |
| అమలాపురం | 24 కి.మీ. |
| రావులపాలెం | 11 కి.మీ. |
| తుని | 136 కి.మీ. |



# మందపల్లి



**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 52 కి.మీ. |
| రాజమండ్రి | 37 కి.మీ. |
| కాకినాడ | 35 కి.మీ. |
| అమలాపురం | 27 కి.మీ. |
| రావులపాలెం | 6 కి.మీ. |
| తుని | 133 కి.మీ. |



రావులపాలెం నుండి అమలాపురం వెళ్ళే మార్గంలో రావులపాలెం నుండి 4 కి॥మీ॥ దూరంలో మందపల్లి ఉంది. హిందూ ధర్మశాస్త్రం ప్రతి ఒక్కరికీ జీవత కాలంలో ఏల్నాటి శని, శనిదోషం వంటి శనిగ్రహ పీడల ప్రభావం ఉంటుందని పండితులు చెబుతుంటారు. ఈ గ్రహపీడల నివారణకు దక్షిణ భారతదేశంలో మందపల్లి మందేశ్వర (శనేశ్వర) క్షేత్రం ఏకైక ఆలయంగా విరాజిల్లుతోంది.

అగస్త్య మహర్షి ఋషి సమూహంతో గౌతమీనదీ తీరాన ఏడాది సత్రయాగం చేసేందుకు పయనమై వచ్చారు. ఆ సమయంలో కైటభుడనే రాక్షసుని కొడుకులైన అశ్వత్థుడు, పిప్పలుడు అను ఇరువురు రాక్షసులు లోకకంటకులుగా ప్రవర్తిస్తూండేవారు. వారిలో అశ్వత్థుడు రావిచెట్టు రూపంలోనూ, పిప్పలుడు బ్రాహ్మణ రూపంలోను ఉంటూ బ్రాహ్మణులను భక్షించేవారు. దీంతో మహర్షులు గౌతమీ దక్షిణ తీరమున నియమవ్రతుడై తపస్సు చేసుకుంటున్న సూర్యపుత్రుడు శనిని ఆశ్రయించి ఈ రాక్షసులను వధించమని కోరారు. వారి కోరిక మేరకు ఇరువురు రాక్షసులను శని భస్మం చేసాడు. అయితే బ్రాహ్మణ సంతతికి చెందిన వారైన ఈ రాక్షసులను సంహరించినందుకు కలిగిన బ్రహ్మహత్యా దోష పరిహారానికి, లోకరక్షణకు సర్వలోకేశ్వరుడైన శివుడ్ని శని ప్రతిష్ఠించాడు. అలా ప్రతిష్ఠించిన శివునికి శనివారం, శని త్రయోదశి (త్రయోదశి తిథి కలిగిన శనివారం) దినాల్లో నువ్వులు దానం చేసి, నువ్వుల నూనెతో అభిషేకం చేసిన వారికి గ్రహపీడల నుండి విముక్తి కల్పించి, సమస్త కోరికలు నెరవేరుస్తానని శని వరమిచ్చాడు. శని ప్రతిష్ఠించిన కారణంగానే ఈ ఈశ్వరుడు శనీశ్వరుడని పేరుపడ్డాడు. ఈ శనీశ్వరుని పక్కనే సప్తమాతృకలు వచ్చి పార్వతీదేవిని వెలయించగా, చతుర్ముఖ బ్రహ్మ మరొక శివలింగాన్ని ప్రతిష్ఠించాడు. ఇక్కడ ఈశ్వరునికి బ్రహ్మేశ్వరుడని పేరు. కర్కోటకుడను నాగు మరొక శివలింగమును ప్రతిష్ఠించగా నాగేశ్వరుడని పేరు కలిగెను. ఆ పక్కనే సప్త మహర్షులలో ఒకరైన గౌతమ మహర్షి వేణుగోపాల స్వామిని ప్రతిష్ఠించాడు. ఆ విధంగా ఒకే ప్రాకారంలో ఐదు దేవాలయాలతో శనీశ్వరక్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. స్వామికి తైలాభిషేకాలు చేయించుకునేందుకు దేశం నలుమూలల నుండి భక్తులు వస్తుంటారు.

**దర్శన సమయం:**

ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు
సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు

ఫోన్: 08855-243208, 949100721, 9030751207.



# ర్యాలి

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 47 కి.మీ. |
| రాజమండ్రి | 35 కి.మీ. |
| కాకినాడ | 35 కి.మీ. |
| అమలాపురం | 39 కి.మీ. |
| రావులపాలెం | 6 కి.మీ. |
| తుని | 129 కి.మీ. |



అపురూపమైన జగన్మోహినీకేశవస్వామి అద్భుతరూపం ర్యాలి పుణ్యక్షేత్ర ప్రసిద్ధికి కారణం. ఈ ద్విముఖ రూపాన్ని దర్శించి తరించేందుకు భక్తులు తండోపతండాలుగా వస్తుంటారు. దీంతో ఈ ఆలయం దక్షిణ భారతదేశంలోని అత్యంత పేరెన్నికగన్న పుణ్యక్షేత్రాల్లో ఒకటిగా చరిత్ర పుటల్లోకెక్కింది. ర్యాలి జగన్మోహినీ కేశవస్వామి శిల్పంలో జీవం ఉట్టిపడే నైపుణ్యం సందర్శకులను విశేషంగా ఆకర్షిస్తుంది. ఆత్రేయపురం మండలంలోని ఈ పుణ్యక్షేత్రానికి, 'ర్యాలి' అని పేరు రావడానికి అనేక కథనాలు ప్రచారంలో వున్నాయి.

గౌతమీ, వశిష్ఠ ఉభయ నదీ పాయల మధ్య గల ర్యాలి గ్రామానికి చోళరాజులు ద్రావిడ బ్రాహ్మణ సంఘంతో వచ్చి కోట ఏర్పాటు చేసుకొని దాని చుట్టూ కందకం తవ్వించారు. ఆ కారణంగా ఆ కందకానికి చోళరాజుల సముద్రమని పేరు వాడుకలో వుంది. ర్యాలిలో కొండల వంటి దిబ్బలు, అగాధం లాంటి గోతులు ఉండటం ఇందుకు నిదర్శనంగా పేర్కొంటు న్నారు. క్రీ॥పూ॥ ఈ ప్రాంతం దట్టమైన అడవులతో ఉండేది. విష్ణుభక్తుడైన విక్రమదేవుడు ఈ ప్రాంతానికి వేటకు వచ్చి అలసిపోయి ఒక చెట్టు కింద విశ్రమించాడు. ఆ సమయంలో నిద్రపోతున్న తనకు శ్రీమహావిష్ణువు కనబడి నేను స్వయంభూ రూపంలో ఈ ప్రాంతంలో ఉన్నాను. నువ్వు కర్రతో రథం చేయించి దానిని లాగుకుంటూ వెళ్ళుతుంటే రథశీల పడినచోట తవ్విస్తే విగ్రహం కనబడుతుందని చెప్పి అంతర్ధానమయ్యాడు. భగవంతుని ఆదేశం మేరకు విక్రమదేవుడు రథం చేయించి లాగుచుండగా రథశీల పడినచోట విగ్రహం దొరికినట్లు, ఆ విగ్రహాన్ని అక్కడే ప్రతిష్ఠించి ఆలయం నిర్మించినట్లు చరిత్ర చెబుతోంది. రథశీల పడడం వల్లనే 'ర్యాలి' అనే పేరు వాడుకలోకి వచ్చిందని వినికిడి. ఇక్కడ ఒక దేవాలయంలోని నంది రూపం మరో దేవాలయంలో కనబడటం అసాధారణ విషయంగా చెబుతున్నారు. ఈ ఆలయ నిర్మాణం క్రీ॥శ॥ 11వ శతాబ్దం చివరలో జరిగినట్టు తెలుస్తుంది.

కాశీ, అయోధ్య, పండరీపురం, రామేశ్వరం, బృందావనంలో లేని విశేషం ఈ ఆలయంలోని మూర్తిలో వుంది. ఐదు అడుగుల ఎత్తుగల సాలగ్రామ శిలలో సాక్షాత్తు స్త్రీ, పురుష ఉభయాత్మక రూపంగా ఈ క్షేత్రంలో దర్శనమిస్తుంటారు శ్రీ జగన్మోహినీ కేశవస్వామి. ముందుభాగం పురుష రూపం, వెనుక భాగం స్త్రీరూపం ఒకే శిలలో దర్శనమిస్తాయి. స్వామివారి చుట్టూ దశావతారాలు. వీటి వైభవాన్ని నారద, తుంబురులు గానం చేస్తున్న వైనం చూడముచ్చటగా ఉంటుంది. జగన్మోహినీ కేశవస్వామి అవయవాలు సజీవ సౌందర్యానికి సంకేతాలుగా దర్శనమిస్తుంటాయి. శ్రీచరణ యుగళ మధ్యంలో గంగాదేవి విగ్రహం, ఆ విగ్రహం నుండి గండకీ గంగ ప్రవహించడం ఆశ్చర్యకర విషయం. ఒక సమయంలో శంకరుని కౌగిలికి మోహిని శరీరం నుంచి ప్రసరించిన చెమటను ఈ గండకీ గంగగా అభివర్ణిస్తారు. శివాలయంలో అభిషేకం చేసిన గంగ శంకరుని కామదాహానికి అంతకంతకు హరించుకుపోతుంది. గర్భాలయంలోని ఉదకం బయటకు గాని కిందకు గాని పోవడానికి మార్గమే లేదు. కేశవాలయంలో గంగ ఊరుతూ ఉండటం, శివాలయంలో గంగ హరించుకుపోవటం అత్యంత ఆశ్చర్యకర విషయాలు. ఈ గ్రామంలో విష్ణు ఆలయం (జగన్మోహినీ కేశవస్వామి) తూర్పు ముఖంగాను, శివాలయం (ఉమాకమండలేశ్వర స్వామి) పడమర ముఖంగాను ఉన్న ప్రపంచంలోనే ఏకైకస్థలం ర్యాలి క్షేత్రంగా పేర్కొంటున్నారు.

*దర్శన సమయం:* ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు, సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు, *ఫోన్:* 08855-250231, 9581678807.



# వాడపల్లి

తూర్పుగోదావరి జిల్లా ఆత్రేయపురం మండలం వాడపల్లి గ్రామంలో వేంచేసి యున్న శ్రీదేవి, భూదేవి సమేత శ్రీవేంకటేశ్వరస్వామి వారి ఆలయం కోనసీమ తిరుపతిగా ప్రసిద్ధిగాంచింది. ఏడు శనివారాలు వెంకన్న దర్శనం... ఏడేడు జన్మల పుణ్యఫలంగా ప్రతీతి. ఈ ప్రాంత ప్రజలు తిరుపతి శ్రీ వేంకటేశ్వరుని దర్శించుకున్న అనంతరం విధిగా వాడపల్లి వెంకన్న ఆలయాన్ని దర్శించుకొని మొక్కులు తీర్చుకోవడం ఆనవాయితీ. ఆశేష భక్తజనం సందర్శించే ఆలయాల్లో వాడపల్లి ప్రధానమైంది. ఇతర ఆలయాల్లో వున్న దేవతామూర్తుల కంటే శ్రీ స్వామికి విలక్షణ చరిత్ర ఉంది. స్వయంభువై రక్తచందనమనే కొయ్యతో మూర్తీభవించిన పరంధాముడాయన.

పూర్వం ఈ ప్రాంతమంతా దండకారణ్యంగా రుషి పుంగవులతో విరాజిల్లు తుండేది. సుమారు మూడు శతాబ్దాల క్రితం ఒక కొయ్య విగ్రహం గౌతమీ గోదావరి తీరంలో ఇసుకలో లభ్యమైంది. గ్రామస్థులు ఆ విగ్రహాన్ని మేళ తాళాలు, మంగళ వాయిద్యాలతో వాహనంపై తెచ్చి ఇక్కడ గుడి నిర్మించి ఆగమశాస్త్ర ప్రకారం ప్రతిష్ఠించారు. ఆ సుముహూర్తం మొదలు వాడపల్లి వాడని మల్లెగా ఆధ్యాత్మిక పరిమళాన్ని భక్తకోటికి వెదజల్లుతూనే ఉంది. ప్రతి యేడాది చైత్రశుద్ధ ఏకాదశి రోజున భక్తజన రంజకంగా ఇక్కడ తీర్థం, కల్యాణోత్సవాలు నిర్వహించడం ఆనవాయితీ.

చిత్తశుద్ధితో వాడపల్లి వెంకన్నను దర్శించిన వారికి కామితార్థములను అనుగ్రహించి, కంటికి రెప్పలా కాపాడుతారని భక్తుల ప్రగాఢ విశ్వాసం. నాటి పెద్దాపురం సంస్థానాధీశులు శ్రీ వత్సవాయి తిమ్మజగపతి రాజు శ్రీ స్వామి వారిని దర్శించి తన్మయులై ధూప, దీప, నైవేద్యాలకు 110 ఎకరాలు, స్వామి వారి సేవలకు 165 ఎకరాలు భూమిని దానమిచ్చి తమ ఔదార్యాన్ని చాటుకున్నారు. రాజావారి జ్ఞాపకార్థం ఆలయం ఆవరణలో నల్లరాతిపై శాశ్వత చిత్రపటాన్ని ఏర్పాటు చేశారు. ఈ ఆలయానికి గల అతిపెద్ద రథం శిథిలం కావడంతో రథోత్సవానికి బదులుగా గౌతమీ గోదావరి నదిలో తెప్పోత్సవం నిర్వహిస్తున్నారు. ఈ ఆలయానికి సంబంధించిన రథోత్సవానికి, స్వాతంత్ర్యోద్యమానికి అవినాభావ సంబంధం ఉంది. 1931 మార్చి 30న స్వామి వారి కల్యాణోత్సవాల్లో రథోత్సవం జరుగుతుండగా దేశంలో ఉప్పు సత్యాగ్రహం జరుగుతున్న రోజులవి. అందువల్ల భక్తుల్లో దేశభక్తి ఉప్పొంగి, రథంపై త్రివర్ణ పతాకాన్ని, మహాత్మా గాంధీ చిత్రపటాన్ని వుంచి నినాదాలు చేశారు. దీంతో దేశభక్తులపై బ్రిటీషు పోలీసులు విచక్షణా రహితంగా కాల్పులు జరిపారు. ఈ సంఘటనలో నలుగురు దేశభక్తులు మృతి చెందగా, ఈ సంఘటన రాష్ట్రవ్యాప్తంగా స్వాతంత్ర్యోద్యమానికి ఊతమిచ్చింది. ఈ ఆలయానికి ఎదురుగా ఉన్న ఆవరణలో కొత్తపేట మాజీ ఎమ్మెల్యే ఎంవిఎస్ సుబ్బరాజు నాటి సంఘటనను స్తూపంగా మలిచి చిరస్థాయిగా నిలిచే ఏర్పాటు చేశారు.

**దర్శన సమయం:**

ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు
సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు

**ఫోన్:** 08855-271888.





**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 41 కి.మీ. |
| రాజమండ్రి | 28 కి.మీ. |
| కాకినాడ | 37 కి.మీ. |
| అమలాపురం | 37 కి.మీ. |
| రావులపాలెం | 8 కి.మీ. |
| తుని | 129 కి.మీ. |

పిఠాపురం
ఉప్పాడ
పెద్దాపురం
సామర్లకోట
సర్పవరం
కాకినాడ
హోప్ ఐలాండ్
రేపూరు
గొల్లల మామిడాడ
కోరింగ అభయారణ్యం
కోరంగి
రామచంద్రపురం
ద్రాక్షారామం
యానాం

N

**కాకినాడ నుండి వివిధ ప్రధాన నగరాలకు గల దూరం**

న్యూఢిల్లీ..........1800 కి.మీ.
ముంబయి........1199 కి.మీ.
కోల్‌కత్తా.........1028 కి.మీ.
చెన్నై.................673 కి.మీ.
హైదరాబాద్.......484 కి.మీ.
విజయవాడ.........212 కి.మీ.
విశాఖపట్టణం.......160 కి.మీ.

# కాకినాడ

## డివిజన్





**కాకినాడ డివిజన్‌లోని దర్శనీయ ప్రదేశాలు**

- కాకినాడ
- రేపూరు
- హోప్‌ఐలాండ్
- పిఠాపురం
- సామర్లకోట
- సర్పవరం
- గొల్లల మామిడాడ
- కోరంగి
- యానాం




# కాకినాడ



పెన్షనర్స్ ప్యారడైజ్... రెండవ మద్రాస్... ప్లాన్డ్ సిటీ... ఇలా వీటిలో ఏ పేరు చెప్పినా ఠక్కున గుర్తొచ్చే కాకినాడ ప్రాంతానికి దశాబ్దాల చరిత్ర ఉంది. కాకినాడ నగరంలో స్థిరపడేందుకు రిటైర్డ్ ఉద్యోగులు ఎక్కువగా ఆసక్తి చూపడం వల్ల పెన్షనర్స్ ప్యారడైజ్‌గా పిలుస్తారని చెబుతుంటారు. అలాగే రహదారుల నిర్మాణం ప్రణాళికాబద్ధంగా ఉండడంవల్ల ప్లాన్డ్ సిటీగా, రెండవ మద్రాసుగా పిలిచేవారు. వీటితో పాటు 1901లో ఏర్పడిన పిఠాపురం మహారాజా కళాశాల జిల్లాలోనే తొలి కళాశాలగా, కాకినాడ రేవు కూడా ఈ ప్రాంత ప్రాముఖ్యతను దశదిశలా వ్యాపింపజేశాయి. స్వదేశంతోపాటు విదేశీ పర్యాటకులను సైతం ఆకర్షించేలా ఈ  నగరం రూపాంతరం చెందుతోంది. నగరానికి మూడు కిలోమీటర్ల దూరంలో సముద్రతీరం ఉంది. తొలుత కుంభాభిషేకం ఆలయం, కాకినాడ పోర్టు, ఫిషింగ్ హార్బరు, వాకలపూడి లైట్‌హౌస్ వరుసగా ఉన్నాయి. సర్పవరం జంక్షన్ మీదుగా వస్తే 5 కి॥మీ॥ దూరంలో ఉప్పాడ బీచ్ రోడ్డు ఉంది.

జిల్లా కలెక్టరేట్‌కు దశాబ్దాల చరిత్ర ఉంది. 1907వరకు కలెక్టర్ కార్యాలయం ప్రస్తుతం ఉన్న పి.ఆర్. డిగ్రీ కళాశాల భవనంలో ఉండేది. 1903 డిసెంబరు 4న అప్పటి మద్రాస్ గవర్నర్ యాంప్‌దిల్ ప్రస్తుత కలెక్టర్ కార్యాలయానికి శంకుస్థాపన చేసారు. 1907 నాటికి ఈ భవనం పూర్తయింది. దీని నిర్మాణానికి రాయి, సున్నం ముడి పదార్థంగా వాడారు. అప్పటినుండి ఇప్పటివరకు ఈ భవనం చెక్కుచెదరకుండా దశాబ్దాల తూర్పు పాలనకు నిశ్శబ్ద సాక్ష్యంగా నిలిచి ఉంది.

సెంటినరీ ఆంధ్రాబాప్టిస్టు చర్చి స్థానిక జగన్నాథపురంలో ఉంది. ఈ చర్చి అత్యంత పురాతనమైనది. చర్చిలో ఎక్కడ చూసినా కళానైపుణ్యం ఉట్టి పడుతుంది. బయట ఆవరణంతా పచ్చదనంతో నిండి ఉంటుంది. ఈ చర్చి నిర్మించి 100 సంవత్సరాలు దాటినా ఇటీవలే నిర్మించినట్టుగా నూతనంగా కనిపిస్తుంది. సి.ఆర్.ఐ, ఆర్.సి.ఎం. వంటి చర్చిలు కూడా ఇక్కడే ఉండడం వలన ఈ సెంటర్‌ను చర్చిస్క్వేర్‌గా పిలుస్తారు.










కాకినాడలో 146 ఏళ్ళ క్రితమే బ్యాంకింగ్ సేవలు ప్రారంభమయ్యాయి. 18వ శతాబ్దంలో కలకత్తా, బొంబాయి, మద్రాసులలో ప్రెసిడెన్సీ బ్యాంకులు ఉండగా వాటిని బ్రిటిష్ పాలకులు స్వాధీనం చేసుకొని 'ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా'గా మార్పు చేశారు. ఈ ఐబిఐ స్వాతంత్ర్యానంతరం 1955లో స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాగా రూపాంతరం చెందింది. రాష్ట్రంలోనే మొదటి బ్యాంకు శాఖగా బ్యాంక్ ఆఫ్ మద్రాస్ వారిచే ప్రారంభించిన ఈ శాఖకు పూర్వ వైభవాన్ని తీసుకువచ్చే చర్యలను భారత స్టేట్‌బ్యాంకు యాజమాన్యం చేపట్టింది. కాకినాడ మెయిన్‌రోడ్డులోని బ్రాంచ్ ఆవరణలో నేటికీ చెక్కుచెదరకుండా ఉన్న ఆనాటి 'ఇంపీరియల్ బ్యాంక్' భవనాన్ని స్టేట్ బ్యాంక్ హెరిటేజ్ గ్యాలరీగా మార్చారు. ప్రముఖులైన రవీంద్రనాథ్ ఠాగూర్, మోతీలాల్ నెహ్రూలకు సంబంధించిన బ్యాంకు అకౌంట్లు, 1881 నుండి బ్రిటిష్ పాలకులు వాడిన అకౌంట్ బుక్స్‌తో పాటు బ్యాంక్ ఆఫ్ మద్రాస్, బ్యాంక్ ఆఫ్ బోంబేల 10 రూపాయల కరెన్సీ నోట్లను ఈ భవనంలో ఉంచారు.

జాతిపిత మహాత్మాగాంధీ కాకినాడ ప్రాంతాన్ని సందర్శించిన నాటి జ్ఞాపకాలు, దశాబ్దాలు గడిచినా నేటి తరానికి గుర్తుండేలా... స్వాతంత్ర్యోద్యమంలో గాంధీజీ కృషి, బాల్యం నుంచి మరణం వరకు మహాత్ముని జీవిత విశేషాలతో 'గాంధీమందిరం' సాంబమూర్తి నగర్‌లో ఉంది. కాలక్రమేణా పాతభవనం శిథిలావస్థకు చేరి కూలిపోగా, ఆ స్థానంలో అప్పటి కట్టడం నమూనాతోనే ఆధునిక హంగులతో మరో కొత్త భవనాన్ని 'గాంధీభవన్' పేరుతో పునరుద్ధరించారు. అక్కడే ఓ గ్రంథాలయాన్ని కూడా ఏర్పాటు చేశారు. లోపల 1876లో మహాత్ముడు బాలగాంధీ నుంచి 1883లో విద్యార్థిగా, 1888లో న్యాయశాస్త్ర విద్యార్థిగా, 1891లో బారిస్టర్‌గా, 1906లో సేవాదళ్ గాంధీగా, 1913లో సత్యాగ్రహ గాంధీగా ఉన్న చిత్రాలతో సహా ఆయన జీవిత ఘట్టాల పాత చిత్రాలన్నింటిని ఇక్కడ పొందుపరిచారు. నూలు ఒడికే మహాత్ముని కాంస్య విగ్రహం ఇక్కడ ప్రత్యేక ఆకర్షణ.







1923 డిసెంబరు 28న జాతీయకాంగ్రెస్ 38వ మహాసభలు జరిగినప్పుడు సుమారు 12 వేల మంది హాజరు కావడానికి వీలుగా ఒక పెద్ద డేరా వేసి, జాతీయ నాయకులకు 36 కుటీరాలు నిర్మించిన ప్రాంతాన్ని ప్రస్తుతం గాంధీనగర్‌పార్కుగా అభివృద్ధి చేసారు. ఈ పార్కు మధ్యలో పెద్ద గాంధీ విగ్రహం ఉంది. చిన్నపిల్లలకు ఆటవస్తువులు, వాకింగ్ ట్రాక్ ఏర్పాట్లు కూడా ఉన్నాయి. పచ్చని చెట్లతో ఆహ్లాదకర వాతావరణంతో ఈ పార్కును సుందరంగా తీర్చిదిద్దడం జరిగింది.

కాకినాడకు కళల కాణాచిగా పేరుంది. వందేళ్ళకు పైబడి చరిత్ర కలిగిన గాన సభలు ఇప్పటికీ ఇక్కడ ఉన్నాయి. 1904లో ప్రారంభమైన సరస్వతీ గానసభ నుంచి శ్రీరామసమాజం, సంగీత విద్వత్ సభ, యంగ్‌మెన్స్ హ్యాపీక్లబ్, ఆంధ్ర సేవాసంఘం వంటి సంస్థలు ఇప్పటికీ కళలకు ఎంతో ప్రోత్సాహాన్ని అందిస్తున్నాయి. సరస్వతీ గానసభ నిర్వహణలోని సూర్యకళామందిరంలో ఏటా దసరా సంబరాలు పేరిట రాష్ట్రస్థాయి ఉత్సవాలను నిర్వహిస్తూ ఉంటారు. మరోవైపు దేశంలోనే పేరొందిన హార్మోనిస్ట్ ఆకుల నరసింహారావు నుంచి సినిమా నటులలో ప్రత్యేకస్థానం పొందిన రేలంగి, ఎస్వీరంగారావు, రావుగోపాలరావు, అంజలీదేవి, సూర్యకాంతం వంటి ప్రముఖులు ఈ ప్రాంతానికి చెందిన వారే. కాకినాడ కళాకారులు దేశ, రాష్ట్ర స్థాయిలో పేరు ప్రఖ్యాతులు సంపాదించడంతో పాటు ఇప్పటికీ కళలకు సముచిత ప్రాధాన్యం లభిస్తుండడంతో కాకినాడను కళలకు కాణాచి అంటారు.





వ్యవస్థాపకులు: దివాన్ బహదూర్
కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడు




కాకినాడ, సూర్యరాయపురం (సూర్యారావు పేట)నందు పిఠాపురం మహారాజా వారు బాదం వారికి యిచ్చిన ఖాళీ స్థలములో భక్తుల సహాయ సహకారములతో శ్రీ రామలింగేశ్వరస్వామి, శ్రీ బాలాత్రిపుర సుందరీ అమ్మవారిని, భద్రకాళీ సమేత శ్రీ వీరభద్ర స్వామిని క్రీ॥శ॥ 1884వ సంవత్సరములో ప్రతిష్ఠింపజేసారు. నిత్య నూతన శోభతో భక్తుల పాలిట కొంగు బంగారమై భక్తి శ్రద్ధలతో సేవించిన వారికి కల్పవృక్షమై శోభిల్లుతూ అశేష భక్తుల పూజలందుకుంటూ దినదిన ప్రవర్ధమానమవుతుంది. 2004-2005 సంవత్సరంలో ఆలయాన్ని భక్తులు, దాతల సహాయ సహకారాలతో నూతనముగా పునఃనిర్మించడం జరిగింది. ఆలయ ప్రాంగణమంతా గ్రానైట్ ఫ్లోరింగ్‌తో అతి సుందరముగా తీర్చిదిద్దడం జరిగింది.

ఈ ఆలయంలో చైత్రమాసంలో వసంత నవరాత్రుల అనంతరం చైత్ర శుద్ధ ఏకాదశి నుండి కళ్యాణ మహోత్సవములు అత్యంత వైభవంగా జరుగుతాయి. ఆషాఢ పౌర్ణమి రోజున శ్రీ అమ్మవారికి శాకాంబరి అలంకరణతో ఆలయ ప్రాంగణమంతా కాయగూరలు, పళ్ళు, ఆకుకూరలతో అలంకరణ చేయుదురు. అశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలు విజయదశమి వరకు శరన్నవరాత్రి మహోత్సవములు అత్యంత వైభవోపేతంగా జరుగుతాయి. దేవి నవరాత్రులలో విజయవాడ కనకదుర్గ అమ్మవారికి లాగే శ్రీ బాలాత్రిపుర సుందరీ అమ్మవారికి కూడా వివిధ అవతారాల అలంకరణ అతివైభవంగా జరుగుట విశేషము. మహాశివరాత్రి రోజున శ్రీ అమ్మవారికి అతి వైభవంగా ఆలయమునకు ఎదురుగాయున్న పుష్కరిణిలో తెప్పోత్సవము జరుగును. కనుమ రోజున కాకినాడలో ఈ దేవాలయంలో మాత్రమే ప్రభల ఉత్సవము జరుగుట విశేషం. కార్తీక పౌర్ణమి రోజున జ్వాలాతోరణం కార్యక్రమము కలదు. ఆలయ ప్రాంగణంలో గోశాల నిర్మించి గోపూజలు జరుపుచున్నారు. అమ్మవారికి కళ్యాణం 5 రోజులు, వరలక్ష్మీవ్రతం, విజయదశమి, కార్తీక పౌర్ణమి, భోగి, సంక్రాంతి, కనుమ, మహాశివరాత్రి పర్వదినములలో బంగారపు చీర అలంకరణ చేయుదురు.

రాష్ట్రంలోని అతిపురాతనమైన లైట్‌హౌస్ కాకినాడ రూరల్ మండలం వాకలపూడిలో ఉంది. 1874లో కాకినాడ నగరానికి 10 కి॥మీ॥ ఈశాన్య దిక్కులో ఈ లైట్‌హౌస్ నిర్మాణం ఆరంభించారు. పిఠాపురం మహారాజావారు 6 ఎకరాల స్థలాన్ని దీనికి విరాళంగా ఇచ్చారు. 23 మీటర్ల ఎత్తులో నిర్మించిన ఈ లైట్‌హౌస్ 20 నాటికల్ మైళ్ళ (36 కి॥మీ॥) దూరంలో ఉన్న నౌకలకు కూడా దారి చూపుతుంది. సుమారు 130 సంవత్సరాల పాటు వంటనూనెలు, కిరోసిన్ దీపాలతో కాంతులందించిన ఈ లైట్‌హౌస్ పక్కన సుమారు రూ. 50 లక్షలతో ఆధునిక హంగులతో 45 మీటర్ల ఎత్తులో కొత్త లైట్‌హౌస్ నిర్మించారు. ఇది కూడా 36 కిలోమీటర్ల దూరంలో ఉన్న వారికి విద్యుద్దీపకాంతులతో దారి చూపుతుంది.



# రేపూరు



కాకినాడకు 5 కి॥మీ॥ దూరంలో కాకినాడ రూరల్ మండలం రేపూరు గ్రామంలో నిర్మించిన షిర్డీసాయిబాబా విగ్రహం భక్తులను, పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తోంది. ఇక్కడ ఏర్పాటు చేసిన 116 అడుగుల మూలవిరాట్ షిర్డీసాయిబాబా విగ్రహమే ప్రపంచంలోనే అతిపెద్ద విగ్రహమని భక్తులు చెబుతున్నారు. శ్రీ షిర్డీసాయి సేవాశ్రమం ఆధ్వర్యంలో మూడు ఎకరాల విస్తీర్ణంలో ఈ ఆశ్రమాన్ని ఏర్పాటు చేసారు. గతంలో ఆశ్రమ వ్యవస్థాపకులు అమ్ముల సాంబశివరావు కలలో కనిపించిన బాబా ఆదేశంతో ఈ మహాత్కార్యానికి సంకల్పించారు. 2000వ సంవత్సరంలో మూలవిరాట్ షిరిడీసాయి విగ్రహ నిర్మాణానికి అంకురార్పణ చేశారు. అప్పటి నుండి ఒకవైపు సాయి దీక్షలు చేస్తూ మరోవైపు విగ్రహ నిర్మాణం జరుపుతూ వచ్చారు. 2011, డిసెంబర్‌లో 116 అడుగుల సాయిబాబా విగ్రహం పూర్తి రూపు సంతరించుకుంది. 2012, జనవరి 1న ప్రత్యేక పూజా కార్యక్రమాలు నిర్వహించి, భక్తులకు దర్శనం కల్పించారు. అప్పటి నుండి భక్తులు అధికసంఖ్యలో ఇక్కడకు వచ్చి సాయిబాబా విగ్రహాన్ని వీక్షించి ప్రత్యేక పూజలు నిర్వహిస్తున్నారు. 2012, ఫిబ్రవరి నుండి బాబా విగ్రహానికి శిల్పులు వస్త్రాలు నగిషీలు చెక్కే పనులు చేపట్టి, 2012, డిశంబరు నాటికి సిద్ధం చేశారు. 2013, జనవరి 15 నుండి 23 వరకు ఈ విగ్రహాన్ని ప్రజలకు అంకితమిచ్చేందుకు 'ప్రజాంకిత ప్రతిష్ఠ మహోత్సవాలను నిర్వహించడం జరిగింది.

బాబా పాదాల నుండి శిరస్సు వరకు 116 అడుగుల ఎత్తులో ఉండగా, భూమి నుండి శిరస్సు వరకు 135 అడుగుల ఎత్తులో విగ్రహం ఉండేలా నిర్మాణం చేసారు. ఈ విగ్రహం బరువు వెయ్యి టన్నులు ఉంటుందని శిల్పుల అంచనా. ఈ విగ్రహం మూడు అంతస్తుల భవనంపై బాబా కూర్చున్నట్లు ఉంటుంది. విగ్రహం కింది భాగంలో ఐదు వేల కోట్ల శ్రీసాయి పవిత్ర నామాలను నిక్షిప్తం చేసేందుకు వీలుగా సాయికోటి స్థూపాన్ని నిర్మించారు. ప్రపంచంలోనే ఎక్కడా లేని విధంగా ఇక్కడ సాయిబాబా విగ్రహం నిర్మాణం చేయడంతో ఈ ప్రాంతం పర్యాటకంగా అభివృద్ధి చెందే అవకాశాలు పుష్కలంగా ఉన్నాయి. జిల్లాలో పర్యాటక కేంద్రాల సరసన రేపూరులోని మూలవిరాట్ సాయివిగ్రహం చేరే అవకాశం ఉంది.






# హోప్‌ఐలాండ్

ఎటు చూసినా విశాలమైన సముద్రతీరం... కాలుష్య రహితమైన చల్లని గాలులు... అందంగా ఎదిగిన సరుగుడు తోటల నడుమ నిశ్శబ్ద వాతావరణంలోకి ఒక్కసారిగా అడుగుపెడితే ఎలాంటి వారికైనా పట్టరాని ఆనందం... యాంత్రిక లోకం నుంచి స్వేచ్ఛా ప్రపంచంలోకి అడుగిడిన భావన కలుగకమానదు... ఆ ప్రాంతమే కాకినాడకు సమీపంలో ఉన్న హోప్‌ఐలాండ్ (ఆశాద్వీపం). నైసర్గికంగా తాళ్లరేవు మండలంలో ఉన్న ఈ హోప్‌ఐలాండ్ కాకినాడ పట్టణాన్ని పెనుతుఫానుల బారినుండి కాపాడే సహజ రక్షణ కవచంగా అందరికీ తెలుసు. చుట్టూ ఉన్నది ఉప్పునీరైనా... తాగునీరు లభించే ఈ దీవి ప్రకృతి ప్రేమికులకు ఓ స్వర్గసీమ.

కాకినాడ పట్టణానికి సుమారు 5 కి॥మీ॥ దూరంలో 17 కి॥మీ॥ల పొడవు, రెండున్నర కి॥మీ॥ల వెడల్పుతో నెలవంకలా ఉండే ఈ ఆశాద్వీపాన్ని అభివృద్ధి చేస్తే ఆంధ్రాగోవాగా ప్రఖ్యాతి పొందడం ఖాయం. గోదావరికి సంభవించే వరదల సమయంలో సముద్రంలోనికి కొట్టుకొచ్చే ఇసుకతో సహజసిద్ధంగా ఏర్పడిన హోప్‌ఐలాండ్ వయస్సు దాదాపు 200 సం॥లు. ఏటా 27 హెక్టార్ల ల్యాండ్ మాస్ (ఇసుక) వచ్చి చేరుతుందని ఇండియన్ ఫారెస్ట్ సర్వీస్ అధికారి హెచ్.సి.మిశ్రా తన నివేదికలో పేర్కొన్నారు. ఈ హోప్‌ఐలాండ్ పశ్చిమ దిశగా అభివృద్ధి చెందుతోంది. ఒకవైపు లోతైన సముద్రం, మరోవైపు బ్యాక్ వాటర్స్‌తో హోప్‌ఐలాండ్ ఆహ్లాదంగా ఉంటుంది. కాకినాడ పోర్టుకు వచ్చివెళ్ళే నౌకలతో మరింత కమనీయ దృశ్యాలు కనువిందు చేస్తుంటాయి. ప్రస్తుతం హోప్‌ఐలాండ్‌కు ప్రత్యేకంగా టూరిస్టుల కోసం బోట్లు తిప్పే పరిస్థితి ఏమీలేదు. ఎవరైనా సందర్శించాలనుకుంటే ప్రత్యేకంగా ఏర్పాటు చేసుకోవలసిందే. కాకినాడ పోర్టు నుండి మోటరైజ్డ్ బోటు ద్వారా 45 నిమిషాలు ప్రయాణిస్తే ఇక్కడకు చేరుకోవచ్చు.

హోప్‌ఐలాండ్‌ను పర్యాటకంగా అభివృద్ధి పరచగలిగితే దేశ,విదేశాల నుంచి సైతం పర్యాటకులను ఆకర్షించగల సత్తాను కలిగి ఉంది. కోరింగ రిజర్వ్ ఫారెస్ట్‌లో భాగమైన ఈ ఐలాండ్‌ను 1998లో వన్యమృగ సంరక్షణ ప్రాంతంగా గుర్తించారు. అటవీ సంరక్షణ చట్టం నిబంధనల ప్రకారం కోస్టల్ రెగ్యులైజేషన్ జోన్‌లో అటవీ కార్యక్రమాలు మినహా ఇతర వ్యవహారాలను అనుమతించరు. ఇక్కడ పర్యాటకాభివృద్ధి ప్రతిపాదనలకు ఈ కారణాలే ప్రతిబంధకాలు. ఈ దీవి ప్రజలకు ఇంతవరకూ విద్యుత్తు, విద్య, వైద్య తదితర మౌలిక వసతులు అందడం లేదు. ఈ మధ్య పెరిగిన నెట్‌వర్క్ వల్ల సెల్‌ఫోన్ మాత్రం పనిచేస్తుంది. కరెంట్ లేని ఈ దీవిలో బ్యాటరీలు, సోలార్ సిస్టంతో ఛార్జింగ్ చేసుకుంటారు. కళ్ళ ముందు కరెంట్ వెలుగుల జిలుగులు కనబడుతున్నా ఈ దీవి మాత్రం చీకట్లోనే ఉంది.

### ఉప్పు నీటి మధ్య మంచినీరు

చుట్టూ ఉప్పునీరు ఉన్నా... ఎలా వచ్చిందో తెలియదుగాని నడిసంద్రం మధ్యలో మంచినీరు ఊరింది. అక్కడే ఓ బావి తవ్వుకున్నారు. ఆ బావినీళ్ళే ఈ మత్స్యకారులకు ఆధారం. ఇసుకలో కొద్దిగా తవ్వినా మంచినీరు వస్తుంది. ఓ ప్రైవేటు సంస్థ గ్రామంలో పాఠశాల నిర్మించింది. సముద్రం పొంగినా, సునామీ, తుఫాను లాంటివి వచ్చినా తలదాచుకోడానికి 1984లో ఐదు గదులతో నిర్మించిన తుఫాన్ షెల్టర్ ఇప్పుడు ఉపయోగంలో లేదు. పెచ్చులూడిన గోడలతో కూలడానికి సిద్ధంగా ఉన్న ఈ భవనాన్ని ఇటీవలే కూల్చివేయడం కూడా జరిగింది.

### జాతర

మత్స్యకారుల కులదేవతలు బాగర్తమ్మ, భైరవస్వామి. వీరిని మత్స్యకారులు చాలా భక్తిగా కొలుస్తారు. ఇక్కడ గుడులు, గోపురాలూ లేవు కాని... ఏ పని మొదలెట్టినా వీరిని కొలిచిన తర్వాతే. సంద్రంలో ఏం జరిగినా వీళ్ళిద్దరే చూసుకుంటారనే నమ్మకం వీరిది. ఊరి మధ్యలో నిటారుగా పాతిన దుంగకు బొట్టు పెట్టి, పసుపు రాసి పూజ చేస్తారు. ఏడాదికి దసరా, శివరాత్రికి రెండు సార్లు జాతర చేస్తారు. ఇంటికి వంద రూపాయలు చొప్పున వేసుకుని రికార్డింగ్ డాన్సులు, సినిమాలతో జాతర జరుపుకుంటారు. ఈ జాతరకు చుట్టాల్ని పిలిచి మద్యం, మాంసంతో విందులు చేసుకుంటారు. ఈ సమయంలో ఎవరూ వేటకు వెళ్ళరు.



# పిఠాపురం

ఒకప్పుడు పీఠికాపురంగా పిలవబడిన నేటి పిఠాపురం పట్టణం కాకినాడ నుండి విశాఖపట్టణం జాతీయ రహదారిలో కాకినాడకు 18 కి॥మీ॥ల దూరంలోఉంది. పిఠాపురం శివకేశవ పుణ్యక్షేత్రముగా భక్తులచే దర్శింపబడుతోంది.

భారతదేశంలో ఉన్న త్రిగయలలో ఒకటిగా పిఠాపురం పాదగయక్షేత్రం విరాజిల్లుతోంది. శ్రీ మహావిష్ణువు త్రివిక్రమ రూపంలో గయాసురుడిని సంహరించగా అతని శరీరం మూడు భాగాలుగా విడిపోయింది. పాదాలు పడిన చోటుగా, ఈ క్షేత్రాన్ని పాదగయ క్షేత్రంగా పిలుస్తున్నారు. ఈ క్షేత్రంలో వెలసిన స్వామి పేరు కుక్కుటేశ్వరుడు. గయాసుర సంహార నిమిత్తం పరమేశ్వరుడు కోడి రూపం దాల్చడంతో ఈ పేరు వచ్చింది. గయాసురుని కోరిక మేరకు శివుడు ఇక్కడ శ్రీ కుక్కుటలింగమూర్తిగా ఆవిర్భవించి, స్వయం భూలింగ మూర్తిగా భక్తుల పూజలందుకుంటున్నాడు. ఇక్కడి అమ్మవారు రాజ రాజేశ్వరీదేవి భక్తుల పాలిట కల్పవల్లి. ఈ అమ్మవారిని ఆదిశంకరాచార్యస్వామి ప్రతిష్ఠించి నట్టు పెద్దలు చెప్పుదురు.

ఈ క్షేత్రంలోని పురుహూతికా అమ్మవారి ఆలయం అష్టాదశ శక్తి పీఠాల్లో ఒకటి. దక్షయజ్ఞ విధ్వంసము తరువాత శంకరుడు సతీదేవి మృత కళేబరమును, భుజముపై ధరించి, విరాగియై లోకసంచారము చేయుచుండెను. అప్పుడు పరాశక్తి ఆజ్ఞ మేరకు శ్రీ మహావిష్ణువు సతీ మృతదేహాన్ని తన సుదర్శన చక్రముచేత ఖండించినారు. సతీ దేహభాగములు భూమిపై పడిన చోట అష్టాదశశక్తి పీఠములుగా విరాజిల్లుతూ భక్తకోటిచే నిత్య కుంకుమార్చనలు, నిత్యనీరాజనములు అందుకొనుచున్నవి. అందులో పీఠభాగము పడినచోటే పిఠాపురముగానూ, పీఠభాగమునకు అధిష్ఠాన దేవత కావున ఇక్కడ అమ్మవారు పీఠాంబికగానూ, పురుహూతు(ఇంద్రుడు)నిచే శ్రీ విద్యోపాసన గావించబడి, అతనిని అనుగ్రహించి, అతని కోరిక మేరకు శ్రీ పురుహూతికాదేవి అనే నామముచే ప్రసిద్ధిగాంచినది. పురుహూతికాదేవి ఎడమ క్రింది చేతియందు బంగారు పాన పాత్రనూ, కుడి క్రింది చేతియందు మిగల ముగ్గిన మాదీ (నారదబ్బ) ఫలమును, ఎడమ పైచేతియందు డాలునూ, కుడిపైచేతియందు లోహదండమునూ ధరించి నాల్గు వీధుల కూడలిలో శ్రీ చక్రపీఠముపై నుండి భక్తకోటికి సకల సౌభాగ్య సంపదలను ప్రసాదించుచున్నది.













**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 56 కి.మీ. |
| రాజమండ్రి | 68 కి.మీ. |
| కాకినాడ | 18 కి.మీ. |
| అమలాపురం | 78 కి.మీ. |
| రావులపాలెం | 78 కి.మీ. |
| తుని | 46 కి.మీ. |

పూర్వము చిత్రకేతుడను గంధర్వుడు గగనమార్గమున సంచరించుచూ కైలాసమున దిగి సప్త ఋషి గణపరివేష్టితుడైన పరమేశ్వరుని యూరువుపై వేంచేసియున్న పార్వతిని చూసి మందహాసము చేసాడు. జననీ సమానురాలగు నన్ను చూసి హేళన చేయుదువా అని పార్వతి భూలోకమున రాక్షసుడవై జన్మించమని శపించినది. ఆ శాప ప్రభావముచే అత్యంత బలపరాక్రమ సంపన్నుడుగా భూలోకమున వృత్రాసురుడు అనే పేరుతో జన్మించి సిద్ధాస్థికలతో తప్ప మరింక దేనివలనను మృత్యువు రాకుండా వరము పొందెను. ఆ కారణముగా దేవేంద్రుడు భయపడి సిద్ధిపొందిన 'దధీచి' మహర్షిని శరణువేడి అతని అస్థికలను వజ్రాయుధముగా మార్చి వృత్రాసురుని వధించెను. ఆ తరువాత బ్రహ్మహత్యాపాప నివృత్తి కొరకు పంచాత్మ స్వరూపుడగు శ్రీమన్నారాయణుని 'పంచమాధవులను' పేర స్థాపించెను. అలా దేవేంద్రునిచే స్థాపించబడిన పంచమాధవులలో ఒకటిగా, పిఠాపురంలో కుంతీమాధవస్వామి వెలుగొందుచుండెను. పాండవమాత కుంతిచే ఆరాధింపబడిన కారణంగా కుంతీమాధవ స్వామిగా పేరొందినట్లు కొందరి అభిప్రాయము కాగా "కుంత" అనే ఆయుధమును ధరించుట వలన కుంతీమాధవ స్వామిగా విఖ్యాతినొందెనని మరొక అభిప్రాయము కూడా ఉంది.

ఇక్కడ దత్తాత్రేయుని ఆలయం కూడా విశిష్టమైనదిగా భక్తులు నమ్ముతారు. ఇక్కడి ఔదుంబర వృక్షాన్ని (మేడి చెట్టు) అత్యంత మహిమ కలిగినదిగా విశ్వసిస్తారు. ఈ చెట్టు మొదలున ఉన్న పాదుకలు దత్తాత్రేయుని అవతారాల్లో ఒకటైన శ్రీపాద శ్రీ వల్లభునివని చెబుతారు. పిఠాపురంలో ఆపస్తంభ శాఖీయులైన సుమతీ, రాజశర్మ అను బ్రాహ్మణ దంపతులు ఉండేవారు. వారికి పాదనేత్రములు లేని ఇద్దరు కుమారులుండేవారు. వారి వలన వంశాభివృద్ధి కలుగదు కనుక వారు ఉత్తమమైన సంతతిని కోరి పాదగయా క్షేత్రమున దత్తాత్రేయ స్వామిని సేవించేవారు. ఒక సమయంలో దత్తాత్రేయుడు సుమతికి దర్శనమిచ్చి వరం కోరుకోమనగా స్వామినే తన కుమారునిగా అనుగ్రహించమని కోరెను. అందుకు స్వామి అనుగ్రహించి తానే వారింట శ్రీపాదుడుగా జన్మించాడు. శ్రీపాదుడు సన్యాసం స్వీకరించి తన తల్లి కోరిక మేరకు ఆమె పెద్దకుమారులు ఇరువురిని సంపూర్ణ ఆరోగ్యవంతులుగా అనుగ్రహించి, సుమతిని దుఃఖించవద్దని తనను స్మరించిన వారికి సమస్త సంపదలు, సర్వాభిష్టములు ప్రసాదిస్తానని ఈ క్షేత్రమందు సుమతీదేవికి దర్శనమిచ్చిన రూపమున స్వయంభువుగా వెలసి భక్తకోటిని అనుగ్రహిస్తానని వరమిచ్చి ఉత్తరదిశగా బయలుదేరి అనేక పుణ్యక్షేత్రములు సందర్శించి ఆయా చోట్ల దత్త భక్తి మార్గమును ప్రచారము చేసినారు.

**దర్శన సమయం:**

ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు, సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు,

ఫోన్: 08869-252477, 251445, 9908450979. *Website:* *www.kukkuteswaraswamypadagaya.com*

# సామర్లకోట

## కుమారారామ భీమేశ్వరాలయం

ఆంధ్రప్రదేశ్‌లో ఏకైక యోగలింగంగా, జప,తప,యోగ సాధన చేసేవారికి ప్రశాంతమైన క్షేత్రంగా ప్రసిద్ధి చెందిన పంచారామ క్షేత్రం సామర్లకోట కుమారారామ భీమేశ్వరాలయం... చాళుక్య వంశానికి చెందిన భీమమహారాజు నిర్మించినట్టు చరిత్ర ఆధారంగా తెలుస్తోంది. పంచారామాలుగా ద్రాక్షారామ భీమేశ్వరాలయం, సామర్లకోట కుమారారామ భీమేశ్వరాలయాలు రెండూ ఒకే పోలికలు కలిగి ఉండడం, ఈ క్షేత్రాల్లో శివుడు భీమేశ్వరుడుగా ఆరాధించబడడం చాళుక్య వంశానికి చెందిన భీమ మహారాజు వల్లనేనని తెలుస్తోంది. పురాతన దివ్యక్షేత్రంగా అలరారుతున్న సామర్లకోట కుమారారామ భీమేశ్వరాలయం, రైల్వే స్టేషన్‌కు కిలోమీటరు దూరంలో ఉంది. కుమార స్వామి ప్రతిష్ఠించడం వల్ల ఇక్కడి స్వామిని శ్రీ కుమారారామ భీమేశ్వరస్వామిగా పిలుస్తారు. ఇక్కడి అమ్మవారు శ్రీ బాలాత్రిపుర సుందరీ దేవి.

ఈ ఆలయ నిర్మాణం పరిశీలిస్తే చాళుక్య సంప్రదాయాలు గోచరిస్తాయి. దేవాలయం చుట్టూ 18 అడుగుల ఎత్తు గల ప్రాకారం, దీనికి నాలుగువైపులా అందమైన గోపురాలు ఉన్నాయి. ఆలయానికి తూర్పు ద్వారం వద్ద కోనేరు దాని మధ్యలో ఒక మండపం ఉన్నాయి. ఉత్తరద్వారం గుండా యాత్రికులు లోనికి ప్రవేశిస్తారు. ధ్వజస్తంభం దాటిన తరువాత పెద్ద నంది, ప్రాకారం లోపల అమ్మవారు, సూర్యనారాయణమూర్తి, విఘ్నేశ్వరుడు, సప్తమాతృకలు, దత్తాత్రేయ స్వామి, సరస్వతీదేవి, రామలింగేశ్వరస్వామి, కుమారస్వామి, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి, మహిషాసురమర్దిని, మహావిష్ణువు, లక్ష్మీదేవి, చండీశ్వరి, వీరభద్ర వల్లీ దేవసేనాసమేత సుబ్రహ్మణ్య స్వాముల విగ్రహాలతో ఈ ఆలయం పురాతన వైభవాన్ని చాటుతోంది.















**దర్శన సమయం:**
ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00
సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00

**ఫోన్:** 7396036375, 9000914717.

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 45 కి.మీ. |
| రాజమండ్రి | 52 కి.మీ. |
| కాకినాడ | 15 కి.మీ. |
| అమలాపురం | 71 కి.మీ. |
| రావులపాలెం | 57 కి.మీ. |
| తుని | 60 కి.మీ. |

కాలభైరవస్వామి ఈ ఆలయ క్షేత్రపాలకునిగా ప్రతిష్ఠితమయ్యాడు. ఆలయనిర్మాణ సమయంలో పనిచేసిన శిల్పులకు మజ్జిగ దానం చేస్తూ వారి దాహాన్ని తీర్చిన గొల్లమనిషి సేవకు గుర్తుగా గొల్లస్తంభం, ఆలయం వెలుపల పశ్చిమద్వారం వద్ద సుమారు 50 అడుగుల ఎత్తుతో ఏకశిలాస్తంభంగా శిల్పులు నిర్మించారు. వసంత నవరాత్రులు మొదలు 4 నెలల కాలం సూర్యకిరణాలు ప్రభాత సమయాలలో మూలవిరాట్ నందు, ప్రదోష సమయంలో అమ్మవారి పాదాలపై పడునట్టుగా నిర్మాణం గావించారు. ప్రతీ ఏటా మహాశివరాత్రి పర్వదినాలతో పాటు కార్తీకమాసం ఉత్సవాలు, దేవీ శరన్నవరాత్రి ఉత్సవాలు, భీమేశ్వరుని జన్మదినం వంటి పూజలతో ఈ పంచారామం విరాజిల్లుతోంది.

## కంచి మహాసంస్థానం

సామర్లకోట-పెద్దాపురం రోడ్డులో అతి ఎత్తయిన ప్రసన్నాంజనేయ స్వామి విగ్రహం రాష్ట్రంలోనే ప్రఖ్యాతి గాంచినది. కంచి కామకోటి పీఠాధిపతి శంకరాచార్యుల దివ్యాశీస్సులతో స్వామీజీ అనుంగు శిష్యులు చంద్రాభట్ల చింతామణి గణపతిశాస్త్రి 1986లో ఈ విగ్రహ నిర్మాణాన్ని చేపట్టారు. శిల్పకళాచాతుర్యంలో దేశంలోనే ప్రఖ్యాతి గాంచిన తోగు లక్ష్మణస్వామి ఆధ్వర్యంలో శరవేగంతో నిర్మించిన ఈ ప్రసన్నాంజనేయ స్వామి విగ్రహాన్ని 1989 జూన్‌లో కంచి పీఠాధిపతి జయేంద్ర సరస్వతి చేతుల మీదుగా ఆవిష్కరించారు. ఇక్కడే సిద్ధి వినాయకుని ఆలయం, ఆంజనేయ స్వామి ఆలయాలతో పాటు స్వయంవర పార్వతి అమ్మవారి ఆలయం, శంకరాచార్య విగ్రహాలను నిర్మించడంతో ఇది కంచి మహాసంస్థానంగా రూపాంతరం చెందింది. ప్రతి ఏటా మే లో జరిగే హనుమజ్జయంతి, డిసెంబరులో జరిగే హనుమద్వ్రతం ఉత్సవాలకు దేశ నలుమూలల నుంచి వందలాది భక్తులు హాజరై పూజలు నిర్వహిస్తుంటారు. ఇంకా వినాయకచవితి, దేవీ నవరాత్రులు, దత్తాత్రేయ జయంతి, శంకరాచార్య జయంతి, త్యాగరాజు ఆరాధనోత్సవాలు, వేదస్వస్తి వంటి కార్యక్రమాలు ఘనంగా నిర్వహిస్తారు.



# సర్పవరం

సర్పవరం కాకినాడ పట్టణానికి సుమారు 6 కి॥మీ॥ దూరంలోనూ, సామర్లకోట రైల్వే జంక్షన్‌కు 8 కి॥మీ॥ దూరంలోనూ ఉంది. సామర్లకోట-కాకినాడ ప్రధాన రహదారిలోని మాధవపట్నం మీదుగా సర్పవరం చేరుకోవచ్చు. ఇక్కడ పురాతన విష్ణుక్షేత్రమైన భావన్నారాయణస్వామి ఆలయం ఉంది. అంతే గాక సర్పవరం మామిడితాండ్ర తయారీ కేంద్రంగా కూడా సుపరిచితమే.

జిల్లాలోని అతి పురాతన విష్ణు క్షేత్రాలలో సర్పవరం భావన్నారాయణస్వామి ఆలయం ఒకటి. క్రీ॥పూ॥ 4వ శతాబ్దంలో ఈ ఆలయాన్ని నిర్మించినట్టు ప్రతీతి. భావన్నారాయణ స్వామి కలియుగం ప్రారంభంలో (సుమారు 5 వేల సంవత్సరాల క్రితం) జన్మించినట్టు పురాణ ప్రశస్తి. రాజ్యలక్ష్మి సమేత

**దర్శన సమయం:**
ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు
సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు
**ఫోన్:** 9849157693.

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 56 కి.మీ. |
| రాజమండ్రి | 60 కి.మీ. |
| కాకినాడ | 6 కి.మీ. |
| అమలాపురం | 65 కి.మీ. |
| రావులపాలెం | 66 కి.మీ. |
| తుని | 62 కి.మీ. |





భావన్నారాయణ స్వామి ఆలయాన్ని ఈ ప్రాంతాన్ని పాలించిన అనేక రాజవంశీయులు అభివృద్ధి చేసినట్టు చారిత్రక ఆధారాలను బట్టి తెలుస్తుంది. సుమారు 4 ఎకరాల ప్రాంగణంలో ఈ ఆలయం విస్తరించి ఉంది. ఏకశిలతో నిర్మించిన ప్రాకారాలు, ఉత్తరాన గాలిగోపురం (8 అంతస్తులు), తూర్పున సింహద్వారం ఉన్నాయి. ఉత్తరాన కల్యాణ మండపం, తూర్పున ధ్వజస్తంభం, పైన ఒకవైపు గరుడ వాహనం, మరోవైపు ఆంజనేయస్వామి శిలావిగ్రహం నిర్మితమయ్యాయి. ఆలయం లోపల ఈశాన్యంలో శ్రీలక్ష్మి అమ్మవారి (గోదాదేవి)ని వ్యాస మహర్షి ప్రతిష్ఠించారు. ఆగ్నేయంలో మూలభావన్నారాయణస్వామిని అనంతుడు (సర్పం) ప్రతిష్ఠించినట్టు పురాణాలు చెబుతున్నాయి. అశ్వీరాథులను పిఠాపురం మహారాజా హయాంలో ప్రతిష్ఠించారు. ఆలయానికి ఉత్తరం వైపున రెండు సరస్సులున్నాయి. ఒక సరస్సు నాదకుండంగా, మరొకటి ముక్తికా సరస్సుగా విరాజిల్లుతున్నాయి.

పూర్వం కశ్యప, కద్రువ సర్పరూప సంతానం తల్లిచే శాపగ్రస్తులై అగ్నికి ఆహుతయ్యే సమయంలో అనంతుడు అనే సర్పం మోక్షప్రాప్తికై ఇక్కడ ఘోర తపస్సు చేసింది. తపస్సుకు మెచ్చి మహావిష్ణువు ప్రత్యక్ష మయ్యాడు. అప్పటి నుండి ఈ ప్రాంతం సర్పవరంగా పిలవబడుతోంది. విష్ణుమాయను తెలుసుకునే అన్వేషణలో అనేక ఇబ్బందులకు గురైన నారదమహర్షి, వాటి నుండి తప్పించుకునేందుకు రాజ్యలక్ష్మి సమేత భావన్నారాయణస్వామిని ప్రతిష్ఠించినట్టు పురాణాలు చెబుతున్నాయి. ఈ ఆలయ గోపురం మీద అద్భుత శిల్పకళాచాతుర్యం చూపరులను ఆకట్టుకుంటోంది. గోపురం చుట్టూ ప్రతి అంతస్తుకు అనేక శిల్పాలు, భంగిమలు చెక్కబడి ఉన్నాయి.



# గొల్లలమామిడాడ

ఊరి పేర్లతో ఇంటి పేర్లు, కులం పేరుతో పేటలు ఉండడం సహజమే. కానీ కులం పేరుతో ఏకంగా ఊరే విస్తరిస్తే మాత్రం అది ఆసక్తికరమే. అటువంటి ఆసక్తిని రేకెత్తించే పల్లె పెదపూడి మండలంలోని 'గొల్లలమామిడాడ'. ఒకప్పుడు ఈ ప్రాంతంలోని మామిడితోపులను నివాసాలుగా చేసుకుని గొల్ల కులస్థులు ఎక్కువగా ఉండడంతో ఈ ప్రాంతానికి ఆ పేరు వచ్చింది. ప్రసిద్ధి చెందిన సూర్యనారాయణ స్వామి, కోదండరామస్వామి ఆలయాలు ఈ ఊరికి ఎంతో వన్నె తీసుకుని వచ్చాయి.

గ్రామంలో తూర్పు, పశ్చిమ దిక్కులలో ఉన్న శ్రీకోదండరామ చంద్రమూర్తి వారి గోపురాలు గ్రామానికి రెండు ఆభరణాలుగా రూపుదిద్దుకొన్నాయి. తూర్పుగోపురం 9 అంతస్తులతో 160 అడుగుల ఎత్తు, పశ్చిమ గోపురం 11 అంతస్తులతో సుమారు 200 అడుగుల ఎత్తు కలిగి ఆకాశాన్ని తాకుతున్న భ్రాంతి కలిగిస్తాయి. పశ్చిమ గోపురం చివరి అంతస్తు ఎక్కితే 25 కి॥మీ॥ దూరంలో ఉన్న పెద్దాపురం పట్టణంలోని పాండవుల మెట్ట, 20 కి॥మీ॥ దూరంలో ఉన్న కాకినాడ పట్టణం తదితర ప్రాంతాలు కనిపిస్తాయి. ఈ గాలి గోపురాలు రెండూ గొల్లల మామిడాడ చుట్టూ 10 కి॥మీ॥ దూరం వరకు ఎంతో స్పష్టంగా కనిపిస్తాయి. ఈ రెండు గోపురాలపైన రామాయణ, మహాభారత, భాగవత కథా శిల్పాలు ఎంతో అపురూపంగా చెక్కబడి చూచేవారికి ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. అంతే కాకుండా ఆలయ శిఖరం (విమాన గోపురం) మీద బాలరామాయణం గాథను తెలిపే బొమ్మలు చెక్కబడి ఉన్నాయి. భక్తులు స్నానాలాచరించడానికి దేవాలయానికి సుమారు 200 మీ॥ దూరంలో శ్రీరామ పుష్కరిణి ఏర్పాటు చేసారు. పుష్కరిణి మధ్యలో ఒక మండపాన్ని కూడా నిర్మించారు. ఈ పుష్కరిణిలో ప్రతి సంవత్సరం స్వామి వారి వసంతోత్సవ సమయాన చక్రస్నానం, క్షీరాబ్ది ద్వాదశినాడు 'ఉడుపోత్సవం' (తెప్పతిరునాళ్ళు) అత్యంత వైభవంగా నిర్వహిస్తారు.

ఈ ఆలయానికి అద్దాల శయనమందిరం మరో అదనపు ఆకర్షణ. అద్దాలతో నిర్మించిన ఈ మందిరం మయసభను తలపిస్తుంది. 64 స్తంభాలతో పుష్పకమను పేరున నిర్మించిన మండపం మీద దీనిని నిర్మించారు. ఈ మందిరం చుట్టూ మొత్తం రామాయణం అంతా 20 తైలవర్ణ చిత్రాలుగా ఎంతో ఆకర్షణీయంగా అమర్చి ఉంటాయి. ప్రతి సంవత్సరం జరిగే శ్రీరామనవమి మహోత్సవాలకు లక్షలాది మంది భక్తులు ఈ దేవాలయాన్ని సందర్శించడానికి రాష్ట్రం నలుమూలల నుంచి వస్తుంటారు.

## కుక్కల నారాయణ

ఈ ఊళ్లోనే ఒక సిద్ధపురుషుడు కూడా నివాసం ఉండేవాడు. ధవళేశ్వరం నుంచి వచ్చి ఇక్కడ స్థిరపడినట్లుగా చరిత్ర ఉంది. 19వ శతాబ్దం ప్రారంభంలో 'కుక్కల నారాయణ స్వామి' పేరుతో సంచరించేవాడు. తరువాతి కాలంలో ఆయన్ను జైజై నారాయణస్వామిగా కొలుస్తున్నారు. ఆయన నోటివెంట ఏ విషయం పలికితే అది తప్పకుండా జరిగేదని గ్రామస్థుల నమ్మకం. 1927 ప్రాంతంలో ఓ సమస్య నిమిత్తం జిల్లాకలెక్టర్ స్వామిని కలవగా, నీ కోరిక నెరవేరదు, అంతేకాదు నీకు మరిన్ని కష్టాలు రానున్నాయని చెప్పారట. కొద్ది రోజులకు ఆ కలెక్టర్‌ను బ్రిటిష్ ప్రభుత్వం అభిశంసించింది. స్వామి సజీవసమాధి పొందిన



ప్రాంతంలో ఆలయాన్ని నిర్మించిన ఓ కుటుంబం, ఇప్పటికీ ఆయన నామస్మరణతో తరిస్తోంది. షిర్డీసాయిబాబా, మెహర్‌బాబా, రాఘవేంద్రస్వామి, వీరబ్రహ్మేంద్రస్వామి వంటి సిద్ధులు దేశంలో 18మంది ఉండగా, వారిలో కుక్కల నారాయణ స్వామి కూడా ఒకరని ప్రతీతి. ఈ స్వామిది అఘోరీ మతము. కుక్కలను ప్రేమిస్తూ వాటితోటే సహజీవనం చేస్తూ శ్మశానంలో నిద్రిస్తూ ఉండడమే నిత్యకృత్యంగా సాగించేవారు. ఆశ్రమంలో పూజలు అందుకునే ప్రాంతంలోనే ఆయన సజీవ సమాధి అయినట్టు చెబుతారు.



## సూర్య దేవాలయం

సూర్యుని దేవాలయాలు భారతదేశంలో అరుదు. ఒరిస్సాలోని కోణార్క్‌లో సూర్యదేవాలయంతో పాటు, మన రాష్ట్రంలోని అరసవిల్లి సూర్యదేవాలయం ప్రఖ్యాతి గాంచింది. తర్వాత గొల్లలమామిడాడ సూర్యదేవాలయం కూడా ఎంతో ప్రఖ్యాతి గాంచింది. 1902వ సంవత్సరములో ఈ దేవాలయంలో విగ్రహప్రతిష్ఠ జరిగింది. విగ్రహ ప్రతిష్ఠ అనంతరం 1905లో రాతి కళ్యాణమండపం, 1932లో ముఖ మండపం, 1944లో తూర్పుగోపురం, 1947లో కళ్యాణ మండపాలను నిర్మించారు. దేవాలయానికి నాలుగు వైపులా నాలుగు గోపురాలు నిర్మించారు. తూర్పువైపు గోపురం 100 అడుగుల ఎత్తుతో ప్రజలను ఆకర్షిస్తూ ఉంటుంది. కాగా ప్రతీ సంవత్సరం ఫిబ్రవరి నెలలో జరిగే భీష్మ ఏకాదశి ఉత్సవాలను ఎంతో ప్రతిష్ఠాత్మకంగా నిర్వహిస్తుంటారు.

**దర్శన సమయం:**
ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు
సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు
ఫోన్: 9849292900.

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 60 కి.మీ. |
| రాజమండ్రి | 42 కి.మీ. |
| కాకినాడ | 23 కి.మీ. |
| అమలాపురం | 46 కి.మీ. |
| రావులపాలెం | 43 కి.మీ. |
| తుని | 86 కి.మీ. |



# కోరింగ

తూర్పుగోదావరిజిల్లా తాళ్ళరేవు మండలం, కోరంగి పేరు చెప్పగానే చప్పున స్ఫురించేది కోరంగి అభయారణ్యం. అద్వితీయమైన ఈ అభయారణ్యం దేశంలోనే 2వ స్థానాన్ని ఆక్రమించింది. కాకినాడ సమీపంలో ఉన్న ఈ మడ అడవులను కోరంగి అభయారణ్యంగా అటవీశాఖ 1978లో ప్రకటించింది. ఈ అభయారణ్యంలో ఉన్న 'నీటిపిల్లి' అనే వన్యప్రాణికి ఎటువంటి హాని కలగకుండా సంరక్షిస్తున్నారు. కోరంగి అభయారణ్యంలో దాదాపు 34 జాతులకు సంబంధించిన మొక్కలున్నట్లు శాస్త్రవేత్తలు గుర్తించారు. అంతేకాకుండా వనమూలికా వైద్యానికి ఉపయోగపడే విలువైన వృక్షజాతి మొక్కలు కూడా వున్నట్లు గుర్తించారు. అదేవిధంగా అసంఖ్యాక పక్షిజాతులకు కోరంగి అభయారణ్యం నెలవుగా వుంది. కోరంగి అభయారణ్యం ప్రకృతి అందాలకు అలవాలం. బ్రిటిష్ కాలంలో నిర్మించిన లైట్‌హౌస్‌ను ఈ ప్రాంతంలో చూడవచ్చు.



నదీ తీరాల వెంబడి దట్టంగా, విస్తారంగా పెరిగే మడ అడవులు తీరప్రాంతాల పరిరక్షణకు పెట్టని గోడలు. మానవులు ఏమాత్రం శ్రమచేయకుండా పెరిగిన ఈ అడవులు జీవకోటికి ఎన్నో విధాలుగా మేలు చేస్తున్నాయి. పచ్చదనంతో, ప్రకృతి రమణీయకతతో కనువిందు చేస్తూ, ఆహ్లాదకరమైన వాతావరణాన్ని అందిస్తూ పర్యావరణ పరిరక్షణకు దోహదపడడమే కాకుండా తుఫాన్లు, వరదలు వంటి ప్రకృతి వైపరీత్యాల సమయంలో తీరప్రాంతాలు కోతకు గురికాకుండా భూపరిరక్షణకు ఉపయోగ పడుతున్నాయి. అంతే కాకుండా వన్యప్రాణుల పరిరక్షణకు మడ అడవులు కేంద్రాలుగా నిలుస్తున్నాయి. ఈ అడవులు సందర్శించాలంటే కాకినాడ - యానాం జాతీయ రహదారికి చేర్చివున్న చొల్లంగి, మట్లపాలెం, రామన్నపాలెం మీదుగా చేరవచ్చు. సందర్శకులు, యాత్రికులు, పర్యాటకులు ప్రత్యక్షంగా చూసేందుకు వీలుగా బోటు సదుపాయం, అదేవిధంగా అడవిలోని 200 మీ పొడవైన 'కాలిబాట చెక్క వంతెన' నిర్మించారు.







**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 75 కి.మీ. |
| రాజమండ్రి | 82 కి.మీ. |
| కాకినాడ | 17 కి.మీ. |
| అమలాపురం | 43 కి.మీ. |
| రావులపాలెం | 63 కి.మీ. |
| తుని | 83 కి.మీ. |







గోదావరి తీరాన మడ అడవుల సోయగాలను పర్యాటకుల ముందు ఆవిష్కరించడానికి అనేక సౌకర్యాలు అందుబాటులో ఉన్నాయి. కేరళ అందాలకు ఏమాత్రం తీసిపోని ప్రకృతి సోయగాలు కోనసీమ సొంతం. ఈ అద్భుతాలను ప్రజల ముందుకు తీసుకొచ్చేందుకు కోనసీమ టూరిజం పేరుతో ఓ ప్రైవేటు సంస్థ నదీపాయల నడుమ... సముద్ర తీరం వెంబడి ఉన్న మడ అడవుల అందాలను ఆస్వాదించేందుకు 'గోదావరి సాగరసంగమ యాత్ర' పేరుతో ప్రత్యేక ప్యాకేజీ అందుబాటులోకి తెచ్చింది. మడఅడవులు, తీరప్రాంత గ్రామాల సందర్శన, సంగమ ప్రాంతాల సందర్శన ఈ యాత్ర లక్ష్యం. ఉదయం నుంచి సాయంత్రం వరకూ 30 కిలోమీటర్ల మేర మడ అడవుల నడుమ ఇమిడిన జలమార్గంలో 'శుద్ధసావేరీ క్రూయిజ్' పేరుతో ఉన్న భారీబోటు విహరిస్తుంది. ఈ బోట్‌లో సకల సౌకర్యాలు ఉన్నాయి. 110 మంది కూర్చుని ప్రకృతి అందాలను ఆస్వాదించే విధంగా పలు హంగులతో ఒక హాలు, భోజన టేబుళ్ళు, ఓ ఖరీదైన బెడ్‌రూమ్, బోటు కింద సెంట్రల్‌హాలు మొదలైన సౌకర్యాలతో ఈ బోటు అందుబాటులో ఉంది.

గోదావరి తీరప్రాంత గ్రామాల సందర్శనతో పాటు గాడిమొగ రిలయన్స్ ప్రాజెక్ట్ వెనుక నుంచి కోరంగి అభయారణ్యం, చరిత్ర ప్రసిద్ధికెక్కిన మడఅడవుల మీదుగా ఈ యాత్ర సాగుతుంది. సుమారు ఎనిమిది గంటలపాటు నదీపాయలు, మడఅడవుల మధ్య ఎంతో ఉత్సాహంగా, ఉల్లాసంగా సాగే ఈ యాత్రలో ఎన్నో ప్రకృతి సిద్ధమైన అందాలు పర్యాటకులను మంత్రముగ్ధులను చేస్తాయి. గౌతమీ నది సంగమ ప్రాంతమైన బ్రహ్మసమేథ్యం సమీపంలో ప్రత్యేకంగా ఏర్పడ్డ వందల ఎకరాల దీవిలో పర్యాటకుల విహారం ఎన్నో అనుభూతులను మిగులుస్తుంది. నలుదిశలా నదులు, సముద్రం మధ్య దీవిలా ఉన్న ఆ ప్రాంతంలో సావేరీ బోటు ద్వారా వెళ్ళే పర్యాటకులకు సంగమ ప్రాంతం ఎంతో ఆనందాన్ని మిగులుస్తుంది. ముఖ్యంగా విదేశీ పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తుంది.



# యానాం

వృద్ధగౌతమీ గోదావరి అందాలు... కనుచూపు మేరలో కదలాడే కోనసీమ కొబ్బరిచెట్లతో యానాం అద్భుత పర్యాటక కేంద్రంగా విరాజిల్లుతోంది. నిండు గోదారి చెప్పే కమ్మటి ఊసుల్ని ఆస్వాదించేందుకు సందర్శకులు తరలివస్తారు. కోస్తా జిల్లాల్లో ప్రముఖ పర్యాటక కేంద్రంగా ఎదిగిన యానాం చుట్టూ ఉన్న ప్రకృతి వనరులను అత్యంత సుందరంగా తీర్చిదిద్ది పర్యాటకులను ఆకర్షించడం ద్వారా ప్రముఖ పర్యాటక కేంద్రంగా నిలిచింది. సుమారు 15 కి॥మీ॥ పరవళ్ళు తొక్కుతూ ప్రవహించి సముద్రంలో సంగమించే గౌతమీ గోదావరి తీరంలో హైదరాబాద్‌లోని ట్యాంక్‌బండ్‌ను తలపించేలా మహనీయుల విగ్రహాలను ప్రతిష్టించారు. అలాగే మతసామరస్యం పెంపొందిస్తూ మహా శివ లింగానికి ఏనుగుల జలాభిషేకం, శివస్నానఘట్టం, నాగూరు




మీరా సాహెబ్ దర్గా, అతి పెద్ద భరతమాత విగ్రహం, బ్రెజిల్‌లోని అతి పెద్ద ఏసుక్రీస్తు విగ్రహాన్ని తలపించే యానాం మౌంట్ ఆఫ్ క్రైస్ట్‌లను ఏర్పాటు చేసారు. ఫెర్రీ రోడ్డు నుండి బాలయోగి వారధివైపు నది ఒడ్డున సందర్శకులు కూర్చుని సేద తీరే విధంగా గ్రానైట్ స్టోన్ బల్లలు, బెంచీలు ఏర్పాటు చేశారు. ఫ్లాట్‌ఫాంపై టైల్స్, ఫ్లాట్‌ఫాంకు రహదారికి మధ్యన మొక్కలతో లాన్ మరియు విద్యుద్దీపాలంకరణ ఎంతగానో ఆకర్షిస్తాయి. ఇంకా యానాంలోని పురాతన రోమన్ కేథలిక్ చర్చి, అంబేద్కర్‌నగర్‌లో నిర్మించిన బుద్ధ ఉద్యానవనం, తదితర ప్రాంతాలన్నీ పర్యాటకులకు మధురానుభూతుల్ని మిగిల్చేవే. ఆధ్యాత్మిక ప్రత్యేకతను సంతరించుకున్న యానాంలో రెడ్డిరాజుల కాలంనాటి వేంకటేశ్వరస్వామి ఆలయం, పిల్ల రాముడిగా ప్రసిద్ధిగాంచిన గణేష్ ఆలయం, శివాలయంతో పాటు ఫ్రెంచివారి పాలనలో నిర్మించిన మేరీమాత ఆలయం ఆధ్యాత్మికతకు నిలయాలుగా నిలుస్తాయి.



### ఎంత దూరం...

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 88 కి.మీ. |
| రాజమండ్రి | 65 కి.మీ. |
| కాకినాడ | 30 కి.మీ. |
| అమలాపురం | 31 కి.మీ. |
| రావులపాలెం | 52 కి.మీ. |
| తుని | 95 కి.మీ. |

**ఫోన్:** 0884-2321197 (అతిథి గృహం)















పెద్దాపురం నుండి వివిధ ప్రధాన నగరాలకు గల దూరం

| | |
|---|---|
| న్యూఢిల్లీ | 1796 కి.మీ. |
| ముంబయి | 1157 కి.మీ. |
| కోల్‌కత్తా | 1025 కి.మీ. |
| చెన్నై | 662 కి.మీ. |
| హైదరాబాద్ | 442 కి.మీ. |
| విజయవాడ | 201 కి.మీ. |
| విశాఖపట్నం | 156 కి.మీ. |

# పెద్దాపురం
## డివిజన్



### పెద్దాపురం డివిజన్‌లోని దర్శనీయ ప్రదేశాలు

- పెద్దాపురం
- తొలి తిరుపతి
- అన్నవరం
- శాంతిఆశ్రమం
- ఆంధ్రాశబరిమలై
- లోవ



# పెద్దాపురం

పాండవులమెట్ట అనిర్వచనీయ అనుభూతికి ఆటపట్టు. అనేక చారిత్రక ఆనవాళ్ళకు ఇది నెలవు. ద్వాపరం నాటి చారిత్రకచిహ్నాలుగా చూపే శిథిలాల ప్రామాణికత, ఆధారాలను పక్కన పెడితే, ఈ కొండ వీక్షణం అపూర్వ అనుభవమే! ఇక్కడి దృశ్యాలు, స్థల పురాణాలు మనల్ని గత యుగాల్లో విహరింప జేస్తాయి. పెద్దాపురంలోని పాండవులమెట్ట పర్యాటకులకు సరికొత్త ఉత్సాహాన్ని కలిగిస్తుంది. ఈ మెట్టపై పాండవులతో ముడిపడిన అనేక ఆనవాళ్లు కనబడతాయి. పాండవులు వనవాసంలో కొంత కాలం ఈ మెట్టపై నివాసం ఉండటం వలననే ఈ కొండకు పాండవుల మెట్ట అనే పేరు వచ్చిందని నమ్మకం.

పాండవుల మెట్టపై భీముడి పాదాలు, గద ఉంచిన ఆనవాలు, భీముడు వంటచేసిన పాకశాల, ద్రౌపది నెలసరి సమయంలో విశ్రాంతి తీసుకున్న ప్రాంతం (ద్రౌపది చాప), పాండవులు ఏర్పాటు చేసుకున్న సొరంగం, స్వయంభువుగా వెలసిన సూర్యనారాయణ మూర్తి గుడి, సుబ్రహ్మణ్యేశ్వరా లయం, నవగ్రహమండపం, కృష్ణాలయం, శివాలయం, వేంకటేశ్వర, గాయత్రి ఆలయాలు ఉన్నాయి. కొండపై పడమర వైపు భీముని పాదాలు, గద ఆన్చిన గుర్తులున్న చోటే ఈ కొండను పాలించే కొండదేవత 'హిడింబి' ఆలయం కూడా ఉంది. మెట్టపై ఉన్న గుహ నుండి రాజమండ్రి వరకూ సొరంగ మార్గం ఉండేదని పెద్దల మాట. ద్రౌపది, పాండు పుత్రులు సహా అందరూ స్నానమా చరించేందుకు ఈ మార్గం గుండానే రాజమండ్రి వెళ్ళేవారట. యుక్త వయస్సు వచ్చినా రజస్వల కాకుంటే ఇక్కడ ఉన్న ద్రౌపది చాపపై కూర్చో బెట్టడం ఆచారం.

జిల్లాలోనే పురాతనమైన శ్రీశ్రీశ్రీ ఛాయా పద్మిని ప్రభాప్రజ్ఞాదేవి సమేత శ్రీ సూర్య నారాయణమూర్తి ఆలయం ఉంది. సూర్యనారాయణ స్వామి స్వయం భువుగా వెలిశారు. 1952లో పాలూరి వెంకటసుబ్బారావు అనే వ్యక్తికి పంచలోహ విగ్రహాలు లభ్యమవడంతో దేవాలయం నిర్మించారని చెబుతారు. ఈ దేవాలయం తో పాటు చంద్రుని దేవాలయం, శివాలయం, వినాయకుడు, గాయత్రీదేవి, శనీశ్వరుడు, కృష్ణుడు, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి, దేవాలయాలు కొండపై ఉన్నాయి. ఒకేచోట ఇన్ని ఆలయాలు ఉండడం అరుదు. ప్రతీ ఏడాది మాఘమాసంలో ఏడు రోజుల పాటు మెట్టపై రథసప్తమి ఘనంగా నిర్వహిస్తారు. ప్రతీ సంవత్సరం మూడు నెలల పాటు మెట్టపై సూర్యనారాయణ స్వామి దేవాలయంలో సుమారు 50 వివాహాలు జరుగుతుం టాయి. ఆరు దశాబ్దాలుగా వంగూరి కుటుంబీకులు ఈ ఆలయాల ఆలనా, పాలనా చూస్తున్నారు.



### ఎంత దూరం...

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 40 కి.మీ. |
| రాజమండ్రి | 46 కి.మీ. |
| కాకినాడ | 23 కి.మీ. |
| అమలాపురం | 73 కి.మీ. |
| రావులపాలెం | 64 కి.మీ. |
| తుని | 95 కి.మీ. |







# తొలితిరుపతి

వేల సంవత్సరాల చరిత్ర కలిగిన ఈ ఊరి గురించి నేటి తరం వారికి తెలియకపోవచ్చు. కానీ 'తొలి తిరుపతి'గా ప్రసిద్ధికెక్కిన దీన్ని చరిత్ర ఎప్పుడో తనలో పదిలంగా దాచుకుంది. సామర్లకోట-ప్రత్తిపాడు దారిలో పెద్దాపురం మండలం దివిలి గ్రామానికి రెండు కిలోమీటర్ల దూరంలో ఏలేరు నది ఒడ్డున ఉందీ గ్రామం. దీని చరిత్ర మొత్తం ఇక్కడ వెలిసిన శ్రీ భూసమేత శృంగార వల్లభస్వామి ఆలయంతో ముడిపడి ఉంది. ఒక రకంగా చెప్పాలంటే ఈ అత్యంత పురాతన దేవాలయ చరిత్రే ఊరి చరిత్ర. ప్రముఖ పుణ్యక్షేత్రాలైన సింహాచలం 8 వేల సంవత్సరాలు, తిరుమల తిరుపతి 6,700 సంవత్సరాల ప్రాచీనమైనవి కాగా, ఈ 'తొలి తిరుపతి' చరిత్ర మాత్రం 9వేల సంవత్సరాల నాటిది. ఈ విషయాన్ని 'చాతావళి' అనే సంస్కృత గ్రంథంలో కూడా పేర్కొన్నారు. ఇదే విషయాన్ని పురావస్తుశాఖ తమ పరిశోధనల్లో కనుగొనడం విశేషం. దేశవ్యాప్తంగా మొత్తం 108 తిరుపతులు ఉండగా, వాటిలో ఈ 'తిరుపతి'దే తొలి స్థానం. సింహాచలం, పెద్ద తిరుపతి, యాదగిరి గుట్ట మిగిలిన వరుస క్రమంలో వస్తాయి. ప్రచారం లేకపోతే ఎంతటి గొప్ప చరిత్రయినా మరుగున పడుతుందనే నగ్న సత్యానికి ప్రత్యక్ష నిదర్శనం ఈ ఊరు.

ఇక్కడ స్వామి ముఖం చిరు మందహాసంతో ఉంటుంది. స్వామి వక్షస్థలంపై లక్ష్మీదేవి స్థిరనివాసం ఉండడం, ఇతర స్వాముల విగ్రహాలకు భిన్నంగా ఎడమ చేతిలో చక్రం, కుడిచేతిలో శంఖం ఉండడం విశేషం. ఇక స్వామి చేతుల్లో 12 సూర్యుల తేజస్సుకు సమానమైన తామర పుష్పం భాసిస్తుంది. ఈ తరహా పుష్పం తిరుమల శ్రీ వేంకటేశ్వరుని చేతిలోనూ, సింహాచలం నరసింహస్వామి చేతిలోనూ ఉన్నట్టు చెబుతారు. తనను దర్శించే భక్తుల ఎత్తులోనే స్వామి కనబడతారని చెపుతారు. దీనికి సంబంధించి ఆసక్తికరమైన కథ ఒకటి ఉంది. సవతి తల్లి వల్ల అవమానం పాలై, తండ్రి ప్రేమకు నోచుకోని బాలుడైన ధ్రువుడు మహావిష్ణువు కోసం తపస్సుకు ఉపక్రమించాడు. ఆ బాలుడి తపస్సుకు మెచ్చి దర్శనమిచ్చిన స్వామి రూపాన్ని చూసి ధ్రువుడు భయపడ్డాడు. చేతిలో ఉన్న శంఖు, చక్రాలను మార్చుకుని బాలుడి స్థాయికి వచ్చి చెక్కిళ్ళు పట్టి విష్ణువు దగ్గరకు తీసుకున్నాడని కథనం. అప్పటి నుంచి స్వామి తనను దర్శించే వారి ఎత్తులోనే కనిపిస్తారని ప్రతీతి.

ఆలయ నిర్మాణశైలిని పరికించి చూస్తే 12 కాళ్ళ ప్రధాన మండపం, 52 అడుగుల ధ్వజస్తంభం, సభామండపం, అంతరాలయం, గర్భాలయం ఉంటాయి. ఈ ఆలయం మాదిరిగానే పెద్ద తిరుపతికి కూడా ఏడు ద్వారాలు ఉండడం విశేషం. ఆలయంలో మొత్తం 34 స్తంభాలుంటే కేవలం రెండు స్తంభాలు మాత్రం ఒకేలా ఉంటాయి. సభామండపంలోకి అడుగు పెట్టే ముందు నేలపై నిర్మించిన పద్మం, దానినే పై నుంచి చూస్తూ మరో పద్మం ఉండేది. కానీ దీనిలో అంతరార్థమేదో ఉందని, కింది పద్మగర్భంలో నిధి, నిక్షేపాలుం టాయిని చాలా ఏళ్ళ క్రితం దొంగలు తవ్వి పాడుచేశారు.

ఆలయానికి ఆగ్నేయ మూలగా చతురస్రాకారంలో ఉన్న బావిని బొడ్డుబావిగా పిలుస్తారు. నేలబారుగా ఉన్న ఈ బావిని చుట్టూ రాళ్ళు పేర్చి నిర్మించడం వింత గొలుపుతుంది. కార్తీకమాసంలో ఈ బావి నీటితో స్నానం చేస్తే సంతానం లేని వారికి సంతానభాగ్యం కలుగుతుందని భక్తుల నమ్మకం. కార్తీక పౌర్ణమి నాడయితే మరింత ప్రాశస్త్యమని భక్తుల నమ్మిక. అది కూడా ఆలయ అర్చకుల చేతుల మీదుగా నీరు తోడించుకుని స్నానం చేస్తారు. మిగిలిన చైత్రం, శ్రావణ, ధనుర్మాసాల్లో భక్తులే స్వయంగా స్నానం చేస్తారు. ఇక ఆలయ వింతల్లోకి వెడితే ఇది మూడు క్షేత్రాల మహాక్షేత్రంగా వినుతికెక్కింది. ప్రధానంగా ఇది స్వయం సిద్ధ క్షేత్రం. నారద మునీంద్రుడు ఇక్కడ లక్ష్మీదేవిని ప్రతిష్ఠించడంతో దివ్యక్షేత్రమవగా, శ్రీకృష్ణదేవరాయలచే గోదాదేవి ప్రతిష్ఠ జరగడంతో రాజక్షేత్రంగా, వెరసి మహాక్షేత్రంగా మారింది. వేల సంవత్సరాల నిర్మాణం కావడంతో ప్రస్తుతం ఆలయం పూర్తి జీర్ణావస్థలో ఉంది. ఢిల్లీ నుంచి వచ్చిన బృందంలో ఒక వృద్ధ పండితుడు దేవనాగరి లిపిలో ఉన్న శాసనాలను అధ్యయనం చేసి అయ్యప్ప అనే మౌర్య చక్రవర్తి పన్నెండుమంది ఆళ్వార్లను ప్రతిష్ఠించినట్లు ధ్రువీకరించారు.

**దర్శన సమయం:** ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు, సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు,
**ఫోన్:** 08852-247483, 9989078026.

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 55 కి.మీ. |
| రాజమండ్రి | 61 కి.మీ. |
| కాకినాడ | 25 కి.మీ. |
| అమలాపురం | 79 కి.మీ. |
| రావులపాలెం | 68 కి.మీ. |
| తుని | 58 కి.మీ. |






# అన్నవరం







రాష్ట్రంలోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రాల్లో అన్నవరం ఒకటి. రత్నగిరి కొండపై హరిహర హిరణ్యగర్భ త్రిమూర్త్యాత్మక స్వరూపుడిగా అనంతలక్ష్మీ సత్యవతీదేవితో కలిసి శ్రీ సత్యదేవుడు వెలిసి ఉన్నాడు. ఖరనామ సంవత్సర శ్రావణ శుద్ధ విదియనాడు స్వామి శంఖవరం మండలం, అన్నవరం గ్రామంలో పంపా నదీ తీరాన రత్నగిరిపై అంకుడు చెట్టు కింద దర్శనమిచ్చారు. నాటి నుండి నేటి వరకు ఈ ఆలయం దినదిన ప్రవర్ధమానమై, ప్రతి ఇంటా కోరిన వరాలిచ్చే కొండంత దేవుడిగా శ్రీ సత్యదేవుడు ప్రసిద్ధి పొందాడు. 125 ఏళ్ళ చరిత్ర కలిగిన ఈ ఆలయం ఖరనామ సంవత్సర శ్రావణ శుద్ధ విదియ 1891 ఆగష్టు 6వ తేదీన నిర్మించబడింది. బ్రిటిష్ కాలంలో అన్నవరం గ్రామం కిర్లంపూడి సంస్థానాదీశుల చేతిలో ఉండేది. అప్పటి జమిందారు రాజా ఇనుగంటి వేంకట రామరాయణం బహద్దూర్‌కి, అన్నవరం గ్రామస్థుడు ఈరంకి ప్రకాశరావుకి సత్యదేవుడు ఒకేరోజు కలలో కనిపించి రత్నగిరిపై ఉన్న అంకుడుచెట్టు వద్ద తాను శిలారూపంలో ఉన్నానని, తనను ప్రతిష్ఠించి పూజించాలని ఆదేశించాడు. దీంతో వీరిద్దరూ గ్రామస్థులతో కలిసి విగ్రహాన్ని కనుగొని ప్రతిష్ఠించారని కథనం.

దైవక్షేత్రాల్లో లడ్డూ మహా ప్రసాదంగా లభించడం పరిపాటి. అయితే, అన్నవరం క్షేత్రంలో మిగతా క్షేత్రాలకు భిన్నంగా గోధుమరవ్వతో తయారు చేసిన ప్రసాదం లభ్యమవుతుంది. ఇది అమోఘమైనదిగా ప్రతీతి. విష్ణు పంచాయతన క్షేత్రంగా విరాజిల్లుతున్న అన్నవరంలో మాత్రమే ఈ ప్రసాదం తయారీ ఉంటుంది. కేవలం స్వామి దర్శనానికి వచ్చే భక్తులే కాకుండా వివిధ వాహనాల్లో, బస్సుల్లో, లారీల్లో ప్రయాణించేవారు సైతం రోడ్డును ఆనుకొని ఉన్న కౌంటర్ వద్ద ప్రసాదాన్ని కొనుగోలు చేసి స్వీకరిస్తుంటారు.



**దర్శన సమయం:**

ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 12.30 వరకు,
మధ్యాహ్నం గం॥ 1.00 నుండి రాత్రి గం॥ 9.00 వరకు,

**ఫోన్:** 08868-238163, 239119, 239123, 9491000636.

***Website:*** www.annavaramdevasthanam.nic.in

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 80 కి.మీ. |
| రాజమండ్రి | 86 కి.మీ. |
| కాకినాడ | 48 కి.మీ. |
| అమలాపురం | 105 కి.మీ. |
| రావులపాలెం | 100 కి.మీ. |
| తుని | 20 కి.మీ. |

బ్రహ్మ ఇచ్చిన వరంతో భద్రుడు, రత్నాకరుడు అనే ఇద్దరు సంతానాన్ని పర్వతాధిపతి మేరువు పొందాడు. భద్రుడు బాల్యం నుండి శ్రీరామ భక్తుడిగా ఉండి, ఆయనను శిరసున ధరించి భద్రాచలం పేరిట దివ్యక్షేత్రమై కీర్తి పొందాడు. రత్నాకరుడు శ్రీ మహావిష్ణువు అనుగ్రహం కోసం తపస్సు చేసి రత్నగిరి పేరిట పర్వత రూపం దాల్చి, మహాలక్ష్మీ సమేత సత్యనారాయణ స్వామిగా తనపై వెలిసే వరాన్ని పొందాడు.

1934లో ద్వితీయ ధర్మకర్త రాజా ఇనుగంటి వేంకట రాజగోపాల రామసూర్యప్రకాశరాయణం పునఃనిర్మించారు. ఎక్కడైనా శివ, కేశవులకు వేర్వేరు ఆలయాలు ఉంటాయి గాని, ఈ రత్నగరిపై ఒకే పానపట్టంపై విష్ణు రూపుడైన సత్యదేవుడు మధ్య భాగాన, కుడి వైపున శివుడు, ఎడమ పక్కన అనంతలక్ష్మీ సత్యవతి అమ్మవార్లు భక్తులకు దర్శనమిస్తారు. క్షేత్ర పాలకులుగా సీతారాములు, రత్నగిరి రక్షకులుగా వనదుర్గ, కనకదుర్గ ఆలయాలున్నాయి. ఏటా వైశాఖ శుద్ధ ఏకాదశి రోజున స్వామి వారి కళ్యాణం వైభవంగా నిర్వహిస్తారు. అలాగే శ్రావణ శుద్ధ విదియ రోజున స్వామి వారి ఆవిర్భావ దినోత్సవ వేడుకలు, కార్తీక బహుళ ద్వాదశి రోజున పంపా సరోవరంలో తెప్పోత్సవాన్ని అంగరంగ వైభవంగా నిర్వహిస్తారు. ఆలయంలోని ఫలభాయన్త్రము, ఏడు జాతుల గోవులతో ఏర్పాటు చేసిన శ్రీగోకులం వంటివి ఎంతగానో ఆకట్టుకుంటాయి.





# శాంతి ఆశ్రమం



మానవులను ఉత్తములను చేయడానికి మార్గదీపాలను వెలిగించే మహత్తర చిత్త-శాంతిదాయకాలుగా ఆది నుంచీ ఆశ్రమాలు విశిష్టపాత్రను పోషిస్తూనే ఉన్నాయి. అటువంటి ఆశ్రమాల్లో ప్రసిద్ధి చెందినది శాంతిఆశ్రమం. ప్రత్తిపాడు మండలం వెంకటనగరం పంచాయితీ పరిధిలోని తోటపల్లి కొండలలో ఈ ఆశ్రమం వెలిసింది.

మానవ కల్యాణం, ప్రపంచశాంతి, సర్వమతాల సమన్వయం ఆశయాలతో ఓంకార స్వామీజీ 1917లో ఈ ఆశ్రమాన్ని 150 ఎకరాల్లో స్థాపించారు. ఇక్కడ సర్వమతాలకు సంబంధించిన భక్తులు వారి ఇష్టదైవాలను తమకు తోచిన రీతిలో ప్రార్థించుకునే అవకాశం వుంది. పుష్పాలు, పచ్చదనంతో చెట్లు స్వాగతం పలుకుతాయి. ఆశ్రమం లోపల అద్భుతమైన కట్టడాలు కనువిందు చేస్తాయి. దేవాలయాలు, కుటీరాలు, ధ్యాన మందిరాలు, వసతి గృహాలు, వృద్ధ శరణాలయాలు, గ్రంథాలయాలు, భోజనశాలలు వంటివి ప్రకృతి అందాల మధ్య ఆధ్యాత్మిక పరిమళాలు వెదజల్లుతాయి. ప్రశాంత జీవనాన్ని కోరుకునే ప్రతి ఒక్కరికీ ఈ ఆశ్రమం స్వర్గధామం. ప్రతి ఏటా జనవరి 21 న ఓంకార స్వామికి జన్మదిన వేడుకలు ఘనంగా నిర్వహిస్తారు.



1895లో పిఠాపురంలో ఓంకార స్వామీజీ జన్మించారు. ఆపదలో ఉన్నవారిని ఆదుకుంటూ, అనాథ బాలికలకు అండగా నిలిచే వ్యక్తిగా పిన్నవయస్సులోనే ఖ్యాతి పొందారు. చిన్న వయస్సులోనే దేశ విదేశాల్లో పర్యటించి ఆధ్యాత్మిక ఉపన్యాసాలతో భారతదేశ ఔన్నత్యాన్ని చాటి చెప్పిన వక్తగా ఘనత పొందారు. 1982, జూన్ 10న స్వామీజీ పరమపదించారు. ఓంకార స్వామి శిష్యురాలైన మాతా జ్ఞానేశ్వరీదేవి ఈ శాంతిఆశ్రమం పీఠాధిపతిగా ప్రస్తుతం కొనసాగుతున్నారు.

రోగ బాధితులకు సుశీల వైద్యాలయం, సందర్శకులకు ఆశ్రమవాసులు భోజన సేవలు అందించే అన్నపూర్ణ క్షేత్రం, గోశాల, విద్యార్థులకు హైస్కూలు స్థాయి విద్యను అందించే గురుకుల సంస్థలు, హాస్టల్ వసతి, వృద్ధాశ్రమం, పరిశోధన, యోగసాధన సప్తాహం, అనేక మతాల అఖండ స్వరూపమైన విశ్వమత చిహ్నం, సమాధి మందిరాలు, జ్ఞానదీపాన్ని అందించే శాంతిస్తూపం, శాంతిపత్రిక ముద్రణాలయం, విశ్వనాథ ఆలయం, జ్ఞానవేదిక, శాంతి స్తంభాలతో ఓంకార స్వామీజీ తపస్సు చేసిన బోధి వృక్షాలు ఇక్కడ ప్రత్యేక ఆకర్షణలుగా పేరుపొందాయి.





### ఎంత దూరం...

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 88 కి.మీ. |
| రాజమండ్రి | 94 కి.మీ. |
| కాకినాడ | 52 కి.మీ. |
| అమలాపురం | 108 కి.మీ. |
| రావులపాలెం | 100 కి.మీ. |
| తుని | 36 కి.మీ. |

# ఆంధ్రాశబరిమలై

ఎటుచూసినా పచ్చని పంటపొలాలు... కంటికింపుగా కొండకోనలు... ఆహ్లాదకరమైన వాతావరణం... ఆశీర్వదించేందుకు ఆ అమ్మ ఎత్తిన చేతుల్లా ఎత్తైన వృక్షాలు... పరమశివుని జటాజూటం నుండి జాలువారే గంగలా ఎత్తైన కొండల నుండి దూకే జలధారలు... ఆ కొండలు, అడవుల నడుమ సాగే దారిలో కాలిడితేనే ఏదో దివ్యధామానికి చేర్చే పయనానికి శ్రీకారం చుట్టిన అనుభూతి కలుగుతుంది. శంఖవరం మండలం సిద్ధివారిపాలెంలోని "ఆంధ్రాశబరిమలై" ఆలయం, ఉపాలయాలు, మల్లిఖార్జున స్వామి లొద్ది అటు భక్తులను, ఇటు పర్యాటకులను విశేషంగా ఆకట్టుకుంటున్నాయి. కేరళలోని కరిమలవాసుడుండే ప్రదేశానికి సారూప్యమైన భౌగోళిక పరిస్థితులు ఈ ప్రాంతంలో కనిపిస్తుండడంతో ఇదీ మన 'శబరిమల' అనే భావన భక్తజనంలో నెలకొంది.

## ఎంత దూరం...

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 92 కి.మీ. |
| రాజమండ్రి | 98 కి.మీ. |
| కాకినాడ | 66 కి.మీ. |
| అమలాపురం | 122 కి.మీ. |
| రావులపాలెం | 116 కి.మీ. |
| తుని | 45 కి.మీ. |

జలధారలు, అంకంపాలెంలో నిర్మించిన పంబాక్షేత్రం, అక్కడి నుంచి వనయాత్ర ద్వారా చేరుకునే 'సిద్ధివారిపాలెం'లోని అయ్యప్ప సన్నిధానం భక్తులకు శబరిమల పర్యటనను గుర్తుచేస్తుంది. కత్తిపూడి నుండి శంఖవరం మీదుగా 22 కిలోమీటర్ల దూరంలో ఈ క్షేత్రం ఉంది. నేరుగా అయ్యప్ప ఆలయానికి రహదారి సౌకర్యం ఉంది. అయితే శబరిమలలో మాదిరిగా యాత్రా దర్శనం ఉండేలా ఇక్కడి నైసర్గిక స్వరూపాన్ని బట్టి వేళంగిలో... జలధార, అంకంపాలెంలో... పంబాక్షేత్రం, సిద్ధివారిపాలెంలో... సన్నిధానం విభజించడం జరిగింది. కాలాలకు అతీతంగా వేళంగిలోని ఎత్తైన కొండల నుంచి జలధారలు జాలువారుతాయి. అనాదిగా ఈ ప్రదేశం తీర్థస్థలంగా ఉంది. కార్తీక మాసంతో పాటు పర్వదినాల్లో ఇక్కడి ధారమల్లిఖార్జునుని భక్తులు సేవిస్తుంటారు. సిద్ధివారిపాలెం అయ్యప్ప ఆలయానికి వచ్చే మాలధారులు... పేటతుళ్ళి ఆడి, పుణ్యస్నానాలు చేసేందుకు అనువుగా ఉంది. ఈ క్రమంలో భక్తులు, మాలధారులు ఈ ప్రదేశాన్ని ఎరుమేలిగా భావిస్తున్నారు.









వేళంగి ధారకు కొద్దిదూరంలో ఉన్న అంకంపాలెంలో పంబాక్షేత్రం ఏర్పాటైంది. అయ్యప్ప జననం నుంచి 14 ఏళ్ళ వరకూ స్వామి జీవిత విశేషాలను తెలిపే చిత్ర, శిల్పాల సమాహారం ఇక్కడ నిర్మించిన పందల రాజభవంతిలో చూపరులను ఎంతగానో ఆకట్టుకుంటాయి. పంబ మాదిరి జలస్థావరాన్ని ఇక్కడ ఏర్పాటు చేసారు. వేళంగిలో పేటతుళ్లి ఆడిన భక్తులు ఉపాలయాలున్న ఈ క్షేత్రాన్ని దర్శించి ముందుకు సాగుతారు. పంబాక్షేత్రంగా ఉన్న అంకంపాలెం నుంచి ఐదున్నర కిలోమీటర్ల వనయాత్ర చేసి సిద్ధివారిపాలెంలోని అయ్యప్ప సన్నిధానానికి వెళ్ళాలి. వనయాత్ర కోసం రహదారి నిర్మించారు. ఈ దారి మధ్యలోనే ఏర్పాటు చేసిన శరణగుత్తి, శబరిపీఠం వద్దే కన్నెస్వాములు, భక్తులు కొబ్బరికాయలు కొట్టి అయ్యప్ప దర్శనానికి వెళ్తారు. సిద్ధివారి పాలెం అయ్యప్ప ఆలయం తలుపులు 365 రోజులూ తెరిచే ఉంటాయి. మాలధారణ, ఇరుముడులు నివేదన తదితర అయ్యప్ప దీక్షా పద్ధతులన్నీ ఆచరణలో ఉంచారు. మన హిందూసాంప్రదాయాన్ని, ఆగమశాస్త్రాన్ని అనుసరించి ప్రతిష్ఠ చేసినందువల్ల మహిళలు కూడా దర్శించుకునే వీలు కల్పించారు.

**దర్శన సమయం:**

ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు, సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు

**ఫోన్:** 9397925007.

# లోవ

జగన్మాత లలితాంబికాదేవి మరో అవతారంగా భక్తులచే పూజలందుకుంటున్న శ్రీశ్రీశ్రీ తలుపులమ్మ అమ్మవారు తుని మండలం లోవ గ్రామంలో అవతరించారు. భక్తులు తలచిన తలపులు తీర్చే అమ్మ కాబట్టి 'తలుపులమ్మ'గా నిత్య పూజలందుకుంటోంది. తునికి 8 కి॥మీ॥ దూరంలోని లోవకొత్తూరు గ్రామంలో ఈమె వేంచేసి ఉన్నారు. దుష్ట శిక్షణ, దీనజనరక్షణ కోసం తలుపులమ్మ తల్లి దుర్గమ్మగా, ఆదిపరాశక్తిగా, అభీష్ట ప్రదాయినిగా అవతరించి నిరంతరం ఇక్కడ సంచరిస్తుంటుందని స్థల పురాణం చెబుతోంది. అమ్మవారిని దర్శించి మొక్కుబడులు చెల్లించుకుంటే కోర్కెలు నెరవేరతాయనేది భక్తుల ప్రగాఢ నమ్మకం. కొండపై నుంచి నిరంతరం ప్రవహించే పాతాళ గంగను, కమనీయమైన ఆలయ దృశ్యాలను చూసేవారెవరైనా భక్తి పారవశ్యానికి లోనవాల్సిందే.

కృతయుగంలో అగస్త్యమహర్షి జగజ్జనని అయిన అమ్మవారిని ఈ ప్రాంతంలో పూజించినట్లు పురాణకథనం. కృతయుగంలో ధీరుడైన మేరుపర్వతం తన స్వరూపాన్ని పెంచుకుంటూ పోతున్నాడు. అప్పుడు అగస్త్యుడు అతన్ని ఆపే క్రమంలో దక్షిణ భారతదేశ యాత్ర ప్రారంభించాడు. మార్గశిర బహుళ అమావాస్యనాడు సాయంత్రం వేళ ఒక కీకారణ్యం నుండి ప్రయాణిస్తూ సూర్యాస్తమయ వేళ సంధ్యావందనం కోసం అగస్త్యుడు అర్ఘ్యం సమర్పించాలని పరిసరాలను పరికించాడు. ఒక్క చుక్కనీరు గాని, ఏరుకాని కనిపించలేదు. వెంటనే అగస్త్యుడు పాతాళగంగను ప్రార్థించాడు. మహాముని ప్రార్థన మేరకు పాతాళ గంగ పర్వత శిఖరాల మీదుగా పైకి పెల్లుబికి ఒక లోయగుండా ప్రవహించింది. సంధ్యావందనం పూర్తిచేసిన తరువాత ఆ రాత్రికి అక్కడే బసచేసి ఉదయం తిరిగి ప్రారంభించాలని సంకల్పించాడు. అలసిన అగస్త్యుడికి ఆకలితోపాటు నిద్ర ముంచుకు వచ్చింది. ఒక చెట్టుకింద బండరాయిపై విశ్రమించి పైకి చూశాడు. చెట్టు మొదట్లో ఆకులతో వేలాడుతున్న తీగ కనిపించింది. అది ఏమిటోనని అగస్త్యుడు స్పృశించాడు. చెట్టు నుంచి మృదుఫలాలు కింద పడ్డాయి. ఆ రాత్రికి అగస్త్యుడు వాటిని భుజించాడు. ఇంతలో పెద్ద కాంతి కొండలోయలో నుంచి ఆయనకు దర్శనమిచ్చింది. ఆ వెంటనే జగజ్జనని లలితాంబికా దేవి ప్రత్యక్షమైంది. అగస్త్యుడు ఆదిశక్తిని పూజించి ప్రార్థించాడు. మానవులకు









**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 98 కి.మీ. |
| రాజమండ్రి | 104 కి.మీ. |
| కాకినాడ | 65 కి.మీ. |
| అమలాపురం | 122 కి.మీ. |
| రావులపాలెం | 115 కి.మీ. |
| తుని | 10 కి.మీ. |

ఆయురారోగ్య అష్టైశ్వర్యాలను ప్రసాదించే అమ్మగా ఇక్కడి అటవీ ప్రాంతంలో ఉండాలని ఆమెను కోరాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ కొరకు తానే ఆదిశక్తిగా అరణ్యప్రాంతంలో సంచరిస్తున్నానని చెప్పి ఆమె అదృశ్యమైంది. నాటి నుంచి అమ్మవారు భక్తుల తలపులు తీర్చే 'తలుపులమ్మ'గా ఇక్కడ కొలువు దీరిందని చెబుతుంటారు. క్రమంగా ఈ ప్రాంతం 'లోయ'గా కాలక్రమంలో 'లోవ'గా రూపాంతరం చెందింది.

ఈ ఆలయం రెండు దశాబ్దాల క్రితం రాష్ట్ర దేవాదాయ దర్మాదాయ శాఖ ఆధీనంలోకి వచ్చింది. ఒకప్పుడు కీకారణ్యంగా ఉండే ఈ అటవీ ప్రాంతానికి ప్రస్తుతం రహదారి సౌకర్యం ఉంది. ప్రయాణీకుల కోసం ఆర్టీసీ, దేవస్థానం, తుని నుంచి ప్రత్యేక బస్సులను నడుపుతోంది. కోస్తా జిల్లాల్లోని కొత్త, పాత వాహనాలన్నీ అమ్మవారి వాహనపూజకు తరలివస్తుంటాయి. అమ్మవారి పూజలు జరిపించుకున్న వాహనానికి ఏ విధమైన అవరోధం ఎదురు కాదని భక్తుల విశ్వాసం.



**దర్శన సమయం:** ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు, సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు

**ఫోన్:** 08854-253508, 200331, 9491000714, 9347666821.

# రామచంద్రపురం

## డివిజన్

రామచంద్రపురం నుండి వివిధ ప్రధాన నగరాలకు గల దూరం

| | |
|---|---|
| ఢిల్లీ | 1767 కి.మీ. |
| ముంబయి | 1158 కి.మీ. |
| కోల్‌కత్తా | 1061 కి.మీ. |
| చెన్నై | 647 కి.మీ. |
| హైదరాబాద్ | 465 కి.మీ. |
| విజయవాడ | 190 కి.మీ. |
| విశాఖపట్టణం | 192 కి.మీ. |





### రామచంద్రపురం డివిజన్‌లోని దర్శనీయ ప్రదేశాలు

- ద్వారపూడి
- బలభద్రపురం
- బిక్కవోలు
- రామచంద్రపురం
- ద్రాక్షారామం
- కోటిపల్లి

# ద్వారపూడి



కలియుగంలో ప్రత్యక్ష దైవంగా పూజలందుకుంటున్న వేంకటేశ్వరుని తర్వాత అంతటి భారీ సంఖ్యలో భక్తులు కొలిచే దైవం అయ్యప్పస్వామి. నల్లటి దుస్తులు ధరించి అయ్యప్పస్వామివారి కఠోర దీక్ష తీసుకునే భక్తుల సంఖ్య రోజురోజుకీ పెరుగుతోంది. దీక్ష తీసుకొన్న భక్తులు వందల కిలోమీటర్లు పయనించి కేరళలో ఉన్న శబరిమలై వెళ్ళి అయ్యప్పస్వామిని దర్శనం చేసుకుంటారు. కానీ... ఆర్థిక స్థోమత, ఆరోగ్యం, సమయం లేనివారు మాత్రం ద్వారపూడిలోని అయ్యప్ప ఆలయానికి వస్తారు. అందుకే ద్వారపూడి ఆంధ్రా శబరిమలైగా వినుతికెక్కింది. మండపేట మండలం ద్వారపూడిలో సామర్లకోట కాలువ పక్కనున్న ఈ ఆలయం దినదినాభివృద్ధి చెందుతూ రాష్ట్రంలోనే ప్రత్యేక స్థానాన్ని దక్కించుకుంది.

భక్తికి ఎల్లల్లేవనడానికి ద్వారపూడి దేవాలయమే నిదర్శనం. తమిళనాడు రాష్ట్రం తిరుచునాపల్లి జిల్లా కురయూరు గ్రామానికి చెందిన ఎస్.ఎల్. కనకరాజు వస్త్రవ్యాపారం కోసం 1969లో ద్వారపూడి వచ్చి, ఇక్కడే స్థిరపడిపోయాడు. ఆయనకు అయ్యప్పస్వామిపై ఉన్న భక్తితో ఇక్కడ స్వామివారి ఆలయం నిర్మించాలని సంకల్పించారు. స్థానికంగా ఉండే భక్తులు కూడా తోడవడంతో 1983లో ఆలయ నిర్మాణానికి శంకుస్థాపన జరిగింది. ఏ ముహూర్తాన ఈ శంకుస్థాపన జరిగిందో కాని ఆనాటి నుంచి నేటి వరకు ఇక్కడ కొత్త కొత్త ఆలయాల నిర్మాణాలు జరుగుతూనే ఉన్నాయి. పేరుకు అయ్యప్ప స్వామి ఆలయంగా పేరొందినప్పటికీ ఇక్కడున్నన్ని ఆలయాలు మరెక్కడా ఉండవనే చెప్పాలి. ఒకే ప్రాంగణంలో ఎందరో దేవతామూర్తులు కొలువుదీరి ఉన్నారు. షిర్డీ సాయిబాబా, కనకదుర్గాదేవి, పంచముఖ ఆంజనేయస్వామి, గోవిందరాజుస్వామి, భూగర్భ ద్వాదశ జ్యోతిర్లింగ దేవాలయం, నవగ్రహ శనీశ్వరస్వామి ఆలయం, అష్టాదశ శ్రీ ఉమా విశ్వలింగేశ్వరస్వామి ఆలయం, పాపవిమోచన దేవాలయాలను నిత్యం వేలాది మంది దర్శించుకుంటూ ఉంటారు. అయ్యప్పస్వామి ఆలయానికి తూర్పు వైపున దశావతారాలతో కూడిన వేంకటేశ్వరస్వామి ఆలయం కూడా ఉంది.

ఉభయగోదావరి జిల్లాలతో పాటు విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళం నుంచి అధిక సంఖ్యలో భక్తులు ద్వారపూడి అయ్యప్పను దర్శించుకుంటారు. శబరిమలై అయ్యప్ప ఆలయం మాదిరిగానే ఇక్కడ పూజాది కార్యక్రమాలు నిర్వహిస్తారు. ఏకశిలపై చెక్కించిన పద్దెనిమిది మెట్లను ఇరుముడితో మాత్రమే ఎక్కే అవకాశం ఉంటుంది. ఇక్కడ ప్రతీ బుధవారం తమ పిల్లలకు పటికబెల్లం, డబ్బులు తులాభారం వేసి, భక్తులు స్వామి వారి మొక్కులు తీర్చుకుంటుంటారు.

ద్వారపూడి అయ్యప్ప ఆలయం వద్ద అద్భుత కట్టడాలు భక్తులను విశేషంగా ఆకట్టుకుంటున్నాయి. గర్భగుడిలో ఉండే దేవుళ్ళతో పాటు ఆలయాల ప్రాంగణం లో ఉండే నటరాజు విగ్రహం, హరిహరుడు, పంచముఖ ఆంజనేయస్వామి, భారీనంది విగ్రహాలు, ఇరువైపులా ఏనుగుల స్వాగత ద్వారం వంటి వాటిని అద్భుతంగా తీర్చిదిద్దారు.

**దర్శన సమయం:**
ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు
సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు
**ఫోన్:** 08857-228050, 229840.

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 38 కి.మీ. |
| రాజమండ్రి | 22 కి.మీ. |
| కాకినాడ | 47 కి.మీ. |
| అమలాపురం | 59 కి.మీ. |
| రావులపాలెం | 24 కి.మీ. |
| తుని | 93 కి.మీ. |






# బలభద్రపురం



**దర్శన సమయం:**
ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు
సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు

**ఫోన్:** 08857-236114,

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 49 కి.మీ. |
| రాజమండ్రి | 32 కి.మీ. |
| కాకినాడ | 35 కి.మీ. |
| అమలాపురం | 74 కి.మీ. |
| రావులపాలెం | 36 కి.మీ. |
| తుని | 82 కి.మీ. |

ఆంధ్రా షిరిడీగా బిక్కవోలు మండలం బలభద్రపురం ప్రసిద్ధిచెందింది. గ్రామంలో 2003 ఫిబ్రవరి 20న పదిమంది సాయి భక్తులు కలిసి చిన్న సాయిబాబా మందిరాన్ని నిర్మిద్దామని పూనుకున్నారు. బాబా మహిమ వల్ల ఈ మందిరం రూ. 2 కోట్ల వ్యయంతో రెండేళ్ళపాటు నిర్మాణం సాగి ఒక అద్భుతసాయి మందిరంగా రూపు దిద్దుకుంది. సాయిదీక్షతో భక్తులు రాజస్థాన్ వెళ్ళి చక్కని పాలరాతి విగ్రహాన్ని తీసుకుని నేరుగా షిరిడీ వెళ్ళి ప్రత్యేక పూజలు జరిపించి 2005 ఫిబ్రవరి 17న సాయిమందిరంలో ప్రతిష్ఠించారు. వ్యాపార, ఉద్యోగ, వివాహ విషయాలలో భక్తులు తమ దరఖాస్తులు, శుభలేఖలు స్వామి పాదాల వద్ద ఉంచి ప్రత్యేక పూజలు జరిపించడం వల్ల తమ పనులు నిర్విఘ్నంగా పూర్తవుతాయని నమ్మకం. మందిరంలో శయనిస్తున్న బాబా ఊయలను సంతానం లేని స్త్రీలు ఊపితే తప్పక సంతానం కల్గుతుందని భక్తుల ప్రగాఢ విశ్వాసం. ఈ మందిరంలో బాబా విగ్రహప్రతిష్ఠాపన దినం ఫిబ్రవరి 17 లగాయతు 5 రోజుల పాటు సూర్యకిరణాలు బాబాపాదాల నుంచి శిరస్సు వరకు ప్రసరించడం మరో విశేషం. ఏటా గురుపౌర్ణమి, బాబా విగ్రహప్రతిష్ఠాపన వేడుకలు ఘనంగా నిర్వహిస్తారు. ప్రతి గురువారం బాబాను దర్శించుకోవడానికి వచ్చే భక్తులందరికీ అన్నదానం చేస్తారు.






# బిక్కవోలు



క్రీ॥శ॥ 774 నుంచి క్రీ॥శ॥ 1542 వరకు వేంగిని రాజధానిగా చేసుకుని ఆంధ్రదేశాన్ని పాలించిన తూర్పుచాళుక్యుల ఆధ్యాత్మిక రాజధానిగా బిక్కవోలును చెప్పవచ్చు. 9వ శతాబ్దంలో వీరు ఇక్కడ నిర్మించిన అనేక ఆలయాలే ఇందుకు సాక్ష్యం. తమ ఇలవేల్పు వినాయకుడు, శివుడి ఆలయాలు అటు ఆధ్యాత్మికతనూ, ఇటు శిల్పకళనూ రంగరించిన చారిత్రక నిర్మాణాలుగా ప్రసిద్ధి చెందాయి.

తూర్పుచాళుక్యులు బిక్కవోలు గ్రామానికి తూర్పున ముందుగా తమ ఇలవేల్పు అయిన వినాయకుడి ఆలయం నిర్మించారు. కాలక్రమంలో ఈ ఆలయం కాలగర్భంలో కలిసిపోయింది. 1960వ దశకంలో ఒక భక్తుడి కలలో కనిపించి వినాయకుడే తన ఉనికి తెలిపాడని, గ్రామస్థుల సహకారంతో ఆ ప్రదేశంలో తవ్వకాలు సాగించగా దక్షిణావృత తొండంతో వినాయకుడు బయలు పడ్డాడని కథనం. అనంతరం పందిరి వేసి భక్తులు పూజలు మొదలుపెట్టారు. కాలక్రమంలో వినాయకుడి మహిమ దశదిశలా వ్యాపించింది. భక్తుల తాకిడి ఎక్కువ అవ్వడంతో గ్రామస్థులు స్వామికి విశాలమైన ఆలయం నిర్మించారు. విగ్రహం బయటపడిన తొలినాళ్ళలో చిన్నదిగా ఉన్నా తర్వాత భారీస్థాయికి పెరిగిందన్నది స్థానికుల కథనం. చెవిలో తమ కోర్కె చెబితే తప్పక అది నెరవేరుతుందన్న భక్తుల విశ్వాసం ఆనోట ఈనోట పాకి రాష్ట్ర వ్యాప్తి పొందింది. చవితి వేడుకలకు ఈ ఆలయం భక్తకోటితో కళకళలాడుతుంది.

తూర్పు చాళుక్యులు యుద్ధంలో జయం లభించినపుడల్లా అందుకు గుర్తుగా అనేక శివాలయాలు నిర్మించారు. బిక్కవోలు నలుదిక్కులా వీరు నిర్మించిన చాలా ఆలయాలు మతోన్మాదుల అహంకారానికి శిథిలమై భూమిలో నిక్షిప్తమైపోయాయి. అయితే నాలుగు శైవ ఆలయాలు మాత్రం వీరి దండయాత్రల నుంచి తప్పించుకుని నేటికీ చెక్కుచెదరక వున్నాయి. వీటిలో ఉత్తర, పడమర, దక్షిణ దిశలలో ఉన్న కంచర, నక్కల వీరభద్ర ఆలయాలు పురావస్తుశాఖ ఆధ్వర్యంలో ఉన్నాయి. గోలింగేశ్వర ఆలయం మాత్రం నేటికీ నిత్యం భక్తకోటితో పూజలందు కుంటోంది. ఈ ఆలయ ప్రాంగణంలో రాజరాజేశ్వర, చంద్రశేఖర, గోలింగేశ్వర ఆలయాల సముదాయం ఉండి గోలింగేశ్వర ఆలయంలో గోలింగేశ్వరునితో పాటు పార్వతీదేవి, కుమార సుబ్రహ్మణ్యేశ్వరుడు, విఘ్నేశ్వరుడు, వీరభద్రుడు, నందీశ్వరుడు... ఇలా మొత్తం శైవకుటుంబమే కొలువు దీరింది. యేటా మార్గశిర శుద్ధషష్ఠి ఉత్సవాలు జరుగుతుంటాయి. సుబ్రహ్మణ్యేశ్వరుడి సహజమైన పుట్ట నేటికీ దర్శనమిస్తోంది.

పెద్దాపురం మహారాజు వత్సవాయి సూర్యనారాయణ తిమ్మ జగపతి ఈ ఆలయాన్ని దర్శించి సంతానం కోసం సుబ్రహ్మణ్యేశ్వరుని కొలువగా ఆ కోర్కె నెరవేరింది. దీంతో మహారాజు ఈ ఆలయాలను పునరుద్ధరించి కొత్త శోభను చేకూర్చారు. ఏటా జరిగే షష్ఠి ఉత్సవాలలో సంతానం లేని స్త్రీలు స్వామి వారి పుట్టపై ఉంచిన నాగుల చీరను ధరించి ఆలయం వెనుక శయనిస్తే సంతానవతులవుతారని ప్రగాఢ విశ్వాసం.









### ఎంత దూరం...

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 53 కి.మీ. |
| రాజమండ్రి | 37 కి.మీ. |
| కాకినాడ | 30 కి.మీ. |
| అమలాపురం | 75 కి.మీ. |
| రావులపాలెం | 42 కి.మీ. |
| తుని | 77 కి.మీ. |

### దర్శన సమయం:

ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు
సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు

### ఫోన్:

8341172934 (వినాయకుడి ఆలయం),
9949458249 (సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఆలయం).



# రామచంద్రపురం

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 57 కి.మీ. |
| రాజమండ్రి | 42 కి.మీ. |
| కాకినాడ | 27 కి.మీ. |
| అమలాపురం | 33 కి.మీ. |
| రావులపాలెం | 31 కి.మీ. |
| తుని | 95 కి.మీ. |

రాజ్యాలు అంతరించి పోయినా ఆ కోటలు మాత్రం బీటలు వారకుండా గత కాలపు వైభవానికి చిహ్నాలుగా విరాజిల్లుతున్నాయి. కాలక్రమేణా రాచరికం అంతరించినా నాటి కోటలు గతకాలపు వైభవానికి సజీవ సాక్ష్యాలుగా నిలిచాయి. వాటి ఆనవాళ్ళు నేటికీ కళ్ల ముందు దర్శనమిస్తున్నాయి. రాజుల కాలంలో నిర్మించిన కోటలు నేడు జిల్లాలో కొన్ని ప్రాంతాలలో ఇంకా చెక్కుచెదరకుండా ఉన్నాయి. వాటిలో రామచంద్రపురం కోట ఒకటి. గత వైభవ ప్రాభవాలకు అద్దం పడుతున్న సుందర భవనం తూర్పుగోదావరిజిల్లాలోని రామచంద్రపురం రాజావారి కోట. ఈ పట్టణానికి ఈ కోట కారణంగానే కోట రామచంద్రపురం అనే పేరు వచ్చిందంటే దీని ఔన్నత్యాన్ని ఊహించుకో వచ్చు. చలనచిత్ర పరిశ్రమను సైతం ఈ భవనం విశేషంగా ఆకట్టుకుంది.

సూర్యవంశానికి చెందిన రాజులు ఈ కోటను 1865వ సంవత్సరంలో నిర్మించారు. కోటకు ముందు పెద్ద పెద్ద ప్రాకారాలుం టాయి. ఈ ప్రాకారాలు దాటుకుంటూ వెళితే పెద్ద ప్రవేశద్వారం ప్రజలను ఆహ్వాని స్తుంది. ప్రవేశ ద్వారానికి ఇరువైపులా తుపాకులు పట్టుకున్న సిపాయిల విగ్రహాలు గంభీరంగా చూస్తాయి. అయితే ద్వారం దాటి లోపలకు ప్రవేశించగానే అటు ఇటు ఉన్న ఉద్యానవనం చిరునవ్వుతో పలకరిస్తుంది. కొద్దిగా ముందుకు వెళితే రెండు సిమ్మెంటు బల్లలు, విశాలమైన ఖాళీ స్థలం ఉంటుంది. ఇక కోటకు ప్రధానమైన హాలులోకి ప్రవేశించగానే విస్మయం కలిగించే పులి చర్మంతో ఉన్న పులిబొమ్మలు దర్శన మిస్తాయి. చూడగానే ఒక్కసారిగా ఒళ్ళు జలదరించే విధంగా ఆ పులి బొమ్మలు భయంకరంగా కనబడతాయి. పెద్దరాజావారు ఆయన జీవితకాలంలో వేటాడిన పులుల చర్మాలతో ఉన్న బొమ్మలు అవి. ప్రస్తుతం ఈ కోట తెలుగు, హిందీ, కన్నడ, తమిళ చిత్ర పరిశ్రమలను సైతం తన వద్దకు రప్పించుకుంటోంది. సంవత్సరం పొడుగునా ఏదో ఒక భాషకు చెందిన సినిమా షూటింగ్‌లు ఇక్కడ జరుగుతూనే వుంటాయి. ఈ విధంగా సందర్శకులతో ఈ కోట నిత్యం కళకళలాడుతూనే ఉంటుంది.




# ఆదివారపుపేట

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 65 కి.మీ. |
| రాజమండ్రి | 50 కి.మీ. |
| కాకినాడ | 35 కి.మీ. |
| అమలాపురం | 28 కి.మీ. |
| రావులపాలెం | 38 కి.మీ. |
| తుని | 97 కి.మీ. |

ద్రాక్షారామం శివారు ఆదివారపుపేట గ్రామస్తులైన శ్రీ అల్లక భీమన్న, శ్రీమతి పార్వతమ్మ గార్ల ఆరవ సంతానముగా జనవరి 24, 1933వ సంవత్సరములో శ్రీ శివబాలయోగి జన్మించినారు. ఈయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు సత్యరాజు. సత్యరాజు సామాన్య గ్రామీణ బాలుడుగా ఉండి వంశపారంపరమైన మగ్గము పైన పనిచేసేవాడు. సత్యరాజుకు 14 సంవత్సరముల వయసులో అపూర్వమైన ఆధ్యాత్మిక అనుభవము కలిగి తన దివ్య గురుని ఆదేశానుసారముగా ఆగష్టు 7, 1949వ సంవత్సరములో తపోదీక్షకు ఉపక్రమించారు. ఈ విధంగా 12 సంవత్సరములు ఘోరతపస్సు చేసారు. ఈయన రోజుకు 23 గంటలు సమాధిస్థితిలో నిమగ్నుడై అర్ధరాత్రి సమయములో మామూలు స్థితికి వచ్చి స్నానము చేసి ఒక గ్లాసు పాలు త్రాగేవారు.









ఆగష్టు 7, 1961 నందు దైవసాక్షాత్కారము పొంది తపస్సును పూర్తి చేసారు. ఈ సమయమున సత్యరాజుకు తమ దైవ గురువు శ్రీ శివబాలయోగి అనే పేరు యిచ్చి, తపస్సు ద్వారా లోక కళ్యాణము మరియు ఆధ్యాత్మిక పథములో ఉన్నవారికి సహాయము చేయవలెనని శ్రీ శివబాలయోగిని ఆదేశించారు.

1963 నుండి శ్రీ శివబాలయోగి భారతదేశములోనే కాక, శ్రీలంక, ఇంగ్లాండు, ఇటలీ, అమెరికా మొదలైన దేశములు కూడా వెళ్ళి లక్షలాది ప్రజలకు ధ్యాన దీక్ష బోధించారు. భజన సమయములలో వేలకొలది భక్తులకు ఆధ్యాత్మిక భావన అనుగ్రహించారు. తమ ఆధ్యాత్మిక కార్యక్రమముల కొరకు భారతదేశములోనే కాక విదేశాలలో కూడా ఆశ్రమములు స్థాపించారు. మార్చి 28, 1994వ సంవత్సరములో శ్రీ శివబాలయోగి సమాధిలో తమ దేహాన్ని వదిలివేశారు. ఏప్రియల్ 2, 1994న సమాధి చేశారు.

శ్రీ శివబాలయోగి జన్మస్థలమైన ఆదివారపుపేటలో శ్రీ శివబాలయోగి మహరాజ్ ఆశ్రమము ఉంది. 1962వ సంవత్సరములో మహాశివరాత్రి రోజున శ్రీ శివబాలయోగివారు నర్మదానదీ తీరమునుండి తీసుకొనివచ్చిన ఒక అపూర్వమైన శివలింగాన్ని తాను తపస్సు చేసి దైవసాక్షాత్కారము పొందిన ఈ ఆశ్రమంలో ప్రతిష్ఠించినారు. శివలింగము పక్కన శ్రీ పార్వతీదేవి అమ్మవారి విగ్రహం కూడా ప్రతిష్ఠించారు. ప్రతిష్ట సమయము నుండి ఈ శివలింగము పెరుగుతున్నదని చెప్పబడుచున్నది. ఇక్కడ శివలింగమును భక్తులు తమ హస్తములతో స్వయముగా అభిషేకములు చేసుకోవచ్చని శ్రీ శివబాలయోగి మహరాజ్ ఆజ్ఞాపించారు.

**దర్శన సమయం:** ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు, సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు, **ఫోన్:** 08857-252412

# ద్రాక్షారామం

దక్షిణకాశీగా పేరు గాంచిన ద్రాక్షారామ భీమేశ్వరుడిని దర్శించుకున్న వారికి భోగము, మోక్షము సిద్ధిస్తాయని భక్తుల ప్రగాఢ విశ్వాసం. స్వయంభువుగా వెలసిన భీమేశ్వరుడు భక్తుల కోర్కెలు తీర్చే కొంగుబంగారంగా పూజలందుకుంటున్నాడు. దక్షిణ భారతదేశంలోనే అతి ప్రాచీన శైవక్షేత్రంగా ద్రాక్షారామంలోని శ్రీమాణిక్యాంబ సమేత భీమేశ్వరస్వామి ఆలయం ప్రసిద్ధి గాంచినది. ఎందరో మహానుభావులు నభూతో నభవిష్యతిగా ద్రాక్షారామ పుణ్యక్షేత్ర విశిష్టతను వేనోళ్ళ పొగిడారు. ఎందరో రాజులు ఆలయ అభివృద్ధికి కృషిచేసి ఆ స్వామిపై గల అచంచలమైన భక్తిని చాటుకున్నారు. ద్రాక్షారామం పంచారామాలు, త్రిలింగక్షేత్రాలు, అష్టాదశ శక్తి పీఠాలు, ద్వాదశ జ్యోతిర్లింగాల్లో ఒకటిగా విరాజిల్లుతోంది. పురాణప్రాశస్త్యం, అలనాటి చాళుక్యుల శిల్పకళారీతికి అద్దంపట్టే అద్భుత చారిత్రక కట్టడం కావడంతో ఎందరో భక్తులు, పర్యాటకుల సందడితో నిత్యం కళకళలాడుతోంది.

తారకాసురుడు ఘోరతపస్సు చేసి శివుని నుండి వరంగా పొందిన ఆత్మలింగం, కుమారస్వామి అతడిని అంతం చేసేటపుడు ఐదు ఖండాలైంది. ఈ ఖండాలు పడిన ప్రదేశాలు పంచారామాలుగా పురాణాలు చెబుతున్నాయి. ఐదవ భాగాన్ని ద్రాక్షారామంలో ప్రతిష్టించాలని భావించిన సప్తమహర్షులు గౌతమీ జలాలు తీసుకురావడానికి వెళ్లగా, సమయం మించిపోవడంతో శివుడే స్వయంభువుగా వెలిసాడని కథనం. భీమేశ్వరునికి సూర్యభగవానుడు ప్రథమంగా అభిషేకం చేసాడు. సూర్యోదయం, సూర్యాస్తమయ సమయాలలో సూర్యకిరణాలు స్వామిపై ప్రసరించడం ఇక్కడి విశేషం.

భూమిపై వెలసిన అష్టాదశ శక్తిపీఠాలలో ద్వాదశపీఠం ద్రాక్షారామ మాణిక్యాంబ అమ్మవారిగా పురాణాలు చెబుతున్నాయి. ఆలయంలో మాణిక్యాంబ అమ్మవారిని దక్షిణముఖంగా సాలగ్రామ శిలతో నిర్మితమైన శ్రీచక్రంపై ఆదిశంకరాచార్యులు పునఃప్రతిష్ఠ చేసినట్టు చెబుతారు. అష్టాదశ పీఠాల్లో ఇంకెక్కడా లేని విధంగా ఏకకాలంలో అమ్మవారికి, శ్రీచక్రానికి పూజలు చేయడం ఇక్కడి ప్రత్యేకత.

ద్రాక్షారామ భీమేశ్వరాలయం క్రీ॥శ॥ 9వ శతాబ్దంలో నిర్మితమైనట్టు శాసనాల ద్వారా తెలుస్తోంది. అడుగడుగునా అలనాటి అద్భుత శిల్పకళారీతికి అద్దంపట్టే నిర్మాణాలు కనువిందు చేస్తాయి. తూర్పుచాళుక్య వంశానికి చెందిన చాళుక్య భీముడు క్రీ॥శ॥ 892-922 సంవత్సరాల మధ్య ఈ ఆలయాన్ని నిర్మించినట్టు శాసనాల ద్వారా తెలుస్తోంది. పాళీ భాషలో చెక్కిన 832 శాసనాలు ఆలయ గోడలపై ఉండడం విశేషం. చాళుక్యుల తరువాత రెడ్డిరాజులు, చోళులు, రాయల వంశస్థులు, కాకతీయులు ఆలయాన్ని అభివృద్ధి చేసారు. బాహ్యప్రాకారం లోపల కాలభైరవాలయం, త్రికూటాలయం, సోమవారపు మండపం దర్శనమిస్తాయి. ఎత్తైన రెండవ ప్రాకారం మీద అందమైన ఆకృతిలో మలిచిన రాతి శిల్ప స్తంభాలతో రెండు అంతస్తుల బేడా మండపం విశేషంగా ఆకట్టుకుంటుంది. ప్రధాన ఆలయానికి నైరుతి భాగాన ఉన్న నమూనాలయం అలనాటి నిర్మాణపరిజ్ఞానానికి నిదర్శనం. ఇంకా ఊయలమండపం, వసంతమండపం ఉన్నాయి. ఆలయ తూర్పు ప్రాంగణంలో ఐదువేల ఏళ్లనాటిదిగా చెప్పే రావిచెట్టు కింద అశ్వత్థశంకర నారాయణుడు వెలిసియున్నాడు. సప్తమహర్షులు తీసుకువచ్చిన గోదావరి జలాలు అంతర్వాహినిగా ప్రవహించి తూర్పుభాగంలో సప్తగోదావరి పుష్కరిణిగా వెలిసినట్టు చెబుతారు. ఈ పుష్కరిణిలో మెట్ల కింద సప్తమహర్షుల విగ్రహాలతో పాటు కృష్ణపాదాలు ఉండడం ఇక్కడి ప్రత్యేకత.

ఆలయంలోపలి భాగంలో 26 మంది పరివార దేవతామూర్తులు ఉన్నారు. డుండి గణపతి, లక్ష్మీగణపతి, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి, సప్తమాతృకలు, సూర్యభగవానుడు, సూరేశ్వరుడు, నవగ్రహాలు, అష్టదిక్పాలకులు, భీమసభ, వీరభద్రుడు, చండీశ్వరుడు, మొదలగు పరివార దేవతలు, క్షేత్ర పాలకుడైన లక్ష్మీనారాయణస్వామి దర్శనమిస్తారు. మహాశివరాత్రి, భీష్మఏకాదశి రోజున స్వామి వారి జన్మదిన వేడుకలు, స్వామి వారి కళ్యాణోత్సవం, గణపతి నవరాత్రులు, శరన్నవరాత్రులు తదితర కార్యక్రమాలు ఇక్కడ భారీస్థాయిలో నిర్వహిస్తారు. కాకినాడ, రాజమండ్రి నుండి ద్రాక్షారామ చేరుకునేందుకు ఆర్టీసీ బస్సు సౌకర్యం కలదు. వీటితో పాటు రామచంద్రపురం, మండపేట, అమలాపురం ప్రాంతాలనుండి కూడా బస్ సౌకర్యం కలదు.

**దర్శన సమయం:** ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు, సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు,

**ఫోన్:** 08857-252488, 9247565841



**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 63 కి.మీ. |
| రాజమండ్రి | 50 కి.మీ. |
| కాకినాడ | 30 కి.మీ. |
| అమలాపురం | 26 కి.మీ. |
| రావులపాలెం | 38 కి.మీ. |
| తుని | 95 కి.మీ. |

ఆధ్యాత్మికం

# కోటిపల్లి



'శంభో హరహర మహాదేవ' అంటూ కోటిపల్లిలో కొలువై ఉన్న స్వామిని దర్శించుకుంటే సకల పాపాలు హరిస్తాయని భక్తుల నమ్మకం. నిత్యం శివ భక్తులతో మారుమోగుతూ పరమ పావన గౌతమీనదీ తీరాన కోటిపల్లి శైవక్షేత్రం కోటి ఫలితాల నిచ్చే క్షేత్రంగా, భక్తుల కొంగు బంగారమై వెలుగొందుతోంది. వ్యాస భగవానుడు రచించిన బ్రహ్మాండ పురాణములోని గౌతమీ మహత్మ్యం ఆధారంగా ఈ క్షేత్రం పూర్వ కాలమున 'కోటి తీర్థం'గా 'సోమ ప్రభాపురము'గా పిలువబడి నేడు 'కోటిపల్లి' మహా క్షేత్రంగా విలసిల్లుతోంది. కోటిపల్లిలో కొలువై ఉన్న శ్రీ ఛాయా సోమేశ్వర స్వామిని స్వయంగా చంద్రుడే ప్రతిష్ఠించినట్టు పురాణాలు చెబుతున్నాయి. అందుకే ఇక్కడ స్వామిని ఛాయా సోమేశ్వరుడంటారు.

ఇక్కడ గౌతమీ పుణ్యనదిలో విష్ణుతీర్థ, రుద్ర తీర్థ, మహేశ్వర తీర్థ, రామతీర్థ, బ్రహ్మ తీర్థ ఇలా పుణ్యనదులు కోటి సంఖ్యలో అంతర్వాహినులుగా ప్రవహిస్తున్న కారణంగా ఈ క్షేత్రము 'కోటి తీర్థ క్షేత్రం'గా ప్రసిద్ధి గాంచినది. ఈ మహా పుణ్యనదిలో నిత్యం భక్తిశ్రద్ధలతో స్నానము చేసే జీవులు సమస్త పాప దోషముల నుండి విముక్తి పొంది మోక్షము పొందుతారని ప్రతీతి.

శాపగ్రస్తుడైన చంద్రుడు తన రూపాన్ని కోల్పోయి కళావిహీనుడై, శాపవిముక్తి కోసం ఇంద్రుని ప్రార్థిస్తాడు. అప్పుడు ఇంద్రుడు ఈశ్వరుడిని ప్రతిష్ఠించి ఆయన అనుగ్రహాన్ని పొందమని సూచిస్తాడు. దీంతో చంద్రుడు గౌతమీ గోదావరి నదిలో











స్నాన మాచరించి, ఈశ్వరుడిని ప్రతిష్ఠించి పూజలు చేస్తాడు. ఆ విధంగా ఈశ్వరుని అనుగ్రహంతో శాపవిముక్తుడవుతాడు. అప్పటి నుండి ప్రసిద్ధ గౌతమీ గోదావరిలో స్నానమాచరించి, శ్రీ ఛాయా సోమేశ్వరుడిని దర్శించుకుంటే సకల పాపాలు తొలగిపోతాయని భక్తుల విశ్వాసం. అందుకే మహాశివరాత్రి పర్వదినాన సుప్రసిద్ధ గోదావరిలో లక్షలాది మంది భక్తులు తెల్లవారుజామునే స్నానమాచరించి స్వామివారిని దర్శించుకుంటారు. ఆ రోజు సాయంత్రం స్వామి వారికి కోటి దీపాలంకరణ చేస్తారు. అలాగే ఏటా కార్తీక మాసంలో లక్షలాది భక్తులు ఇక్కడ స్వామివారిని దర్శించుకుంటారు. ఈ మాసంలో లక్షపత్రి పూజ చేసి, అన్నసమారాధన చేయడం ఇక్కడ ఆనవాయితీ.

అలాగే ఈ ఆలయ ప్రాంగణంలో శ్రీదేవిభూదేవి సమేత శ్రీ సిద్ధిజనార్ధనాలయము, ఉమాసమేత కోటీశ్వరాలయం, శ్రీరాజ రాజేశ్వరీ సమేత ఛాయా సోమేశ్వరాలయం, కాలభైరవాలయం, నవగ్రహ సహిత పార్వతీ మృత్యుంజయ ఆలయాలు వెలశాయి.

**దర్శన సమయం:**

ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు
సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు,

**ఫోన్:** 08857-255584,255635, 9849097130.

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 74 కి.మీ. |
| రాజమండ్రి | 62 కి.మీ. |
| కాకినాడ | 38 కి.మీ. |
| అమలాపురం | 16 కి.మీ. |
| రావులపాలెం | 31 కి.మీ. |
| తుని | 105 కి.మీ. |

తంటికొండ
కాపవరం
కోరుకొండ
తొలితిరుపతి
పెద్దాపురం
సామర్లకోట
రాజమండ్రి
బిక్కవోలు
అనపర్తి
ధవళేశ్వరం
ద్వారపూడి
జి.మామిడాడ
కడియం
తాపేశ్వరం
ఆలమూరు
రామచంద్రపురం
గుమ్మిలేరు
చింతలూరు
ద్రాక్షారామం
రావులపాలెం

# రాజమండ్రి

## డివిజన్

రాజమండ్రి నుండి
వివిధ ప్రధాన నగరాలకు గల దూరం

న్యూఢిల్లీ.............1722 కి.మీ.
ముంబయి.........1123 కి.మీ.
కోల్‌కత్తా.........1060 కి.మీ.
చెన్నై.....................617 కి.మీ.
హైదరాబాద్.......400 కి.మీ.
విజయవాడ.........160 కి.మీ.
విశాఖపట్నం.......191 కి.మీ.





### రాజమండ్రి డివిజన్‌లోని దర్శనీయ ప్రదేశాలు

| | |
|---|---|
| పాపికొండలు | ధవళేశ్వరం |
| రాజమండ్రి | కడియం |
| కోరుకొండ | గుమ్మిలేరు |
| తంటికొండ | చింతలూరు |




# పాపికొండలు



పాపికొండలు అందానికే సరికొత్త అర్థం చెప్పే సుందర ప్రదేశాలు. పడవలో ప్రయాణిస్తూ ఆ అందమైన ప్రదేశాల వీక్షణం సందర్శకుల మదిని దోచేస్తుంది. గోదావరి అందాలను తనివితీరా ఆస్వాదిస్తూ సాగే పాపికొండల సందర్శన కోసం రాష్ట్రం నలుమూలల నుంచి పర్యాటక ప్రియులు ఇక్కడకు వస్తుంటారు. దేశంలో సుదీర్ఘంగా సాగే నదీయాత్ర ఇదేనని కూడా అంటారు. ఎత్తైన కొండల మధ్య, దట్టమైన అడవుల గుండా వంపులు తిరుగుతూ పారే గోదావరి పాయలను పాపికొండల యాత్రలో ఆసాంతం కనులారా తిలకించవచ్చు. తూర్పుగోదావరిజిల్లా ప్రకృతి అందాల శిఖలో పాపికొండల యాత్ర ఓ మణిహారంగా చెప్పవచ్చు. ప్రశాంతమైన కాలుష్యరహిత వాతావరణంలో వెన్నెల రాత్రులు గడపాలని కోరుకునే వారికి ఈ ప్రాంతం ఓ అద్భుతమైన వేదిక.

1450 కిలోమీటర్లు ప్రయాణించి ఎన్నో చిన్న చిన్న నదులను తనలో కలుపుకుని మానేరు, ప్రాణహిత, ఇంద్రావతి వంటి ఉపనదుల సంగమంతో గోదావరి పాపికొండల మధ్య నుంచి రాజమండ్రి వైపునకు ఉరకలు వేసే దృశ్యం అద్భుతంగా ఉంటుంది. గోదావరి అందాలన్నీ పాపి కొండల వద్దే ఇమిడి ఉన్నాయా అనిపిస్తుంది. రాజమండ్రి నుంచి పాపికొండలు సుమారు 110 కి॥మీ॥ దూరంలో ఉన్నాయి.  ఎక్కువగా పురుషోత్తపట్నం, పట్టిసీమ, పోలవరం కేంద్రాలుగా గోదావరి పర్యాటకం నిర్వహిస్తున్నారు. ఇక్కడి నుంచి ప్రయాణం సుమారు 60 కిలోమీటర్లు ఉంటుంది. వినోదంతో పాటు ఆధ్యాత్మికత కూడా ఈ యాత్రలో  మేళవించి ఉంటుంది. పట్టిసీమ వీరభద్రేశ్వరస్వామి ఆలయంతో పాటు పోశమ్మగండిలోని గండిపోశమ్మ ఆలయం, దేవీపట్నంలో చాళుక్యుల కాలంనాటి ఉమాచోడేశ్వర స్వామి దేవాలయాలను కూడా సందర్శించవచ్చు.

రాజమండ్రి నుంచి నేరుగా పర్యాటక బోట్లు బయలుదేరవు. పశ్చిమ గోదావరి జిల్లా పట్టిసీమ, పోలవరం, తూర్పుగోదావరి జిల్లా పురుషోత్తపట్నం నుంచి బయలుదేరుతాయి. రాజమండ్రిలో టూరిస్టు బోట్ కార్యాలయాల్లో నేరుగా ప్రయాణం రిజర్వు చేసుకోవచ్చు. ఆయా బోట్‌ల యాజమాన్యమే బోట్ వద్దకు తరలించేందుకు రవాణా సదుపాయం కల్పిస్తాయి. వేసవిలో గోదావరి నీటిమట్టం తగ్గినపుడు మాత్రం పురుషోత్త పట్నం, పోలవరం నుంచే బోట్లు తిరుగుతాయి. టూరిజం శాఖతో పాటు ప్రైవేటు ఆపరేటర్లు కూడా లగ్జరీ, సాధారణ స్థాయి బోట్లు అందుబాటులో ఉంచారు. లాంచీల్లో ప్రయాణించాలనుకునే వారికి కూడా రాజమండ్రి నుంచి ప్రత్యేక ప్యాకేజీలు లభిస్తున్నాయి. రాజమండ్రి నుంచి బయల్దేరి గోదావరిలో లాంచీలు, బోట్లపై వెళ్ళి, పాపికొండలను సందర్శించే ప్రయాణం ఎవరికైనా ఓ అందమైన అనుభవంగా పదిలమవుతుంది.

# రాజమండ్రి

'శతాబ్దాల చరిత గల సుందర నగరం'గా ఆరుద్ర కళ్లకు 'అమరథామం'లా కనిపించినా... 'గోదావరి తీరంలో మట్టి బెడ్డను పెకిలిస్తే, అది సాహిత్య సువాసనలు కొడుతుంది' అని ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రికి అనిపించినా... 'గోదావరి వాఃపూరమఖిల భారతము మాదన్న నాడు' అని కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ భావించినా అది మన రాష్ట్ర సాంస్కృతిక రాజధాని రాజమహేంద్రి ఘన చరితమే. విజయకందళి, రాజమహేంద్రి, రాజమహేంద్రపురం, రాజమహేంద్రవరం, రాజమండ్రి... ఇలా ఎన్నో పేర్లు ఈ నగరానికి. 'రాజమహేంద్ర కవీంద్ర సమాజం' ఒకటి ఉండేదని ఆంధ్ర భారతంలో నన్నయ స్వయంగా పేర్కొన్నారు. గౌతమీ ప్రాంతీయ గ్రంథాలయంలో ఉన్న వరల్డ్ అట్లాస్‌లో ఈ నగరం క్రీ॥శ॥ 975-1045 మధ్యలో 'రాజమహేంద్రి' అని ఉంది. 10వ శతాబ్దంలో ఒక విదేశీయాత్రికుడు 30 'కోట పట్టణాలు' ఉన్నాయనీ, వాటిలో 'మహేంద్రి' ఒకటిగా వర్ణించాడు. శ్రీనాథుడు రాజమహేంద్రపురం అని వర్ణించగా, 1950 వరకు గ్రామీణులు 'రాజమంద్రం' అనేవారని ఒక కథనం.

తెలుగువారి సాంస్కృతిక రాజధాని అయిన రాజమహేంద్రి ఎన్నో చారిత్రక, పర్యాటక విశేషాలను తనలో దాచుకుంది. రాజమండ్రిలో పర్యటించేప్పుడు ప్రకృతి అందాలనే కాదు... ఇక్కడున్న చరిత్రను కూడా అధ్యయనం చేస్తే మంచి అనుభూతి కలుగుతుంది. నగరంలో గోదావరి గట్టున ఉన్న రాళ్ళబండి మ్యూజియం, దామెర్ల ఆర్ట్ గ్యాలరీ, గౌతమీ గ్రంథాలయం, కందుకూరి వీరేశలింగం ఇల్లు వంటి వాటిని తప్పక చూడాలి. పెద్ద మసీదు, లక్ష్మీనరసింహ ఆలయం, వీరేశలింగం జన్మగృహం, టౌన్‌హాల్, వీటీ హైస్కూలు వంటి అనేక భవనాలు శతాధిక సంవత్సరాల వయస్సు గలవే.





## ఉమామార్కండేయస్వామి ఆలయం

అతి పవిత్రమైన గోదావరి నదీ తీరంలోనున్న అతి ప్రాచీనమైన శివాలయాల్లో రాజమండ్రి శ్రీ ఉమామార్కండేయ స్వామి వారి దేవాలయం ఒకటి. అర్థాయుష్కుడుగా జన్మించిన మార్కండేయుడు శివుని వరంతో సంపూర్ణ అయుష్షును పొందాడు. కొంత కాలం తర్వాత తల్లిదండ్రుల ఆజ్ఞానుసారం మార్కండేయుడు తిరిగి గౌతమీ తీరానికి చేరి తాను ప్రతిష్ఠించిన శివలింగానికి పూజలు నిర్వహించి తపస్సు చేసాడు. ప్రసన్నుడైన పరమేశ్వరుడు మార్కండేయుని పేరు చిరస్థాయిగా నిలిచిపోవాలని అనుగ్రహించి, అతనిని తన దేహంలో ఐక్యం చేసుకున్నాడు. ఆ విధంగా మార్కండేయస్వామిగా ప్రసిద్ధి గాంచి నేటికీ విశేష పూజలు అందుకుంటున్నాడు. 11వ శతాబ్దంలో రాజమహేంద్రవరం రాజధానిగా ఏలిన చాళుక్య ప్రభువు రాజరాజ నరేంద్రుని అర్ధాంగి అమ్మంగదేవి ప్రాకారం నిర్మించి ఆలయాన్ని అభివృద్ధి చేసిందని చెబుతారు. ఆ తరువాత రెడ్డి రాజుల కాలంలో కాటయ వేమారెడ్డి భార్య మల్లాంచిక ఈ ఆలయాన్ని పునర్నిర్మింపజేసింది. తరువాత ఉప్పల వెంకయ్య దేవాలయానికి 300 చ॥గ॥ స్థలం ఇచ్చినట్టు, కొర్లెమర మల్లెమ్మ ఆలయాన్ని పునర్నిర్మించినట్లు దాఖలాలు ఉన్నాయి. ఈ ఆలయంలో ఉమామార్కండేయ స్వామి, పార్వతీదేవి, గణపతులు ప్రధాన దేవతలు. శ్రీలక్ష్మి నారాయణుడు క్షేత్రపాలకుడు. రాధాకృష్ణులు, లక్ష్మీనృసింహులు, నవగ్రహాలు షిర్డీ సాయి, వేంకటేశ్వర స్వామి, సుబ్రహ్మణ్యస్వామి, అయ్యప్పస్వామి, సూర్య నారాయణమూర్తులు కూడా ఈ దేవాలయంలో పూజలు అందుకుంటున్నారు.



## రాళ్ళబండి మ్యూజియం

శతాబ్దాల చరిత్రకు సాక్ష్యం రాళ్ళబండి మ్యూజియం. ఈ మ్యూజియం గోదావరి గట్టు సమీపంలో ఉంది. ఈ మ్యూజియంను 1967 మార్చి 1న రాష్ట్ర ప్రభుత్వం జాతీయం చేసుకునే సమయానికి 6,984 గ్రంథాలుండేవి. 1964లో ది డిస్క్రిప్టివ్ కాటలాగ్ ఆఫ్ తెలుగు మాన్‌స్క్రిప్ట్ పేరిట 528 పేజీలలో విషయవివరణలతో కూడిన వర్ణనాత్మక గ్రంథ సూచిలో 300కు పైగా తాళపత్ర గ్రంథాల వివరాలు పొందుపరచబడి ఉన్నాయి. తెలుగు సాహిత్యంలో ఉద్దండ పండితులైన గిడుగు వెంకట రామ్మూర్తి, చిలుకూరి నారాయణరావు తదితరులు వ్యక్తిగత సేకరణలైన అపురూప గ్రంథాలు ఇక్కడ నిక్షిప్తం చేశారు. ఈ గ్రంథాలలో విశాఖ, అనంతపురం జిల్లాలకు చెందిన తాళపత్ర గ్రంథాలున్నాయి. కాగా అనంతర కాలంలో ఈ గ్రంథాలయాన్ని కందుకూరి వీరేశలింగం గ్రంథాలయంలో విలీనం చేయడం జరిగింది. ప్రస్తుతం ఈ మ్యూజియంలో వేల ఏళ్ళకుచెందిన అనేక శిల్పాలు భద్రపరచబడ్డాయి.

## గౌతమీ గ్రంథాలయం

పుస్తక భాండాగారంగా పేరు గాంచిన గౌతమీ గ్రంథాలయం రాష్ట్రంలోనే రెండవ అతి పెద్ద గ్రంథాలయం. ఈ గ్రంథాలయం స్థానిక నాగదేవీ థియేటర్ ఎదురు వీథిలో ఉంది. ఎన్నో వేల అద్భుత గ్రంథాలు ఇక్కడ భద్రంగా ఉంచడం గమనార్హం. నాళం కృష్ణారావు 1898లో కందుకూరి వీరేశలింగం పేరిట రాజమండ్రి నాళం వారి సత్రంలో ఒక గ్రంథాలయాన్ని స్థాపించారు. వడ్డాది సుబ్బారాయుడు పేరిట మరొక గ్రంథాలయం కూడా ఏర్పడింది. ఈ రెండు గ్రంథాలయాలు ఏకమై 1920లో గౌతమీ గ్రంథాలయంగా ఏర్పడినట్టు తెలుస్తోంది. 1979లో ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న తరువాత ఇది ప్రాంతీయ గ్రంథాలయంగా అభివృద్ధి చెందింది. కందుకూరి నడిపిన వివేకవర్ధని పత్రిక ప్రతులు కూడా ఇక్కడ భద్రంగా ఉండడం విశేషం.

## దామెర్ల ఆర్ట్ గ్యాలరీ

ఆంధ్రదేశపు చిత్ర కళావికాసానికి తొలివన్నె దిద్దిన సిద్ధహస్తుడు దామెర్ల రామారావు. జీవించింది స్వల్పకాలమైనా చిత్రకళకు ఆయన చేసిన సేవ నిరుపమానమైంది. ఈయన పేరు మీద పోలీసుగెస్ట్‌హౌస్ సమీపంలో ఓ ఆర్ట్ గ్యాలరీని ప్రత్యేకంగా ఏర్పాటు చేయడం విశేషం. ఈయన గోదావరి తీరాన రాజమహేంద్రవరంలో 1897 మార్చి 8వ తేదీన జన్మించారు. రామారావు చిత్తరువులలో సిద్ధార్థ రాగోదయం, పుష్పాలంకారం, కార్తీకపూర్ణిమ, ద్రోణుడు-భారత రాకుమారులు, కైకేయీ దురాలోచన, నందిపూజ మొదలగునవి మచ్చుకు కొన్ని. చిత్రకళకు వన్నె తెచ్చిన దామెర్ల రామారావు గీసిన అపురూప కళాఖండాలు ఆయన స్మృత్యర్థం దామెర్ల ఆర్ట్ గ్యాలరీలో భద్రపరచబడ్డాయి.





## కందుకూరి స్మృతి చిహ్నాలు

తెలుగు నాట సామాజిక సాహిత్య రంగాల్లో నూతన ఒరవడి సృష్టించిన నవయుగ వైతాళికుడు కందుకూరి. 1848 ఏప్రిల్ 16న ఆయన రాజమండ్రిలో జన్మించారు. 1919, మే 17న తుదిశ్వాస విడిచే వరకూ కందుకూరి సమాజంలోని సాంఘిక దురాచారాలను అరికట్టేందుకు తీవ్రంగా కృషి చేసారు. 1881 డిసెంబరు 11న కందుకూరి తొలి వితంతు వివాహాన్ని జరిపించిన వివాహ వేదిక ప్రస్తుతం రాజమండ్రి మహిళా డిగ్రీ కళాశాలకు ఎదురుగా ఆనందా గార్డెన్స్‌లో ఉంది. ఈ ఆనందా గార్డెన్స్‌లోనే కందుకూరి సమాధులు కూడా ఉన్నాయి. మెయిన్‌రోడ్ సమీపంలో వంకాయల వారి వీధిలోని ఆయన స్వగృహం నేడు పురావస్తుశాఖ ఆధ్వర్యంలో ఉంది. ఆయన వాడిన కుర్చీలు, మంచాలు, టేబుళ్ళు, పుస్తకాలు అన్నీ ఇక్కడ భద్రంగా ఉన్నాయి.మెయిన్‌రోడ్డు సమీపంలోని కందుకూరి పురమందిరంలో ఆయన వాడిన కుర్చీని ప్రత్యేకంగా భద్రపరిచారు.



## ఇస్కాన్ దేవాలయం

భగవద్గీత సందేశాన్ని, హరేకృష్ణ మహా మంత్ర సంకీర్తనోద్యమం ద్వారా ప్రజలకు తెలియజేస్తూ, చైతన్యవంతులను చేస్తున్న అంతర్జాతీయ శ్రీకృష్ణచైతన్య సంఘం (ఇస్కాన్) ఆధ్యాత్మిక, సామాజిక సేవలో పునీతమవుతోంది. పవిత్ర గోదావరి తీరంలో గౌతమీఘాట్ ఆధ్యాత్మిక, ధార్మిక సముదాయాలలో నిర్మితమైన ఇస్కాన్ మందిరం గోదావరి జిల్లాలకి ప్రత్యేక ఆకర్షణ. పూజ్యశ్రీ ఎ.సి. భక్తి వేదాంతస్వామి ప్రభుపాదుల వారి ముఖ్యశిష్యులలో ఒకరైన పూజ్యశ్రీ త్రిదండి జయపతాకస్వామి ఆదేశం మేరకు రాజమండ్రిలో ఇస్కాన్ మందిరాన్ని స్థాపించారు.

# కోరుకొండ



జిల్లాలోని దర్శనీయ స్థలాల్లో కోరుకొండ శ్రీ లక్ష్మీనృసింహ స్వామి వారి దేవస్థానం ప్రసిద్ధ పుణ్యక్షేత్రంగా భాసిల్లుతోంది. దక్షిణ భారతదేశంలోనే విలక్షణంగా ఉన్న కోరుకొండ మంచి పర్యాటక కేంద్రంగా కూడా ఆకట్టుకుంటోంది. రాజమండ్రి-గోకవరం రోడ్డులో రాజమండ్రికి 20 కి॥మీ॥ దూరంలో కోరుకొండ దేవస్థానం ఉంది. క్రీ॥శ॥ 13వ శతాబ్దం కాకతీయుల కాలంలో రూపుదిద్దుకున్న కోరుకొండ శ్రీలక్ష్మీనృసింహస్వామి వారి దేవస్థానం ఆధ్యాత్మిక ఆరామతీరంగా, పుణ్యక్షేత్రాలున్న ధన్యభూమిగా తూర్పుగోదావరి జిల్లాలో మకుటాయ మానంగా విరాజిల్లుతోంది. 13వ శతాబ్దంలో పునర్నిర్మిత మైన అత్యంత ప్రాచీన దేవాలయాలలో ప్రసిద్ధి చెందినది "కోరుకొండ". స్వామి వెలసిన పరాశరగిరి కొండ పిరమిడ్ ఆకారంలో ఉంటుంది. కొండ దిగువన నృసింహస్వామి వారి పాదాలున్నాయి. భక్తులు ముందుగా ఈ పాదాలకు నమస్కరించి తరువాత కొండను అధిరోహించడం ప్రారంభిస్తారు. దాదాపు 618కి పైగా ఉన్న మెట్లను ఎక్కితే స్వామి నిజరూప దర్శనం అవుతుంది. గర్భగుడిలోకి అడుగుపెట్టి చూస్తే అంతా చీకటిగా ఉంటుంది. కర్పూరం వెలుగులో స్వామి వారిని అర్చకస్వాములు చూపించినప్పుడు కలిగే ఆనందం వర్ణనాతీతం. సాధారణంగా వాస్తురీత్యా వైష్ణవదేవాలయాల ముఖద్వారం తూర్పు వైపునకు ఉంటాయి. కానీ లక్ష్మీనృసింహ స్వామి కొండపైన దేవాలయం ప్రధాన ముఖద్వారం పశ్చిమ వాయువ్య దిశలో ఉంటుంది. కొండపై నుంచి చూస్తే సుమారు 10 కిలోమీటర్ల దూరంలో ఉన్న చుట్టుపక్కల ప్రాంతాలు, గోదావరి నది, చెరువులు, తోటలు, పంటపొలాలు ఎంతో ఆహ్లాదకరంగా కనిపిస్తాయి. దేవస్థానం చుట్టూ అనేక వరుసలలో రామాయణ గాథను తెలిపే శిల్పాలు కఠినమైన నల్లని శిలలపై చెక్కబడి అత్యద్భుతంగా ఉంటాయి. కోరుకొండకు కాపవరం, తంటికొండ మొదలైన ప్రాంతాలు దగ్గరలోనే ఉండడం వలన కొండపైనుండి అవి కూడా కనిపిస్తాయి.



**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 8 కి.మీ. |
| రాజమండ్రి | 20 కి.మీ. |
| కాకినాడ | 60 కి.మీ. |
| అమలాపురం | 88 కి.మీ. |
| రావులపాలెం | 52 కి.మీ. |
| తుని | 98 కి.మీ. |




# తంటికొండ

తంటికొండ గోకవరమునకు పశ్చిమముగా ఉంది. తంటికొండకు శ్రీ వేంకటేశ్వర ఆలయం వలన వేంకటగిరి అని కూడా పిలవబడుచున్నది. తంటికొండ గ్రామమునకు దక్షిణమున సుమారు 200 అడుగుల ఎత్తైన కొండ ఉంది. ఈ కొండపై పరమేశ్వరుని పాద చిహ్నాము, గోష్పాద చిహ్నాము, నాగసర్ప చిహ్నాములు ఉన్నాయి. ఈ చిహ్నాములు ఎలా వచ్చాయనడానికి అనేక రకాల కథనాలు ప్రచారంలో ఉన్నాయి. మొదట పశ్చిమ దిశ నుండి తర్వాత తూర్పు దిశ నుండి మెట్లు నిర్మింపబడినవి. అటు తర్వాత కొండపైకి రోడ్డు మార్గము ఏర్పాటు చేసారు.



తంటికొండ సమీపాన గల కోరుకొండలోని శ్రీలక్ష్మీ నృశింహస్వామి మొదట ఈ కొండపై కాలు వేసారని, అంతట ఈ కొండ వణకడం వల్ల స్వామివారు కోరుకొండపై వెలిసారని కొందరి కథనం. కొండపై దేవతాశక్తి ఉందని, అప్పుడప్పుడు ఒక దివ్యతేజం ఇక్కడ కనిపిస్తుందని మరికొందరు చెబుతారు. కొండపైగల ఈ పాదచిహ్నాము స్పష్టముగా కనిపిస్తుంది.

ఈ పాదచిహ్నామునకు 100 అడుగుల దూరంలో పశ్చిమదిశగా ఒక రాయిపై గోష్పాద చిహ్నాము ఉంది. దైవారాధన కొరకు గోవు ఒకటి ఇక్కడికి వచ్చునపుడు కాలి గుర్తు పడిందని చెబుతారు. ఈ చిహ్నామునకు దగ్గరలో సర్ప చిహ్నాము కూడా ఉంది. దీని వలన ఇచ్చట సుబ్రహ్మణ్య స్వామి ఉన్నాడని ప్రజలు పూజలు చేస్తారు.

ఇంతకు పూర్వం ఒక నాటక సమాజము గ్రామములో నాటక ప్రదర్శన ఇచ్చి కొండ మీద విశ్రమించినప్పుడు వారికి ఒక దివ్య తేజము కనిపించినదని స్థానికుల కథనం. 1961లో కొండపై స్వామి ప్రతిష్ట జరిగినదని తెలియుచున్నది. స్వామి వారి విగ్రహమును తిరుపతి నుండి తీసుకొని వచ్చి ప్రతిష్టించారు. లక్ష్మీదేవి విగ్రహమును











కుడివైపున ప్రతిష్టించారు. ప్రధానాలయం ఎదురుగా గరుడాళ్వార్‌ను, దక్షిణమున పాదచిహ్నాము వద్ద శ్రీ ఆంజనేయస్వామి ఆలయం, పశ్చిమ దిశలో అలివేలు మంగ ఆలయం నిర్మించారు. కొండ ఎక్కు మార్గ మధ్యంలో గోవిందరాజస్వామి ఆలయం ఉంది. ఈ ఆలయానికి వాయువ్య దిశలో విఘ్నేశ్వరాలయం ఉంది. మరికొంత దూరంలో శ్రీరామ క్రతు స్తంభము కూడా నిర్మించబడినది. స్థానిక మహిళను శ్రీ వేంకటేశ్వర స్వామి ఆవహించి ఈ కొండ ప్రక్కన విగ్రహములు ఉన్నాయని చెప్పగా, అక్కడ తవ్వి చూడగా లభించిన విగ్రహములను గోవిందరాజస్వామి ఆలయంలో భద్రపరిచారు.

ఈ కొండనెక్కి పాలు పొంగించి దేవుని కొలుచుట వలన పంటలు బాగా పండి, సంపదలు కలుగుతాయని భక్తులు విశ్వసిస్తారు. ప్రతి సంవత్సరమూ వైశాఖశుద్ధ ఏకాదశికి శ్రీ వేంకటేశ్వర స్వామి కళ్యాణము జరుగును. అలాగే శ్రీకృష్ణాష్టమి, దేవీ నవరాత్రులు, ధనుర్మాసము, మాఘశుద్ధ పంచమి రోజున వార్షికోత్సము జరుగును.

**దర్శన సమయం:**
ఉదయం గం॥ 6.00 నుండి గం॥ 11.00 వరకు,
సాయంత్రం గం॥ 5.00 నుండి గం॥ 8.00 వరకు,
**ఫోన్:** 0883-2456271, **E.O. :** 9912755447.

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 24 కి.మీ. |
| రాజమండ్రి | 35 కి.మీ. |
| కాకినాడ | 75 కి.మీ. |
| అమలాపురం | 103 కి.మీ. |
| రావులపాలెం | 67 కి.మీ. |
| తుని | 113 కి.మీ. |



# ధవళేశ్వరం

సుడులు తిరుగుతూ... జడలు విరుచుకుని ఉప్పొంగి ప్రవహించే అఖండ గోదావరి, ఆ శ్రమజీవి కార్యదీక్షకు తలొగ్గింది. దౌడు తీసే గుర్రానికి కళ్ళెం వేసి కావలసిన రీతిలో నడిపించే రౌతులాగా ఆ మహనీయుడు ఏర్పరచిన బాటలో ప్రయాణించి బీడుభూములను సస్యశ్యామలం చేసింది. దీనికి కారణం, అసాధ్యాన్ని సుసాధ్యం చేసి, క్షామాన్ని... క్షేమంగా మార్చిన మహనీయుడు 'సర్ ఆర్థర్ థామస్ కాటన్' గోదావరి నదిపై ధవళేశ్వరం వద్ద నిర్మించిన ఆనకట్ట. ఇంతటి బృహత్తర నిర్మాణం అప్పట్లో ప్రపంచంలో ఎక్కడా నిర్మించబడలేదు.



అవి 1830 నాటి ముందు రోజులు, నిత్యం వరదలు, అకాల వర్షాలు, మహా క్షామంతో ప్రజలు అల్లాడేవారు. 1831లో అతివృష్టి, 1832లో గాలీవాన, 1833లో సంభవించిన క్షామంతో ఉత్తరాంధ్రలో జన జీవనం అతలాకుతలమైంది. వారి పరిస్థితి దుర్భరంగా మారింది. సారవంతమైన నేల... అశేష నీటి వనరులున్నా... క్షామం కరాళనృత్యం చేసింది.

ఇటువంటి పరిస్థితులలో వృథాగా పోతున్న గోదావరి జలాలను బీడు భూముల్లోకి మళ్ళిస్తే వరదలు తగ్గించవచ్చని, తద్వారా వ్యవసాయం జరిగి, రెవెన్యూ పెరుగుతుందని, మద్రాసు ప్రభుత్వం పరిపాలనా విభాగంలో పనిచేస్తున్న హెన్రీ మౌంట్ గోమరీ అంచనా వేశాడు. ఇందుకు సమర్థుడైన ఆర్థర్ కాటన్‌ను సంప్రదించాడు. కనీస ప్రయాణ సౌకర్యాలు... ఆధునిక పరిజ్ఞానం అందుబాటులో లేని ఆ రోజుల్లో కాటన్ ఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి సర్వే పూర్తి చేసి, ప్రవాహ వేగం తక్కువగా ఉన్న, డెల్టాలోని నాలుగు పాయలుగా విడివడిన ధవళేశ్వరం వద్ద ఆనకట్ట నిర్మాణానికి సరైనదిగా నిర్ణయించి, రూ.4,75,572 అంచనాలతో ఒక నివేదికను ప్రభుత్వానికి పంపాడు. 1847 జనవరిలో ఆనకట్ట నిర్మాణ బాధ్యతలు ప్రభుత్వం ఆర్థర్ కాటన్‌కు అప్పగించింది.



ఐదేళ్ళ కాలం... పది లక్షల వ్యయం... పది వేల మంది కూలీలతో ధవళేశ్వరం వద్ద 1852లో ఆనకట్ట నిర్మించాడు కాటన్. నాలుగు కిలోమీటర్ల పొడవు గల ఆనకట్టలు, 500 మైళ్ళ నిడివిగల ప్రధాన కాలువలు 2000 మైళ్ళ నిడివిగల డిస్ట్రిబ్యూటరీలు నిర్మించారు. దీంతో గోదావరి డెల్టాలో 7 లక్షల ఎకరాలకు సాగునీటి సౌకర్యం కల్పించబడింది. ఆయన మేధోసంపత్తికి, ధైర్యసాహసా లకు, అప్పటి కార్మిక శక్తికి అపురూప నిదర్శనం ఈ కట్టడం. శిథిలావస్థకు చేరిన ఆనకట్ట స్థానంలో బ్యారేజీ నిర్మించి సర్ ఆర్థర్ కాటన్ బ్యారేజీగా నామకరణం చేశారు. దీనివల్ల సుమారు 11 లక్షల ఎకరాలకు పుష్కలంగా సాగునీరందుతూ ఉభయ గోదావరి జిల్లాలు ఆంధ్రా ధాన్యాగారాలుగా ఖ్యాతినొందాయి.

వందల ఏళ్ళ క్రితం సున్నం, రాతితో కట్టబడ్డ కాటన్ కట్టడాలలో చాలా వరకు ఇప్పటికీ చెక్కు చెదరలేదు. కాటన్‌కు సంబంధించిన వివరాలతో కాటన్ మ్యూజియంను 1988లో అప్పటి ఛీఫ్ ఇంజనీర్ పి. మదన్‌గోపాల్ ప్రత్యేక శ్రద్ధతో ఏర్పాటు చేశారు. కాటన్ జీవిత విశేషాలతో పాటు ఆనకట్ట నిర్మాణంలో వాడిన అప్పటి యంత్ర పరికరాలు మొదలైనవి ఎన్నో ఈ మ్యూజియంలో ఉన్నాయి. ప్రస్తుతం ఈ మ్యూజియం నీటిపారుదలశాఖ ఆధ్వర్యంలో ఉంది. అప్పటి దుర్భర పరిస్థితులు... కాటన్ ఆనకట్ట నిర్మాణం కోసం శ్రమించిన విధానం... తైలవర్ణ చిత్రాలుగా మ్యూజియంలో కళ్ళకు కట్టినట్లు దర్శనమిస్తాయి.

### ఎంత దూరం...

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 20 కి.మీ. |
| రాజమండ్రి | 5 కి.మీ. |
| కాకినాడ | 64 కి.మీ. |
| అమలాపురం | 57 కి.మీ. |
| రావులపాలెం | 26 కి.మీ. |
| తుని | 110 కి.మీ. |



# కడియం




ఇక్కడి మట్టిలో ఏ మహత్తు ఉందో... గడ్డి మొక్క కూడా అందమైన పూలదృశ్యమవుతుంది. అడుగుపెడితే చాలు... మనసు పరవశిస్తుంది. పుట్టే ప్రతి మొక్కా... బోసినవ్వుల పాపాయిలా కనిపిస్తుంది. అక్కడ ప్రతి ఇల్లు... ఓ పూలవనం. పర్యావరణాన్ని కాపాడేందుకు మేమూ ఉన్నామంటూ పిలుస్తున్నాయి కడియం నర్సరీలు. ఎటుచూసినా రంగురంగుల పూలు సుగంధ పరిమళాలు వెదజల్లుతూ స్వాగతం పలుకుతాయి. ఊహకందని ఎన్నోరకాల మొక్కలు హెుయలొలకబోస్తూ కనువిందు చేస్తాయి. మధురమైన పండ్ల తోటలందించే చల్లటి చిరుగాలులు... పూలమకరందం కోసం తుమ్మెదలు చేసే ఝుంకారనాదాలు... పక్షుల కుహుకుహురాగాలు... తోటల్లో సెలయేరుల్లాంటి నీటి బోదెలు... వెరసి సుందర దృశ్యాల కొలువుగా, మంజుల భావాల నెలవుగా భాసిల్లుతున్నాయి కడియం నర్సరీలు.

కడియం మండలంలోని బుర్రిలంక, కడియపులంక, వెంకాయమ్మపేట, పొట్టిలంక, కడియపుసావరం, కడియం, వీరవరం, జేగురుపాడు, దామిరెడ్డిపల్లి, వేమగిరి, మురమండ, దుళ్ళ గ్రామాల పరిధిలో దాదాపు ఆరు వేల ఎకరాల్లో, 700 నర్సరీలు ఉన్నాయి. ఒకేచోట ఇంత పెద్ద విస్తీర్ణంలో నర్సరీల సాగు మరెక్కడా లేకపోవడం ఒక ప్రత్యేకత. దేశంలోని అన్ని రాష్ట్రాలతో పాటు విదేశాలకు కూడా ఇక్కడి నుండి మొక్కలు ఎగుమతి అవుతుంటాయి.

1902లో రావు చిన్నారావు విదేశాల నుంచి కొన్ని మొక్కలు సేకరించి ఇక్కడ 'రాయల్ నర్సరీ' స్థాపించారు. అది మొదలు దినదిన ప్రవర్ధమానమైన కడియం నర్సరీ పరిశ్రమ విశ్వవిఖ్యాతమైంది. సాధారణ కరివేపాకు మొక్కనుండి సైకస్, పైకస్ వంటి ఖరీదైన మొక్కలు కూడా కడియం నర్సరీల్లో ఉత్పత్తి అవుతున్నాయి. ఆకులే పువ్వులుగా మారే పాన్సిటియా, పందిరిలా అల్లుకుని రమణీయమైన పూలనిచ్చే క్రీపర్, సువాసనలు గుప్పుమనిపించే కర్ణాంకా కిరికిరి వంటి సంపెంగ, ఆకారంలోనూ పరిమాణంలోనూ కోడిగుడ్డులా ఉండే కోడిగుడ్డు సంపెంగ, ఊడలు తిరిగి...ఏళ్ళ వయస్సున్నా... చిన్నపాటి కుండీల్లో అమరిన వామన వృక్షాలు(బోనసాయ్), మట్టిలేకుండానే అల్మారాల్లో పెరిగే లక్కీ బేంబో, ఎండ లేకపోయినా బెడ్‌రూముల్లో పెంచుకునే ఇండోర్ ప్లాంట్స్, రాకీక్రీపర్, జీనస్ ప్లాంట్, సీతమ్మవారి వాలుజడ, ముళ్లతో పెరిగే కాక్టస్ ఇలా... కోకొల్లలుగా పూలమొక్కలు కనువిందు చేస్తాయి. ఇవే కాక కనకాంబరం, బంతి, చామంతి, గులాబి, మల్లె వంటి పూలతోటలు దారిపొడుగునా ఆహ్లాదాన్ని అందిస్తాయి. వాటర్‌యాపిల్, సపోటా, నారింజ, ద్రాక్ష, మామిడి, జామ, బొప్పాయి, కొబ్బరి, చింత, పనస, అరటి వంటి పండ్ల మొక్కలు పూలతోట నడుమ ఉండి పర్యాటకులకు మధురమైన రుచులను అందిస్తున్నాయి. ఆకుపచ్చని తివాచీల్లాంటి లాన్ మధ్యలో సేద తీర్చే రకరకాల మొక్కలతో ఈ ప్రాంతం ఎంతో హాయిగా ఉంటుంది. దేశ విదేశాల నుంచి నిత్యం సందర్శకులు కడియం నర్సరీలకు వస్తుంటారు. బంధుమిత్ర కుటుంబ సపరివారంగా వచ్చి రోజంతా ఉల్లాసంగా గడుపుతారు.

కడియపులంక పూల మార్కెట్‌లో రాశులుగా పోసిన పువ్వులు ఇంద్రధనస్సుల్లా కనిపిస్తాయి. కడియపు సావరంలో ఆరేళ్ల పాపాయి నుంచి 60 ఏళ్ల వృద్ధుల వరకూ పూలపనే. ఇక్కడ ఏ ఇంట చూసినా పువ్వులు గుట్టలుగా పోసి, చుట్టూ కూర్చుని మాలలుగా మలిచే వారే కనిపిస్తారు. కడియంలో పిచ్చిమొక్కలు కూడా ఏపుగా ఎదిగి చక్కగా విచ్చుకుని పలకరిస్తాయి. అందుకే సినీకెమేరాకళ్లు నిత్యం కడియం పూలవనాల చుట్టూ ప్రదక్షిణలు చేస్తుంటాయి. పచ్చని నర్సరీల మధ్య అందమైన దృశ్యకావ్యాలను తమ కెమెరాలలో బంధించే దృశ్యాలు ఇక్కడ సర్వసాధారణం. కడియం వస్తే చక్కగా సినిమా షూటింగ్‌ను కూడా చూడొచ్చు.

కడియం నర్సరీలు ఐదో నంబర్ జాతీయ రహదారిని ఆనుకుని రాజమండ్రి నగరానికి 10 కి॥మీ॥ దూరంలో గోదావరినది ఒడ్డున ఉన్నాయి. రాజమండ్రి నుంచి నేరుగా కడియం లేదా కడియపులంక వచ్చి నర్సరీలను చూడవచ్చు. ఆటోలు, సిటీ, ఆర్టీసీ బస్సుల సదుపాయం ఉంది. సుదూర ప్రాంతాల నుంచి వచ్చిన సందర్శకుల కోసం కడియపులంకలో ప్రభుత్వం 'బృందావన' అతిథిగృహాన్ని ఏర్పాటు చేసింది. అలాగే పేరుమోసిన నర్సరీల్లో పర్యాటకుల కోసం గెస్ట్‌హౌస్‌లను కూడా నిర్మించింది. వేమగిరి, కడియపులంక, కడియం ప్రాంతాల్లో పర్యాటకుల కోసం భోజన హోటళ్ళు కూడా ఉన్నాయి.

## పిచ్చుకలంక

ఉభయగోదావరి జిల్లా వాసులు రాకపోకలు సాగించే కాటన్ బ్యారేజీకి సమీపంలో పిచ్చుకలంక ఏర్పడింది. రాజమండ్రికి అతిచేరువగా ఉన్న పిచ్చుకలంక ప్రాంతం నిత్యం పర్యాటకులతో సందడిగా ఉంటుంది. ఇక్కడే కాటన్ బ్యారేజి, మ్యూజియం, గోదావరి పరీవాహక ప్రాంతం, ఆహ్లాదకరమైన వాతావరణం ఉండటంతో సాయంత్రం వేళల్లో పర్యాటకులు కుటుంబ సభ్యులతో తరలివచ్చి ప్రకృతి అందాలను ఆస్వాదిస్తారు. ఈ ప్రాంతం పర్యాటకులను ఎంతగానో ఆకట్టుకోవడంతో కాసేపు కాలక్షేపం చేసి వెళుతుంటారు. రెండు జిల్లాలకు చెందిన వారధి కావడంతో ఎక్కువగా ప్రయాణాలు కూడా సాగుతూ ఉంటాయి. సెలవు దినాల్లో ఈ ప్రాంతం రద్దీగా ఉంటుంది.

### ఎంత దూరం...

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 24 కి.మీ. |
| రాజమండ్రి | 10 కి.మీ. |
| కాకినాడ | 62 కి.మీ. |
| అమలాపురం | 57 కి.మీ. |
| రావులపాలెం | 23 కి.మీ. |
| తుని | 110 కి.మీ. |












# గుమ్మిలేరు

రాష్ట్ర రాజధాని హైదరాబాద్‌లో ఉన్న బిర్లామందిర్ రూపురేఖలతో రావులపాలెం-మండపేట రోడ్డులో ఆలమూరు మండలం గుమ్మిలేరులో జైనమతంలో 23వ తీర్థంకరుడైన పార్శ్వనాథ్ భగవాన్ ఆలయం రూపుదిద్దుకుంది. రాజస్థాన్ రాష్ట్రానికి చెందిన శిల్పి గణపతిలాల్ శర్మ ఆధ్వర్యంలో 15 మంది కళాకారులు పాలరాతితో ఈ నిర్మాణం చేపట్టారు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల్లో నివసిస్తున్న జైనులతో పాటు పలు రాష్ట్రాల నుంచి అధికసంఖ్యలో భక్తులు ఇక్కడికి వస్తున్నారు. భక్తుల రాకపోకలకు అనుగుణంగా గుమ్మిలేరులో ప్రత్యేక ఏర్పాట్లున్నాయి. పార్శ్వనాథ్ భగవాన్ జన్మదిన వేడుకలకు రాష్ట్రంలోని జైనులతో పాటు రాజస్థాన్ మొ॥ వివిధ ప్రాంతాల నుంచి భక్తులు వస్తుంటారు.

గుమ్మిలేరు వద్ద 1966లో కాలువ తవ్వకాల్లో పార్శ్వనాథ్ భగవాన్ విగ్రహం బయటపడింది. దీన్ని స్థానికులు బుద్ధుడి విగ్రహంగా భావించి కాలువగట్టుపై పాకవేసి అక్కడ ఉంచారు. రాజమండ్రిలోని జైనులు ఈ విగ్రహాన్ని పరిశీలించి జైనమతానికి చెందిన పార్శ్వనాథ్ భగవాన్‌గా గుర్తించి చిన్న ఆలయాన్ని నిర్మించి పూజలు చేయడం ప్రారంభించారు. పురాతన విగ్రహంగా భావించి దీనిని దొంగిలించడానికి ప్రయత్నించడంతో విగ్రహాన్ని కాకినాడ తరలించేందుకు ఏర్పాట్లు చేశారు. అందుకు గుమ్మిలేరు గ్రామస్థులు సమ్మతించలేదు. ఈ విగ్రహం లభించిన తర్వాత వ్యవసాయం, పాడి పరిశ్రమగానే గుర్తింపు ఉన్న గుమ్మిలేరు వ్యాపారపరంగా అభివృద్ధి చెందింది. గ్రామస్తులు ఇది తమకు శుభసూచకంగా పరిగణించారు. ఈ మేరకు ఇక్కడే జైన ఆలయ నిర్మాణానికి సిద్ధమయ్యారు. విగ్రహం లభ్యమైన ప్రాంతం పక్కనే పొలం కొనుగోలు చేసి ఆలయ నిర్మాణానికి శ్రీకారం చుట్టారు.

జైన ఆలయ నిర్మాణం పూర్తిగా శాస్త్రీయ పద్ధతిలో జరుగుతోంది. రాజస్థాన్ నుంచి తీసుకువచ్చిన పాలరాతితో నిర్మాణం చేపట్టారు. ఆలయ నిర్మాణంలో ఇనుము ఉపయోగించకపోవడం విశేషం. దాదాపు ఉభయ గోదావరి జిల్లాల్లో లభ్యమైన జైన విగ్రహాలన్నిటిని ఇక్కడికి తరలించి, ఈ ఆలయంలో ఏర్పాటు చేశారు. జైన మతంలో అత్యంత శక్తివంతమైన అవతారంగా భావించే పార్శ్వనాథ్ భగవాన్ విగ్రహం ఉభయగోదావరి జిల్లాల్లో లభ్యమైన విగ్రహాల్లో ఇది ఒక్కటే కావడం విశేషం.

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 50 కి.మీ. |
| రాజమండ్రి | 37 కి.మీ. |
| కాకినాడ | 45 కి.మీ. |
| అమలాపురం | 50 కి.మీ. |
| రావులపాలెం | 13 కి.మీ. |
| తుని | 106 కి.మీ. |










# చింతలూరు



రాష్ట్రంలోనే ఏకైక ధన్వంతరి దేవాలయం ఆలమూరు మండలం చింతలూరులో నెలకొనటం విశేషం. ఈ ఆలయంలోని ధన్వంతరి స్వామి మూలవిరాట్ విగ్రహం చూడముచ్చటగా ఉంటుంది. ఆరోగ్యప్రదానం చేస్తున్నట్లు స్వామి కనిపిస్తాడు. ధన్వంతరి స్వామి ఈ గ్రామంలో ఎప్పుడు వెలిసిందీ స్పష్టంగా లేదుగాని 1942లో ఈ ఆలయాన్ని నిర్మించారు. అప్పటి నుండి ఇప్పటి వరకూ ఈ ఆలయం భక్తులతో కిటకిటలాడుతోంది. దర్శనభాగ్యంతోనే సర్వరోగ నివారణ కలిగించే శక్తి గల స్వామిగా కొలవబడుతున్నారు ధన్వంతరిస్వామి. ఆయుర్వేద రంగానికి ఆరాధ్యుడైన ధన్వంతరి స్వామి దేశవ్యాప్తంగా పేర్గాంచిన వేంకటేశ్వర ఆయుర్వేద నిలయం పర్యవేక్షణలో నిత్య ధూప, దీప నైవేద్యాలతో కొలవబడుతున్నారు. ధన్వంతరి స్వామిని దర్శనం చేసుకుంటే చాలు రోగాలు తగ్గుతాయని శాస్త్రం చెబుతోంది. శ్రీమన్నారాయణుడి ఏకవింశతి అవతారాల్లో పన్నెండోది ధన్వంతరి అవతారం. దేవదానవులు అమృత సంపాదనకై క్షీరసాగరాన్ని మధించే తరుణంలో శంఖ చక్రౌషధ సుధాకలశములు నాలుగు హస్తములలో ధరించి పాల కడలి నుంచి బయలు వెడలిన విష్ణ్వాంశ సంభూతుడు ధన్వంతరి. దుర్వాస మహాముని శాపంతో రోగభూయిష్ఠమైన స్వర్గలోకంలో ఆయుర్వేద ప్రచారకుడై, ఆరోగ్య ప్రదాతయై ఆరాధ్య దైవమయ్యాడు ఈ స్వామి. అంతేకాదు ద్వితీయ ద్వాపర యుగమున భూలోకంలో కాశీ రాజ్యాన్ని పరిపాలించిన చంద్రవంశ రాజు ధన్వనృపాలున కనుంగు పుత్రుడై జన్మించి, ధన్వంతరి నామంతో చాలా కాలం రాజ్యపరిపాలన చేసి తిరిగి దైవత్వం పొందినట్టు పురాణం చెబుతోంది.

ధన్వంతరిని ఆయుర్వేద రంగానికి ఆరాధ్యదైవంగా కొలుస్తారు. ఆయన కరుణాకటాక్షాలతోనే ఆయుర్వేద రంగం నడుస్తోందని పలువురు ఆయుర్వేద పండితుల విశ్వాసం. ఆయుర్వేద పండితుడు, వేంకటేశ్వర ఆయుర్వేద నిలయం వ్యవస్థాపకుడైన 'వైద్యరాజ' ద్విభాష్యం వేంకటేశ్వర్లు భక్తి ప్రవత్తులతో ధన్వంతరిస్వామిని చింతలూరులో 1942లో ప్రతిష్ఠించి నిత్య ధూపదీప నైవేద్యాదులకు శాశ్వత భూవసతి కల్పించారు. అనంతరం ఆయన కుమారుడు సూర్యనారాయణమూర్తి ఆధ్వర్యంలో ఆలయ నిర్వహణ జరిగింది. వేంకటేశ్వర ఆయుర్వేద నిలయం ప్రస్తుత మేనేజింగ్ డైరెక్టర్ డాక్టర్ ద్విభాష్యం వెంకటశ్రీరామమూర్తి ఆధ్వర్యంలో ఆలయాన్ని పునరుద్ధరణ చేశారు. ఆలయాన్ని సర్వాంగసుందరంగా తీర్చిదిద్దారు.

**ఎంత దూరం...**

| | |
|---|---|
| రాజమండ్రి (విమానాశ్రయం) | 46 కి.మీ. |
| రాజమండ్రి | 35 కి.మీ. |
| కాకినాడ | 49 కి.మీ. |
| అమలాపురం | 47 కి.మీ. |
| రావులపాలెం | 10 కి.మీ. |
| తుని | 110 కి.మీ. |

